Aluru Madhusudana Rao.
S.S.L.C.

Approved by Text Book Committee For Higher Forms
Class use - vide page 22 Dated 26-5-47.



# మీనాంబిక

[తెలుఁగు చరిత్రాత్మక నవల]


సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ,

**పి. గణపతిశాస్త్రి, (P. O. L.)**

సంస్కృతాంధ్రపండితులు, వీరేశలింగాస్తికోన్నత పాఠశాల

రాజమహేంద్రవరము.







ప్రచురణకర్తలు:

**రౌతు బుక్కు డిపో.,**

విద్యావిషయక ప్రకాశకులు

రాజమహేంద్రవరము

౧౯౪౭


 [మూల్యము రు ౧-౪-౦.

# ఆ ము ఖ ము

నాకుఁ జిన్నతనమునుండియు విజయనగరసామ్రాజ్య చరిత్ర పఠించుటయనిన నెక్కువ యిష్టము. అందును, నాయక రాజ్యస్థాపకుఁడగు విశ్వనాథనాయకుని చరితమన్న మఱింత యిష్టము. ఇందు, రాజభక్తి పారవశ్యమునఁ దండ్రితోఁగూడఁ బోరుటకు వెనుదీయని యామహావీరుని చరిత మితివృత్తముగాఁ దీసికొంటిని.

ఇందలి ప్రధానపాత్రములును నితివృత్తమును జరిత్ర ప్రసిద్ధములే. ఒకటి రెండు పట్టుల నవలారచనమున కనుకూల మగునట్లు కొన్ని చిన్ని చిన్ని మార్పులు చేసితిని. ముఖ్యముగ నానాటిపరిస్థితులు కనులకుఁ గట్టునట్లు చేయుటకుఁ గొంతశ్రమ పడితిని. ఫలితము సహృదయైకవేద్యము.

నా నవలారచన విని, వెంటనే శ్రీ "రౌతు" వారిది ప్రకటించుట కియ్యకొనిరి. వారి యెడల నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

మహాకవి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి కీనవల చూపితిని, వారిది సాంతముగఁ జదివి, సాదరముగఁ బరిచయ వాక్యములు వ్రాసి యిచ్చిరి. కృతజ్ఞతానివేదన మాత్రమున వారి ఋణము తీరదనుకొందును!

మన్మిత్రులు శ్రీ వారణాసి సూర్యనారాయణశాస్త్రి గారినవల వ్రాతప్రతియంతయుఁ జదివి, యక్షరస్ఖాలిత్యములు లేకుండ సరిచూచి యిచ్చినందులకు, వారియెడలఁ గృతజ్ఞుఁడను.

"మీనాంబిక" యున్నత పాఠశాలలలోని విద్యార్థుల కాంధ్రుల చరిత్రపై నాదరాభిమానములు గల్గించునని నా నమ్మిక.

పిలకా గణపతిశాస్త్రి.



# పరిచయ వాక్యములు

శ్రీ పిలకా గణపతిశాస్త్రిగారు 'మీనాంబిక' అను గద్యకావ్యమునకు నన్ను పరిచయవాక్యములు వ్రాయవలసిన దని యడుగుట వారికి నాయందుఁగలదయ. ఇందలికథ ఆంధ్ర చరిత్రలో సుప్రసిద్ధమైన ఘట్టము. పరదేశనవలలు తర్జుమా చేయుట, పరదేశచరిత్రాంశము నల్లిబిల్లిగా నల్లుటకన్న నెంతయో యవసరమైనపని మనదేశపు పూర్వచరిత్ర మందఱకుఁ దెలియఁజేయుట. మనదేశమున ననేకులు యువకవులు పద్యములు, పాటలు వ్రాసి తమ కవితనము సార్థకమైనదను కొందురు. అనేకములైన యాంధ్రచరిత్ర కథాంశములు లోకమునకు తెలియవలసియున్నవి. పూర్వకాలపు తెలుగుల ఆచారము, తెలుగుసంఘము, రాజనీతి, ఆంధ్రులయౌన్నత్యము ప్రతిబింబించు గద్యగ్రంథములు వ్రాసి యాకథలను తమప్రతిభచే వెలిగించి రమ్యముగాఁజూపుట ప్రతియాంధ్రకవియొక్కయు విధి. ఎంతసేపు వంగీయులను, హిందీయులను చూచి వారే కవులు, వారే నవలారచయితలు అనుకొని ఆ పాత్రములు చేతఁబూని తిరుగుట సారస్వతీయమర్యాద యనుకొనుట కన్నఁ దెలుగుయువకవులు తమ మాతృభాషలో గద్యము నవలంబించి దివ్యములైన రచనలు చేయవచ్చును. నేఁటి తెలుగుయువకవులలో చక్కని తెలుగు వచనరచన చేయువారు చాలమంది

కలరు. వారు గద్యప్రబంధము లేల వ్రాయరు? ఆ కావ్యము లాంధ్రజాతి పూర్వాధునిక పరిస్థితుల నేల వస్తువుగా స్వీకరించవు? ఆధునికాంధ్రసంఘము వస్తువుగా స్వీకరించి రచనసేయు వారున్నారు. కాని వారు సంఘసంస్కారబుద్ధితో, విప్లవబుద్ధితోఁ జేయుదురు. అచ్ఛముగా రమ్యమైన సారస్వతబుద్ధితో చేయువారున్నారు. ఏయూహమైనను సారస్వతమున రమ్యత యుండవలయును. శ్రీ పిలకా గణపతిశాస్త్రిగారి మార్గ మవలంబించి చాలమంది తెలుగుయువకవులు ఆధునికాంధ్రగద్య సారస్వతనిర్మాత లగుదురుగాక!

బెజవాడ
9–11–45

విశ్వనాథ సత్యనారాయణ.



# ప్రథమ ఖండము

## ౧

అది విజయనగరసామ్రాజ్యమున శ్రీకృష్ణదేవరాయల పరిపాలనకాలము. అప్పుడే సూర్యోదయమైనది. విజయనగరమా సూర్యోదయకాంతులలో సద్యోవికసితమగు నరుణపద్మము వలె మెఱయుచుండెను. శైవవైష్ణవ దేవాలయముల ధ్వజస్తంభముల చిఱుగంటలా నవోదయకాంతులలో బంగారు పిచ్చుకలవలె మెఱయుచు శ్రుతిమనోహరముగ ధ్వనించుచుండెను. మార్గమున నడచువారి కాదేవాలయములలో మాఱుమ్రోఁగుచున్న పురుషసూక్తనినాదములు గంభీరముగ వినవచ్చుచుండెను. కొందఱప్పుడే దేవతాదర్శనముచేసి వచ్చుచుండిరి. సామాన్యముగ నెచ్చటఁజూచినను బ్రజల ముఖములు కలకలలాడుచుండెను.

క్రమక్రమముగ బాటలలో బాలసూర్యుని కిరణములు వడివడిగ ముందునకుఁ బరువెత్తసాగెను. రాజవీథిలో నచ్చటచ్చటఁ గొంచెము తొందరగఁ బోవుచున్న యాశ్వికుల గుఱ్ఱముల డెక్కలచప్పుడులు "టకటక" మని ప్రతిధ్వనించుచుండెను. వారియొఱలలో దూరిన ఖడ్గములదంతపుఁబిడులా బాలభానుని ప్రకాశములలో నస్పష్టముగఁ గానిపించుచుండెను. ఆ యాశ్వికుల తలపాగలకుచ్చులు మందమారుతములలో మెల్ల

మెల్లగ నెగురుచుండెను. మేడలపైనుండి చూచువారి కాతల పాగలు వడివడిగఁ బరువెత్తుచున్న పెద్దపెద్ద తెల్లత్రాఁచుల వలెఁ గానిపించుచుండెను.

ఇంతలో నొక వృద్ధుఁడు తెల్లని యున్నతాశ్వముపై స్వారి చేయుచుఁ దటాలున సార్వభౌముని సమాలోచనాభవనము నెదుట దిగెను. వెంటనే యాప్రక్క నిలువఁబడియున్న పరిచారకుఁడు నడుమువఱకును వంగి, నమస్కరించి, యాగుఱ్ఱమును బ్రక్కకుఁ గొనిపోయి నిలువఁబడెను. ఆవృద్ధుఁడు తొందరతొందరగ నడచుచు, సింహద్వారము దాఁటెను. ఆతఁడా ద్వారము దాటినపుడు నడుములవఱకును వంగి నమస్కరించిన ద్వారపాలకు లిరువురును, నొకనిమిషమువఱకును, నట్లే నిలువఁబడియుండిరి. ఆతఁడు వడివడిగ రెండు మూఁడు ద్వారములు దాఁటి యింకను లోనికిఁ బోయెను. అచ్చట ద్వారపాలికగా నున్న యొక సుందరి (యువతి) వెంటనే తనచేతనున్న ఖడ్గము నేలపై మోపి నమస్కరించి నిలువఁబడెను. వృద్ధుఁడామెవై పొకసారి చూచి మెల్లమెల్లగ మేడమెట్లెక్కి యొక సమాలోచనామందిరమునఁ బ్రవేశించెను.

అది తెల్లని పాలరాళ్ళచే నిర్మింపఁబడిన యొక విశాల మందిరము. ఆలోపలిమందిరమున నెచ్చటను స్తంభములేదు. పైకప్పు వేళ్లాడు తామరపూవువలె నిర్మింపఁబడెను. మందిర మధ్యభాగమున నున్న యొక యున్నతవేదికపై నాలుగైదు రత్నఖచితసింహాసనము లమర్పఁబడి యుండెను. భూభాగ

మునం దంతటను జిత్రవిచిత్రములగు చిత్తరువులతోఁ గనులకు మిఱుమిట్లు గొలుపు రత్నకంబళములు మెఱయుచుండెను. గోడలపైఁ జెక్కఁబడిన చిత్తరువులపై మెల్లమెల్లగ సూర్యకాంతి ప్రసరించుటచే వానిసౌందర్య మినుమడించుచుండెను. ఆవృద్ధుఁ డాయున్నతవేదికపై కెక్కి యొక సింహాసనముపైఁ గూర్చుండి, యొకప్రక్కగానున్న దంతపుఁబెట్టె తెఱచి యందున్న తాళపత్రగ్రంథములన్నియు నొక టొకటిగఁ బరిశీలింపసాగెను. మెల్లమెల్లగ వీచుచున్న పిల్లగాలు లా భవనపరిసరమున నున్న తామరకొలనినుండి పద్మసౌరభము గొనివచ్చి యతని కఖండ నిర్వృతి కలిగించుచుండెను. ఆవృద్ధుఁడు తాళపత్రములలోని విషయములు చదువుచు, నప్పుడప్పుడు కనుబొమలు ముడిచి తీవ్రముగ నాలోచించుచుండెను.

ఆవృద్ధునికి డెబ్బది యెనుబదియేండ్ల వయస్సుండవచ్చును. ఆతనిశిరస్సంతయుఁ దెల్లగ నరసి యుండెను. దట్టముగను, గుబురుగను, బెరిగిన యాతనికనుబొమ లొకదానితో నొకటి కలిసి చూపఱకు భయము గలిగించుచుండెను. ఆ కనుబొమలపై నాతఁడొక చిన్నకుంకుమబొట్టు పెట్టెను. అతని కన్నులు చిన్నవి; చూచుటకవి నల్లత్రాఁచుకనులవలెఁ గానఁబడును. అతనిపెదవులు ముఖములోనికి మూసికొని యప్రతిహతమగు నిశ్చయశక్తి నెఱిఁగించుచుండెను. ఆతడు వలెవాటుగ వైచుకొనిన జరీయుత్తరీయములోనుండి బక్కపలుచగనున్న పచ్చని బాహువులును వక్షస్థలమును గానవచ్చుచుండెను.

ఇంతలో మెల్లని పదధ్వనివినవచ్చెను. వృద్ధుఁడు కనుల ముడుతలలో నుండి మెల్లగఁ గనులెత్తి చూచెను. ఇంతలో ద్వారపాలిక సమీపించి "సార్వభౌములు విజయం చేయు చున్నారు. మహాప్రభూ!" అనెను. వెంటనే వృద్ధుడాతాళ పత్రము లచ్చట నుంచి, సార్వభౌము నెదుర్కొని, లోనికిఁ గొనివచ్చెను. వృద్ధుఁడును, కృష్ణదేవరాయలును, నున్నత వేదికపైనున్న రత్నసింహాసనములపై నొకరి కొకరెదురుగఁ గూరుచుండిరి. వృద్ధుఁడు మరలఁ దాళపత్రి మొకటి చేతఁ బట్టుకొని చదువుచుఁ దీవ్రముగఁ గనుబొమలు విఱిచి యాలోచింపసాగెను.

కృష్ణదేవరాయలు సింహాసనముపైఁ గూర్చుండి, చదువుట కొరకు తాళపత్రసంపుట మిటునటుఁ దిరుగవేయుచు, "అప్పాజీ! తమశరీరములోఁ గొంచె మస్వాస్థ్యముగ నున్నదని తెలిసినది!" అనియెను. తిమ్మరుసు మహాప్రధాని లోలోపలి నుండి పై కుబుకుచున్న దగ్గు పైకి రాకుండ నడఁచివేయుచు, ముఖమునకుఁ జేయి యడ్డము పెట్టుకొని, కొంచెము నెమ్మదిగ దగ్గి "మహాప్రభూ! శరీరములో నేమియు బాగుగ లేదు; కాని చోళపాండ్యరాజ్యముల పరిస్థితులు నానాటి కధ్వాన్నము లగుచున్నవి. ఏమి చేయుదు!" అనియెను.

"వీరశేఖరచోళుఁడు సామ్రాజ్యమునఁ గల్లోలములు లేవదీయుట మానలేదా?"

"ఆతఁడు చంద్రశేఖరపాండ్యుని దఱిమి యాతనిరాజ్య మాక్రమించుకొన్నాఁడు!"

"ఎవరి యాజ్ఞపైని!"

"ఇందాజ్ఞాపించుట కెవ్వారి కధికార మున్నది? కేవల మును దురభిమానపూరితమగు నహంకారము!"

"ఎంతటి ధైర్యము!"

"ఇది యింతటితో బోవునటులఁ గానిపించుట లేదు. దీనిలో నెంతో చాణక్యతంత్ర మున్న ట్లున్నది!"

"ఏమి?"

"చంద్రశేఖరపాండ్యుఁడు రాజ్యపాలనమున కనర్హుఁడు"

"అప్పాజీ!"

"నాకు వేగులవారు పంపిన పత్రములనుబట్టి చూడ వానిప్రవర్తనలో నేదోగొప్పలోటున్నట్లు గానవచ్చుచున్నది"

"మీాయస్వాస్థ్యమువలన నా కీవిషయములలో నంత రార్థము బోధపఱచుకొనుటకు వీ లిచ్చినది కాదు!"

"చంద్రశేఖరపాండ్యుఁడు తమదర్శన మపేక్షించు చున్నాఁడు. పిలిపింపుమని సెలవా!"

"పిలిపింపుఁడు"

వెంటనే మహాప్రధాని ద్వారమువైపు చూచెను. దూర మునుండి మంత్రికనుబొమల కదలికకై కనిపెట్టుకొనియున్న ద్వారపాలిక చేతులు జోడించుకొని, వంగి నిలుచుండెను. మహాప్రధాని "మధురాప్రభువు చంద్రశేఖరపాండ్యులు" అని

మెను. ద్వారపాలిక వెంటనే మెఱుపువలె నదృశ్య యయ్యెను. తిమ్మరుసుమంత్రి "ఇదిగో! ఇది పాండ్యసేనాపతి పంపించిన పత్రిక. చిత్తగింపుఁడు!" అని రాయలముం దుంచెను. రాయలాలేఖ యొక పావుగడియలో చదివి యొక్క నిట్టూర్పు విడిచిపెట్టెను. తిమ్మరుసు మెల్లమెల్లగ నొక్కొక్కపత్రమేతీసి, రాయల కెదురుగనున్న దంతస్తంభముపైనున్న బంగారుపళ్ళెరమున నుంచెను. రాయలాపత్రముల నన్నిటిని గ్రమక్రమముగఁ బరిశీలించెను. తరువాత నాపత్రములన్నియు నెదురుగనున్న యాబంగారుపళ్ళెరమునఁ బడవైచెను. మరల రాయల ముఖమునుండి, యప్రయత్నముగ మఱొకనిట్టూర్పు బయలు వెడలెను.

ఇంతలో గవాక్షములనుండి ప్రసరించిన నీరెండ రాయలసమ్ముఖముననున్న కుడ్యముపైఁ బడుటచే నందున్న వరూథినీచిత్రము ద్విగుణీకృతసౌందర్యముచే మెరయఁజొచ్చెను. రాయలపార్శ్వములనుండి యగరుధూమలతికలు మెల్లమెల్లగఁ బైకిలేచుచుఁ బిల్లతెమ్మెరలతోఁ గలిసి యావరూథినీచిత్రము వైపు ప్రసరించుచుండెను. సార్వభౌముని కానాఁడాయ గరుధూమమాలికలలో నేదో యొక వింతసౌరభము స్ఫురించెను. రాజ్యాంగపత్రములు చదువుటచే విసిగిన యాతనివిశాల నేత్రము లాయగరుధూమములతోఁ గలిసి పోవుచు, దివ్యమగు నావరూథినీసౌందర్య మవలోకింపసాగెను.

కుడ్యముపైఁ జిత్రించిన యామవమూధిని యొక సన్నని పోఁకఫ్రమాని వెనుక నిలువఁబడి యొయ్యారముగఁ బ్రవయుని తనూవిలాసము కనుదోయితో జుట్టుకొనుచున్నది. ఆమెమెడ లోని ముత్యాలహారములును, గర్భభూషణములును, నీరెండ సోఁకుటచే మేలిబంగారు పూతపూసినట్లు మెరయుచున్నవి. ఆవమూధినీ ప్రేమలాలిత్య మవలోకింపగనే సార్వభౌముని మనస్సులోని మధురస్మృతులన్నియు నగరుధూమలతలవలె మంథరమంథరముగఁ బైకెగసి పోసాగెను; ఆరోజులే వేఱు; అప్పుడు రాజ్యభార మాచక్రవర్తిపై నుండెడిది కాదు; ప్రతి దినమును గవితాగోష్ఠులతోడను, వల్లకీగానములతోడను, గడచిపోవుచుండెడిది. ఎప్పుడైన నప్పాజీయొద్ద కౌటిల్యునియర్థ శాస్త్రము, బర్హస్పత్యనీతి మొదలగు గ్రంథములు పఠించుచుండెడి వాడు. అప్పుడప్పుడు సామ్రాజ్యజైత్రయాత్రలలోఁ బాల్గొను చుండుటగూడ జరుగుచుండెడిది. ఇప్పటివలె రాత్రింబవళ్ళు సామ్రాజ్యవ్యవహారములలోఁ బడి యూపిరిసలుపకుండ నుక్కిరి బిక్కిరి కావలసినంత యవసర మప్పు డుండెడిది కాదు! ఆ రోజులలోఁ బెద్దనామాత్యులు తాము రచించిన నూతన చాటువు లన్నియు సార్వభౌమునికి వినిపించుచుండువారు. సార్వభౌముఁడుకూడఁ దాను రచించిన కవిత పెద్దనకవీంద్రు లకు వినిపించువాడు. సార్వభౌమునికి సోమయాజుల మహా భారతకవితపైఁ గొంచె మభిమాన మెక్కువగనుండెడిది. పెద్ద న్నగారు "మహాప్రభూ! నన్నయభట్టారకులును, సోమయా

జులుగారును శారదాదేవి యవతారములే! కాని భట్టారకులకవితలో నున్న ద్రాక్షామాధుర్యము సోమయాజులుగారి కవనములో లేదేమో!" అని యనుచుండెడివారు. అప్పుడు సార్వభౌమునికనులలోఁ జిన్ని చిన్ని చిఱునవ్వులు తాండవించెడివి. అంతే!

ఆరోజులలో నాగల యనునర్తకి భరతవిద్యానైపుణిచే రాయలహృదయము చూఱఁగొన్నది. ఆమెపాదమంజీరములు ఘల్లుమని ధ్వనించినపుడెల్లఁ జక్రవర్తిహృదయములో క్షీరసాగరమథనము జరిగినటు లుండెడిది! చిత్రకారు లందఱును నామెనృత్యభంగిమలు చూచి, యాచిత్రములతో రాయల శయనాగార మలంకరించెడివారు. ఆమెసౌందర్యకాంతులలోఁ జక్రవర్తి కీవిశ్వమంతయు నొకనందనవనమువలెఁ గానిపించెడిది! ఆరోజులన్నియు గడచిపోయినవి! క్రమముగా సామ్రాజ్యము, పరిపాలనము, సైన్యసమీకరణములు, జైత్రయాత్రలు మొదలగువానితో జీవితమంతయు, జాలవఱకుఁ గడచిపోయినట్లున్నది. ఇప్పుడు చక్రవర్తికి సుమారేఁబదిసంవత్సరముల వయ స్సుండవచ్చును.

నిజముగ నాలోచించినచోఁ జక్రవర్తికి మనస్తాపము గలుగవలసిన యవసర మేమియు లేదు. చిరకాలమునుండి కాంక్షించిన రాయచూరుదుర్గముకూడ నాతనికై వశ మయినది. సామ్రాజ్యమంతయు సుస్థిరమయినది. కటకము మొదలుకొని, కన్యాకుమారివరకునుగల రాజు లందఱును, నాతని కరి

గాపులై, భయభక్తులతో సంచరించుచున్నారు. అందును నీ మధ్యఁ జక్రవర్తి కళావినోదములు తక్క, తదితరవిషయములు దరికి రానిచ్చుచుండుట లేదు. సామాన్యముగాఁ బెద్దనామాత్యులును, దిమ్మనామాత్యులును, సన్నిధి నున్నచో మహా ప్రధానులుకూడ సార్వభౌముని దర్శించుటకు సందేహింతురు. మహాప్రధానులు సామ్రాజ్యమంతయుఁ గంటికి ఱెప్పవలెఁ గాపాడుచున్నారు. సామ్రాజ్యములో నేమూలఁ జీమ చిటుకుమన్నను మఱునాఁ డది యాయనకుఁ దెలియవలసిన దే! సామాన్యముగ నత్యంతముఖ్యములగు విషయములే చక్రవర్తి నిశ్చయింపవలసియుండును. అందును జక్రవర్తి కప్పాజీ యన్నఁ బితృభక్తి; ఆయనమాట వేదాక్షరము. ఆయనమూలముననే రాయల కెల్లప్పుడును గావ్యవినోదములతో నుల్లాసముగఁ బ్రొద్దు పుచ్చుటకు వీలిచ్చినది.

అయినను మహాప్రధానులు స్వతంత్రించి యేవ్యవహారమును నిశ్చయింపరు. ఒకవ్యవహార మేదైన నిర్ణయింపవలసివచ్చినచో, నాయన సాధకబాధకములన్నియుఁ జక్రవర్తి కెఱిఁగించును. వారిరువురును సంప్రతించుకొన్న పిమ్మట, నేదైన నొక నిశ్చయమునకు వత్తురు; వారిరువురికిని నభిప్రాయభేదములుకూడఁ గలుగుచుండును. అభిప్రాయభేదము కలిగినప్పుడు సామాన్యముగఁ జక్రవర్తియభిమతానుసారముగనే జరుగుచుండును. ఒక్కొక్కప్పుడు తిమ్మరుసుమంత్రి పట్టుపట్టి తన యిష్టానుసారముగ నడిపించుచుండును. రాయల కప్పాజీ

రాజ్యాంగతంత్రజ్ఞుఁడని తెలియును. అదియునుగాక, మహా మంత్రి మిక్కిలి యనుభవశాలి; వయోవృద్ధుఁడు. చక్రవర్తి కామందకీయ మంతయు నాయనయొద్దఁ బఠించినాఁడు. అందుచే మహామంత్రి పట్టుపట్టినప్పు డాతఁడు కాదనుట కెన్న డును సాహసింపఁడు. ఎట్టులయినను జక్రవర్తి సామ్రాజ్య పరి స్థితులు పరిశీలింపవలసిన యవసరము కలుగుచునే యున్నది. రాయల కసలు మహామంత్రిపైఁ గార్యభార మంతయుఁ బడ వైచి, విశ్రమింపవలయునని యున్నది. కాని తిమ్మరుసుమంత్రి యీమాట చెవి కెక్క నీయఁడు. ఒకొక్కప్పు డాయన "మహాప్రభూ! నేను బెద్దవాఁడ నయితిని. కుమారుఁడు ప్రాజ్ఞుఁ డయినాడు. నాకు శ్రీవిశ్వేశ్వరుని సన్నిధానమున జీవితశేషము గడపవలయునని యున్నది. నేను వయోవృద్ధుడను. కావున మీరే నాకు సెలవు దయచేయింపవలసి యున్నది" అని వాదించుచుండును. చక్రవర్తి మహామంత్రిమాటలు విని విశాలనేత్రములు నిశ్చలము లగునంతవరకును నొక నిమిష మాలోచించి, యేమియు బదులుపలుకక మాట్లాడ కూరకొనుచుండును.

కొంతసేపటికి ద్వారపాలిక మరల వచ్చి సవినయముగ వంగి నమస్కరించి, "మధురాప్రభువులు, శ్రీచంద్రశేఖర పాండ్యులు దర్శనమునకై తమయనుమతి కొఱకు నిరీక్షించు చున్నారు. మహాప్రభూ!" అనియెను. మహామంత్రి యంగీకారసూచకముగ హస్తసంజ్ఞ చేసెను. వెంటనే యామె చక్ర

మహామంత్రి—అవును. ఆవిషయములన్నియు మీరు మీవినతిపత్రికలో నివేదించుకొనియే యున్నారు.

పాండ్యుఁడు—దీనిలో నేను కేవలమును నిరపరాధిని మహాప్రభూ!

మహామంత్రి—ఆవిషయము సార్వభౌములు గుఱుతించియే యున్నారు. కాని యస లీవివాద మెందులకు వచ్చినది?

పాండ్యుఁడు—ఏవివాదము మహాప్రభూ!

ఈసమాధానముతో మహామంత్రికి బాగుగఁ జిరాకు గలిగెను. కాని యతఁడది యేమియుఁ బయికిఁ గనఁబడనీయ లేదు. కొంచె మాగి, ప్రశాంతముగ "మీకును, వీరశేఖర చోళునకును, గలిగిన వివాదము." అని సమాధానము చెప్పెను.

పాండ్యుఁడు—వివాద మే మున్నది ప్రభూ! వివాద మేమియు లేదే?

మహామంత్రి—మరి యాతఁ డూరక పుణ్యమునకు మీపై దండెత్తి వచ్చినాఁడా!

పాండ్యుఁడు—నాసామంతులలోఁ గొందఱికి నే ననినఁ గిట్టదన్న విషయము తమ రెరిగినదే కదా! వీరశేఖరచోళుడు పొరుగుపచ్చ చూచి యోర్వలేక, రహస్యముగ వారితోఁ గలిసి కుతంత్రములు నడపి, హఠాత్తుగ మధురపైఁ బడినాఁడు. అతఁడు మధుర ముట్టడించినదాఁక నా కీవిషయమే తెలిసినది

కాదు! నేనును నాకుటుంబమును రహస్యసురంగముగుండ గోటదాఁటి యీవలఁబడి ప్రాణములు దక్కించుకొంటిమి. ఇంత కంటె నేనేపాపమును నెఱుఁగను మహాప్రభూ!

ఈప్రత్యుత్తరము వినుసరికి మహామంత్రికనులలోఁ దీక్ష్ణదృష్టి యెక్కు వయ్యెను. ఆతనిపెదవులపైఁ దాండవించు చున్న చిరునవ్వు మెల్ల మెల్లగ నదృశ్య మైపోయెను. చంద్ర శేఖరపాండ్యుని కాతనిముఖభంగిమ చూచుసరికి నాలుక యెండి పోసాగెను. మహామంత్రి యొక్కనిమిష మట్లు తీక్ష్ణముగఁ జూచి, “ఇదిగో! నేను చెప్పుచ దొక్కమాట వినుడు! మీ రీవిషయమున సత్యగోపనము చేసినచో మీకేముప్పు గాని మరియెవ్వరికిని గాదు? జరిగిన వ్యవహారమంతయు నామూలా గ్రముగ సార్వభౌమునికి విన్నవించుకొనుడు. చక్రవర్తి కరు ణార్ద్రహృదయులు! చేతులు కాలినపిమ్మట నాకులు పట్టుకొని నచో నేమియుఁ బ్రయోజన ముండదు! నేను మీక్షేమ మాలోచించి చెప్పుచున్నాను. బాగుగ నాలోచించుకొనుఁడు” అనియెను.

తనకు మొదట జరిగిన గౌరవమును బట్టి, మహామంత్రి యీవిధముగ మాట్లాడునని పాండ్యుఁ డనుకొన లేదు. ఆకార ణమువలనఁ బొగ జిమ్ముచున్నటు లున్న మహాప్రధాని బొమ ముడి చూచుసరి కాతనికాళ్ళువణఁకసాగెను. అతఁడు మొదటఁ దనకేదో మూడనున్నదని భయపడెను. కాని వెంటనే ధైర్యము తెచ్చుకొని, కాళ్ళు నిలువఁ ద్రొక్కుకొని “దీనిలో

37

వర్తియధిష్ఠించిన యున్నతవేదిక కెదురుగ నొక సింహాసనము వేసి చంద్రశేఖరపాండ్యుని లోనఁ బ్రవేశ పెట్టెను.

ఆతఁడు లోనికి వచ్చి యిరువురికిని వంగివంగి నమస్కారములు చేసి, తనకు వేసిన సింహాసనముపైఁ గూర్చుండక, దానివెనుక చేతులు జోడించి నిలువఁబడెను. రాయలు కను ఱెప్ప వేయకుండ నాతనిపై నొకక్షణకాలము చూచి, మరలఁ దాళపత్రములు పరీక్షింపసాగెను. మహామంత్రి ముడుతలు పడిన కనుబొమలెత్తి నఖశిఖపర్యంతమును నొక్కసారిగా నాతనిని బరిశీలించెను. అతఁ డంతగా నాజానుబాహువని చెప్పుటకు వీలులేదు. విశాలమగు నాతనియధరము క్రిందికి వ్రాలెను. శరీరము కొంచెము స్థూలముగ నుండెను. ఆతఁడు ధరించిన దుస్తులు మిక్కిలి యమూల్యములైనవి. మెడలో నుజ్జ్వలములగు నయిదారు పేటల ముత్యాలహారములు మెరయసాగెను. ఉష్ణీష మప్పటి కప్పుడు తయారుచేయించిన దానివలెఁ గానిపించెను. సామాన్యముగ నాతఁడు నిలువఁబడిన ధోరణిచూచి నచో నేమియు నెఱుఁగని యమాయకునివలెఁ గాన్పించెను. కాని యుజ్జ్వలములగు చూపులుమాత్ర మాతఁడు మిక్కిలి లోకజ్ఞుఁ డనువిషయము వెల్లడి చేయుచుండెను. ఆతఁ డేదో చెప్పఁబోవు వానివలె నోరు తెఱచి యట్లే నిలువఁబడెను.

చక్రవర్తి యట్లే ముఖ్యములగు తాళపత్రములేవో పరిశీలించుచుండెను. మహామంత్రి యాతనిపరిశీలనము ముగించెను. ఆతని పెదవులపై నత్యాదరసూచకమగు చిఱునవ్వు

తాండవింప సాగెను. వ్రాయుట కింతసేపు పట్టినదిగాని, పాండ్యుఁడు, ద్వారముదగ్గఱనుండి మెల్లమెల్లగ వచ్చి, వేదిక కెదురుగనున్న సింహాసనము వెనుక నిలువఁబడుటయు, రాజమంత్రు లిరువురును నాతనిని బరిశీలించుటయు, నొక్క నిమిషములో జరిగిపోయెను.

మహామంత్రి యత్యాదరముగఁ బాండ్యుని గౌరవించుచు, "దయచేయుఁడు! తా మట్లు నిలువఁబడుట యేమియు బాగుగలేదు!" అనియెను. పాండ్యుఁడు తన కింత గౌరవము జరుగునని మొట్టమొదటఁ దలఁచి యుండలేదు. మహామంత్రి సామంతప్రభువుల నీవిధముగ గౌరవించుట యసాధారణము. అందుచే నాతఁడు మిక్కిలి సంతసించి, "మహాప్రభూ! కూరుచున్న నొకటియుఁ గూరుచుండకపోయిన నొకటియునా! నాకు సార్వభౌములకటాక్షవీక్షణమున్న నంతే చాలును! తాము చూపించిన గౌరవమున కందలముపై నెక్కినటు లానందించుచున్నాను!" అని బదులు పలికెను. మహామంత్రి "సార్వభౌములు తమవినతిపత్రమంతయు సావధానముగఁ బరిశీలించినారు. తమరు చక్రవర్తులసముఖమున విన్నవించుకొనవలసిన దేమైన నున్న విన్నవించుకొనవచ్చును." అనియెను.

పాండ్యుఁడు—విన్నవించుకొనుట కేమున్నది ప్రభూ! ఏలినవారి చలువవలన మేమందఱమును సుఖముగ రాజ్యములు పరిపాలించుకొనుచున్నాము. ఇంతలో వీరశేఖరచోళుఁ డింత దురన్యాయము తలపెట్టినాఁడు!

సత్యగోపన మేమున్నది ప్రభూ! తరతరములనుండియు మీా యన్నము తినుచుండు మేము స్వామిద్రోహము చేసిన నీఁకఁ బుట్టగతులుండునా? తమకు నాపైఁ గిట్టనివా రేమేమి బోధించిరోగాని, నే నేపాపమును నెఱుఁగను. దీనిలో నేమైనఁ దేడాయున్నఁ దల గొట్టించి, కోటవాకిటఁ గట్టింపుఁడు!" అని పలికి యతిదీనముఖముతోఁ జేతులు నలుపుకొనుచు నిలుచుండెను. మహామంత్రి యాతనివైపే చూడసాగెను.

పిమ్మట తిమ్మరుసు కొంచెము శాంతించి "సరే దాని కేమి! వీరశేఖరచోళుని శిక్షించుటకై శ్రీ కోట్యము నాగమ నాయనింగారిని దళవాయిగాఁ బంపుచున్నాము. మీారు వారి కాజ్ఞావిధేయులై వారికిఁ దగువిధమున సహాయము చేయవలసినది. వారికిఁ జేఁదోడు వాదోడుగ నున్నచో, మీాకుఁ దప్పక మధురారాజ్యము లభింపఁగలదు. సార్వభౌము లాశ్రితపక్షపాతులు. మరి ప్రభువునారికి వేళ యతిక్రమించుచున్నది!" అనెను. తిమ్మరుసుమంత్రి పలికిన యీామాటలు వినునంతవరకును జంద్రశేఖరపాండ్యునికి మనసు మనసులో లేదు. అతని యెదురుగనున్న గోడలును, జిత్తరువులును, గిరగిరఁ దిరుగుచున్నటులఁ గానిపించెను. కాని తిమ్మరుసుమంత్రిమాటలు విన్నతరువాత నవియన్నియు నిశ్చలత వహింపఁజొచ్చెను. చంద్రశేఖరపాండ్యుఁడు మరల సవినయముగఁ జేతులు జోడించి "చక్రవర్తులును, మహాప్రధానులును, గరుణాసముద్రులు! మే మెన్నిజన్మములు సేవచేసినను, దమఋణము తీర్చుకొనఁ

జాలము!" అని చెప్పి భూమివఱకును వంగి నమస్కరించి, వెను కకుఁ దిరుగకుండ, మెల్లమెల్లగ వెనుక కడుగులు వేసికొనుచుఁ బోయి ద్వారముదాటి యచ్చటనుండి రాజవీథిలోఁ బ్రవేశించెను.

ఆతఁడు నిష్క్రమింపఁగనే చక్రవర్తి "ఎంతకృతిఘ్నుఁ ప్రకృతి!" అనెను. మహాప్రధాని తల పంకించుచుఁ "దనమెడ లోని యురులు తానే బిగించుకొనుచున్నాఁడు. వీని కిట్లు జరుగ వలసినదే!" అనెను. ఇంతలో సమీపముననున్న చక్రవర్తి భవనమునుండి మధ్యాహ్నభోజనకాలము సూచించు శంఖ ధ్వని గంభీరముగ మ్రోఁగసాగెను. పిమ్మట వైతాళికులు నూఱువీణల తంత్రీస్వనములలోఁ దమకంఠస్వరములు కలిపి, మృదుమధురముగఁ జక్రవర్తి శౌర్యసాహసములు ప్రశంసిం చుచుఁ గళ్యాణిరాగములో గీతములు పాడసాగిరి. మెల్లమెల్లగ నాగానము రాజమంత్రుల హృదయకుహరములలో నానంద తరంగములు మేలుకొలుపసాగెను. వా రిరువురును నల్లన లేచి తమతమ భవనోన్ముఖములగు హృదయములతో సమాలోచ నామందిరము వీడి పోసాగిరి. ఆ మందిరకుడ్యములపై నున్న చిత్రములలోఁ గొన్ని వారివైపు కనురెప్పలు వేయకుండఁ జూచుచున్నట్లుట్లే నీరవముగ నిలువఁబడెను. ఆవీణారవము మెల్లమెల్లగ మందమై మహాకాశములోఁ గలిసిపోయెను.

— —

## ౨

అది పెద్దనామాత్యునిభవనము. విజయనగరములో నయ్యది శ్రీకృష్ణస్వామిదేవాలయమున కుత్తరభాగమున నున్నది. పెద్దనామాత్యుని భవనముచుట్టును నొక విశాలమగు నుద్యానవన మున్నది. పెద్దన, భవనమునకు వెనుకనున్న మాలతీలతామండపమున నమర్చిన తూఁగుటుయ్యాలలోఁ గూర్చుండెను. గుబురుగాఁ బెరిఁగిన రెండుమూఁడు పెద్దపెద్ద తీయమావులపై మాలతీలత లల్లించి, యామంటప మేర్పరుపఁ బడెను. మామిడికొమ్మనుండి వ్రేలాడుచున్న బంగారుగొలుసుల తూఁగుటుయ్యాలపైఁ గూర్చుండిన పెద్దన యాయుద్యానమునఁ బచ్చికబయళ్ళపై వ్రాలిన శిశిరాతపముల సౌందర్యమీక్షించుచుండెను.

అప్పటి కొక జాము ప్రొద్దుకంటె నెక్కువ యుండదు. సూర్యకిరణము లుద్యానావరణము దాఁటి మెల్లమెల్లగఁ బసిరిపచ్చికలపైఁ బ్రవహించుచుండెను. ఆకిరణములలో రంగురంగుల సీతాకోకచిలుక లెగిరి కనులకు విందొనర్చుచుండెను. కొంచెముదూరముగ నొకటి రెండు నెమిళ్ళు పురులు విప్పుకొని, యొయ్యారముగ నడచుచు, నాడుచుండెను. ఆ యుద్యానమునకు రెండువైపులను రెండు బంగారుపంజరములు వ్రేలాడుచుండెను. ఒకదానిలో నల్లని మైనాగోరువంకయు, రెండవదానిలో నొక పంచరంగుల రామచిలుకయు నుండెను. పెద్దన

ప్రక్కనున్న సువర్ణపేటికలో నొక బంగారుగంటమును బసుపు పూసిన కొన్ని శ్వేత తాళపత్రములును మిలమిలలాడుచు మెఱయు చుండెను. ఇంతలో సుందరరూపియగు నొకయువకుఁ డాతూగు టుయ్యాలదగ్గఱ కరుదెంచెను. ఆతఁడు వలెవాటుగా వైచు కొనిన సరిగంచుల జరీయుత్తరీయమునుండి మెడలోని ముత్యాల హారములకాంతులు తొంగితొంగి చూచుచుండెను. అప్పుడే సూర్యబింబ మొకింత వ్రాలినది. ఒక కిరణలేశము పై వ్రాలు టచేఁ బెద్దనామాత్యుని మకరకుండలమాణిక్యములు ధగధగ లాడఁజొచ్చెను.

వచ్చిన యువకుని చూచి పెద్దన సరసను గూర్చుండు మని సంజ్ఞ చేసెను. కాని యాయువకుఁ డట్లు చేయక సవిన యముగఁ గవీంద్రుని పాదములు స్పృశించి, పసిరిపచ్చికల గుబురుపైఁ గూర్చుండెను. ప్రకృతిసౌందర్యములోఁ దేలిపోవు చున్న పెద్దన కనులిప్పు డిప్పుడే మేలుకాంచినట్లు కానవచ్చు చుండెను. ఆతఁడొక్క-క్షణకాల మాగి, యా యువకునివైపు చూచి "చెవ్వప్పనాయకుఁడు రాలే దేమి!" అని ప్రశ్నించెను. ఆ నూతనుఁడు "నాయనగారితోఁ గలిసి దక్షిణదేశమునకుఁ బోయినాఁడు" అనెను. కవి మరల నొక నిమిష మాగి "విశ్వ నాథా ! అన్నటులు పాండ్యరాజ్యవ్యవహార మేమయినదో తెలియునా?" అని ప్రశ్నించెను.

"అదే! ఆవ్యవహారమే మనవి చేయుచున్నాను. సార్వ భౌములు నాయనగారిని బిలిచి నిలుచున్నపాటున మధుర

పైకి దండెత్తి వెడలవలయునని యాజ్ఞాపించినారు. చెవ్వప్ప నాయకుఁడును రామభద్రనాయకులునుగూడ వారికి సహాయులుగా నేగినారు.''

"అంత త్వరగా మధురపై దండెత్తి పోవలసిన యవసర మేమి కలిగినదో?''

"వీరశేఖరుఁడు హఠాత్తుగాఁ బైఁబడి పాండ్యరాజ్య మాక్రమించుకొన్నాఁడట! ఆపైఁ బాండ్యుఁడు సార్వభౌముల యెదుట మొఱ పెట్టుకొన్నాఁడట! అందుచే వారీవిధముగ నాజ్ఞాపించినారు.''

"అబ్బా! పాండ్యవ్యవహారము లంతవరకును ముదిరినవా!''

"ఇఁక నాలసించినచో శ్రుతి మించి పోవునని చక్రవర్తి తత్క్షణమే నాయనగారిని బయలుదేఱవలయునని యాజ్ఞాపించినారు.''

"మరి నీవు పోలేదేమి?''

"నేను వారిని ప్రార్థించితిని. కాని వారు నాప్రార్థన మంగీకరింపలేదు. నన్ను విజయనగరసైన్యములకు దళవాయిగా నుండ నియమించినారు!''

ఈసమాధానముతోఁ పెద్దనామాత్యుని ముఖముపై చిఱునవ్వుదయించెను.

"చెప్పవేమి! సార్వభౌములు నిన్నింక దక్షిణరాజ్యములకు దళవాయిగా నియమింతు రన్నమాట! మీనాయనగా

రింకఁ బుణ్యతీర్థములు సేవించుకొనవచ్చు నన్నమాట! ఇన్నా ళ్ళకు వారికోరిక నెఱవేఱుకాలము సమీపించినది!"

ఈమాటలకు విశ్వనాథనాయకుఁ డేదో యస్పష్టముగా సమాధానము చెప్పి, మాట్లాడ కూరకుండెను. మరల నిరువు రును, గొంతసేపటివఱకును, నేమియు మాట్లాడలేదు. పెద్దనా మాత్యునిదృష్టి మరల సాంధ్యాతపములవైపునకు మఱలెను. ఎదురుగ నీరెండలోఁ బసిరిపచ్చికలగుబురులలో నాహారమేఱు కొని తినుచున్న పాలపిట్ట రెపరెప ఱెక్కలాడించినది. ఆపసిరి పచ్చికపైనొకసారిగఁ బాలు గ్రుమ్మరించినట్లు కానుపించినది! పెద్దన యీసౌందర్యావలోకనములో నొక నిమిషకాలము మై మఱచెను. ఇంతలో నాతని కేదో జ్ఞాపకము వచ్చుటచే మరల మెల్లగ నిట్లు పలికెను.

"అన్నట్లు మధురస్థానాపతి వీరరాఘవనాయనింగారు కూడ మీనాయనిగారితో బయలుదేరిరా?"

"బయలుదేరి రనియే యనుకొందును."

"ఆయన నాకు బాల్యమిత్రుఁడు. సార్వభౌముల కాయ నయెడల గౌరవాదరము లెక్కువ. రాజధాని కరుదెంచి నప్పటినుండియు నాయన ప్రతిదినమును నొక్కసారియైనఁ జూడకుండ నుండలేదు. వారిది గౌరవప్రతిష్ఠలుగల వంశము. నీ వాయన నెఱుఁగుదువా?"

"నా కంత బాగుగఁ బరిచయము లేదు. మానాయు నగా రాయన నెఱుఁగుదురు."

ఆయనదగ్గఱ నాగాంబిక యను నొక కన్యయున్నది. ఆయన నిన్నుఁ జూచినప్పటినుండియు నా పిల్లను నీ కీయవల యునని యువ్విళ్ళూరుచున్నాఁడు. నాతో నొకటిరెండుమాఱు లావిషయము ప్రస్తావించినాఁడు. నే నీవిషయము మీనాయన గారితోఁ బ్రస్తావించవలెనని యాయన కోరిక. నేను ముందు నీతో సంప్రతించిన తరువాత నాయనతో మాట్లాడవలయునని యనుకొన్నాను. నేను, మీ నాయనగా రింత తొందరగ మధు రకు బయలుదేఱుదురని యనుకొనలేదు. వీరరాఘవనాయనింగా రింకను బయలుదేఱి యుండరనియే నాయూహ—సరే దాని కేమిగాని—ఈసంబంధము విషయమున నీ యభిప్రాయ మేమి?"

"దీనిలో నాయభిప్రాయమున కే మున్నది. అంతయు నాయనగారి యిష్టము."

"నాగాంబ చక్కనిచుక్క. మంచివైణికురాలు. అంగు ళులలో నమృతమాధుర్య మున్నది. సంస్కృతాంధ్రములలో ద్రాక్షామధురమగు కవిత్వము చెప్పఁగలదు. కావుననే వీర రాఘవనాయనింగారామెను నీవంటి విద్వాంసుని కిచ్చి వివా హము చేయవలయునని యుబలాట పడుచున్నాఁడు. మీ నాయనగారికి వేఱుగ నేమైన నభిప్రాయమున్నదా?"

"ఏమో! నాకుఁ దెలియదు. ఒకటి రెండుసంబంధము లేవో వచ్చినప్పుడు "నాకింకను నొకటిరెండు సంవత్సరములు

గడచిన తరువాత వివాహము చేసికొనవలయునని యున్నది" అని యన్నాను. అప్పటినుండియు వా రీవిషయమునఁ దూష్ణీమ్ భావము వహించినారు. అంతే!"

పెద్దనామాత్యుఁ డాపై నేమియు మాట్లాడలేదు. ఒకటి రెండు నిమిషములవఱకు నాతఁ డేదో యాలోచించి, యొక సారి విశ్వనాథుని ముఖమై ఖరి పరీక్షించినాఁడు. ఆపిమ్మట 'సరే! చెవ్వప్పనాయకుఁడు మధుర వెళ్ళినాఁడుగదా! ఇది యేదో తుదముట్టు వఱకును మనము పారమాపివేయుటయే మంచిదని నాయభిప్రాయము. ఏమందువు?' అనెను.

విశ్వనాథనాయకుఁడు 'సరే! మీ యిష్టము! పోనిండు— నేనప్పు డప్పుడు వచ్చి సోమయాజుల భారతములోఁ గలిగిన సందేహములు తీర్చుకొనుచుందును. శ్రీ తిమ్మకవీంద్రులు వచ్చువేళ యైనది. నాకును వాహ్యాళి కాలము సమీపించినది. సెలవు' అని నమస్కరించెను. పెద్దన ముసిముసి నవ్వులు నవ్వుచు 'శీఘ్రమేవ కళ్యాణసిద్ధిరస్తు!' అని యాశీర్వదించెను. విశ్వనాథనాయకుఁడు 'అదిగో! తిమ్మకవీంద్రులు వచ్చుచున్నారు!' అని చెప్పి మెల్లమెల్లగ నచటనుండి వెడలిపోయెను.

మెల్లమెల్లగ ముక్కుతిమ్మకవీంద్రులు తూఁగుటుయ్యాలవైపు వచ్చుచుండిరి. ఆయన నడచి వచ్చుచుండఁ గపోలములపై మణికుండలములు మెల్లమెల్లగఁ జలించుచుండెను. ఆయన ఆజానుబాహువు; మిక్కిలి బలాఢ్యుఁడు. కప్పుకొనిన

కాశ్మీర శాలువనుండి వేర్లాడు దక్షిణప్రకోష్ఠముపై నొకసింహ తలాటమిటునటు కదలుచుండెను. ఆయనకు వయస్సించు మించుగ నేఁబదియేండ్లుండును. కాని, పైకిమాత్ర మంతకంటెఁ బది పదునైదువత్సరములు చిన్నవానివలెఁ గానవచ్చుచుండెను. ఆయన పార్శ్వమున స్ఫురద్రూపిణి యగునొక తాంబూల కరండవాహిని నడచి వచ్చుచున్నది. ఆమె వామభుజముపై నొకబంగారు పళ్ళెరమును, దానిలో బంగరు నగిషీ చేసిన యొక తాంబూలకరండకమును నున్నవి.

తిమ్మనార్యుఁ డల్లంత దూరమున నుండగనే పునుగు, జవ్వాది, పచ్చకర్పూరము మొదలగు సుగంధద్రవ్యముల పరిమళభారముచే నచ్చటి పిల్లతెమ్మెర లల్లనల్లన మూర్ఛిల్లునటు లుండెను. ఆంధ్రకవితాపితామహుఁ డెదురేగి, తోడ్కొనివచ్చి యాతనిని దనసరసను గూర్చుండఁ బెట్టుకొనెను. తాంబూల కరండవాహిని కుడిచేతితో నుయ్యాలగొలుసు పట్టుకొని, యొయ్యారముగ నిలువఁబడియుండెను. అప్పుడప్పు డామె వా రిరువురికిని, జుట్టిన చిలుక లందిచ్చుచు, మరల నుయ్యాల గొలుసు పట్టుకొని నిలువఁ బడుచుండెను. ఆమె పేరు మల్లిక. అంతలో సమీపమున నున్న బొండుమల్లెపందిరులపై నుండి చల్లచల్లని పిల్లగాలులు వీచి, యాకవుల హృదయములు జల్లు మనిపించినవి. తిమ్మకవి యానందపారవశ్యముచే నేత్రాంతములు కుంచించి "ఆహా! ఏమిమల్లికాసౌరభము!" అనెను. ఆమాటపైఁ బెద్దనామాత్యుండు చిఱునవ్వు నవ్వి "విశేషించి,

మీకు మల్లికాసౌరభమన్న నెక్కువపక్షపాత మనుకొందును ” అనెను. మల్లిక ఆమాటలలోని శ్లేష గ్రహించి, సిగ్గుచేఁ దటాలునఁ గనురెప్పలు వాల్చివేసినది. తిమ్మకవి “మీ శ్లేషవలన నెవరి కెవరిమీఁదఁబక్షపాతమున్నదో తెలియుచునే యున్నది ” అనియెను. ఆమాటలపై నిరువురును జిఱునవ్వులు నవ్వుకొనిరి.

అంతనిరువురును గొంచెము మెల్లని కంఠస్వరములతో గుసగుస లాడుకొనఁ జొచ్చిరి. తాంబూలకరండవాహిని తా నాసమీపమున నుండుట యుచితము కాదని, తాంబూల కరండక మాతూఁగుటుయ్యాలపై బెట్టి మల్లెపూవు లేఱుకొను నెపమున నచ్చటనుండి కదలి యొకమల్లెపందిరికడ కేగెను. మరల వా రిరువురికంఠస్వరములును గొంచెము గట్టిగ వినఁబడసాగెను. పెద్దన “అన్నట్టిది యెవరికూఁతురు?” అని ప్రశ్నించెను.

“శ్రీవిరాజితము కూఁతురు.”

“మనమధురలో నున్న శ్రీవిరాజితమే!”

“అవును.”

“ఇది యిచ్చటికెట్లు వచ్చినది.”

“శ్రీవిరాజితము మధురారాజ్య మల్లకల్లోలముగ నున్నదని రాజధానికి వచ్చి వేసినది.”

పెద్దన “అటులనా” అనియూరకుండెను. మరల నొక నిమిషముండి “మీకునాగమనాయనింగారు వీరశేఖరచోళునిపై దండెత్తిపోయిన విషయము తెలియునా?” అనియెను.

"ఎప్పుడు?"

"అంతయు నీమధ్యనే జరిగినది."

"చంద్రశేఖరపాండ్యుఁడు సార్వభౌమునియొద్ద కరు దెంచి మొఱ పెట్టుకొనెనా?"

"అవును. ఆపిమ్మటనే సార్వభౌములు నాగమనాయ నింగారిని వీరశేఖరచోళునిపై దండెత్తిపోవ నాజ్ఞాపించినారు."

తిమ్మకవి యాపైఁ గొంచెముసేపు మాట్లాడ కూర కుండెను. ఆపిమ్మట మరలఁ దాంబూలకరండకములోని తాంబూ లపుఁజిలుక యొకటి నోట వేసికొని నములుచు "ఏమైనను-నాకు-మరలఁ బాండ్యునికి రాజ్యము లభించునని తోఁచదు" అనియెను.

"ఏమి?"

"మహామంత్రికిఁ బాండ్యునియెడల నిసుమంతైనను సద్భావము లేదు."

"కాని సార్వభౌములు పాండ్యునికిఁ దిరుగ రాజ్య మిప్పింతుమని వాగ్దానము చేసినారఁట?"

"కావచ్చును."

"సార్వభౌములు వాగ్దానభంగము చేయుదురా?"

"నేననునది యది కాదు. నాకిందులో నేదో చాణక్య తంత్ర మున్నటులు కానవచ్చుచున్నది."

ఆతరువాతఁ బెద్దనామాత్యుఁడు, "మీరు మహాప్రధా నులకుఁ జాలసన్నిహితులు కావున నీరాజ్యాంగవ్యవహార

ములు మీకు దెలిసినంతగా నాకు తెలియుట కవకాశము లేదు" అనెను. ఆపిమ్మట నాసమీపముననున్న విరూపాక్ష దేవుని దేవాలయమునుండి సాయంకాలసేవాసూచకమగు శంఖ స్వనము వినవచ్చెను. ఆతరువాత నొక్కటొకటిగ ఘంటా స్వనములుకూడ శాంతగంభీరముగ మాఱుమ్రోఁగసాగెను. తిమ్మకవి యొకనిమిషమువఱకును మౌనముగ నుండి "మఱి సంధ్యాసమయమైనది. నాకు సెలవు దయసేయుఁడు." అని చెప్పుచుఁ దూఁగుటుయ్యాలపైనుండి లేచెను. ఇంతలో మల్లిక దూరమునుండి వారు సంభాషణము ముగించుట చూచి తాను గ్రుచ్చిన మల్లెదండలలో నొకటి పెద్దనకును, రెండవది తిమ్మనకును నిచ్చి మరల తాంబూలకరండకము ధరించి యొయ్యారముగ నిలువఁబడెను. వారిరువురును నామె యిచ్చిన పుష్పగుచ్ఛము లందుకొని, మెల్లగ నుద్యానవనము దాఁటి నడచి పోసాగిరి. వారివెనువెంటనే మల్లికకూడ నడచిపోయెను. క్రమముగా నుద్యానవనముననున్న నీరెండ కరిగి యదృశ్యమై పోయెను.

———

# 3

నాగమనాయకునికి రామభద్రనాయకుఁడు కొంచెము
దూరపుచుట్టము. అయినను వారిరువురును బాల్యమిత్రులు.
ఇరువురును దమరాజభక్తివలన సార్వభౌముని యనుగ్రహము
నకుఁ బాత్రులై క్రమక్రమముగ నున్నతోద్యోగము లందఁ
గలిగిరి. నాగమనాయకుఁ డిప్పటివఱకును ధనాగారాధికారిగా
నుండి, యిప్పుడు దక్షిణరాజ్యములకుఁ బ్రధానసేనాధిపతిపద
మందినాడు. ఆరోజులలో సేనాధిపతికి దళవాయి యనువ్యవ
హారము. అట్లే రామభద్రనాయకుఁడుకూడ క్రమక్రమముగా
దాక్షిణాత్యసైన్యములో నొకసేనానాయకపద మందఁ గలిగి
నాఁడు. ఆరోజులలో దళవాయి క్రిందియుద్యోగులకు సేనా
నాయకులను వ్యవహార ముండెడిది. రామభద్రనాగమనాయ
కులకు బంధుత్వములో బావమఱఁదుల వరుస. అధికారభేద
మున్నను, బాల్యస్నేహమువలన వారొకరి నొకరు "బావా!"
యని పిలుచుకొనుచుండిరి.

నాగమనాయకుని కెంతకాలమునకును సంతానము
కలుగలేదు. తుద కాతఁడు సార్వభౌముని యనుజ్ఞవడసి
శ్రీకాశీవిశ్వనాథునిసన్నిధిని నివసించుచు, ననేకదేవబ్రాహ్మణ
పూజ లొనరించినాఁడు. కాని యెంతకాలమునకును నాతనికి
సంతానము కలుగలేదు. పిమ్మట దక్షిణతీర్థయాత్రలు ముగిం
చుకొని మధురలో మీనాక్షీసుందరేశ్వరులను సందర్శించు

కొని, యచ్చట నొకసుందరమగు గోపురమును మండపమును నిర్మించినాఁడు. ఆపిమ్మట బ్రాహ్మణుల కనేకాగ్రహారము లిచ్చినాఁడు, అయినను బ్రయోజనము లేకపోయెను. ఈసారి యాతఁడు వారణాసి కేగి యాదేవుఁడు తనపైఁ గటాక్షింపకున్నచో గంగలో దిగి, ప్రాణత్యాగ మొనర్చుకొనవలెనని నిశ్చయించుకొనెను. ఆతనిదీక్ష చూచి యాతనితోఁ గాశీ కరుదెంచిన మిత్రు లందఱును మిగుల భయపడిరి. ఎట్టకేల కాతనితపస్సు ఫలించినది. ఒకనాఁడు కాశీవిశ్వనాథుఁ డాతనికిఁ గలలోఁ గనఁబడి నీ కచిరకాలములో నొక మగపిల్లవాఁడు కలుగునని యానతిచ్చెను.

ఆకల వచ్చినప్పటినుండియు నాతనికిఁ గలిగిన యానందమునకు మేరలేదు. మఱునాఁడు విశ్వనాథదేవాలయమున కనేకమాణిక్యరాసు లర్పించి, భక్తియుక్తముగ దేవబ్రాహ్మణ సమారాధనము లాచరించెను. తరువాత రాజధానికి వచ్చి శ్రీవిరూపాక్షదేవునకును, శ్రీరామస్వామిదేవునకును మౌక్తికరాసులు కానుకలుగ నర్పించెను. ఆ పిమ్మటఁ గొంతకాలమున కాతని కొకకుమారుఁడు కలిగెను. ఆతనికి నాగమనాయకుఁడు విశ్వనాథనాయకుఁ డని పేరుపెట్టెను. ఆబాలుని జూచి యాతఁ డప్పుడప్పు డమితభక్తితో శ్రీవిశ్వనాథునికి నమస్కరించుచుండువాఁడు. శ్రీవిశ్వనాథుఁ డాతని కిబాలుని గటాక్షింపకున్నచో నాతని ధనకనకవస్తువాహనాదు లన్నియు నన్యాక్రాంతములు కావలసినవేకదా! ఆతఁడు సంపాదించిన ప్రాసా

దములు, ఉద్యానవనములు మొదలగు నవన్నియు నేమి కావలయును! అదియునుగాక, పుత్రులు లేనివారికిఁ బున్నామనరక యాతనలు తప్పవుగదా! పుత్రుఁడు కలిగినప్పటినుండియు నాతని కిజీవలోకమునఁ బునర్జన్మము కలిగినటు లుండెను. అప్పటినుండియు నాతఁడు ధనకనకవస్తువాహనాదు లతిజాగరూకతతోఁ గూడఁబెట్టుచుండెను. క్రమక్రమముగ నాతనికి సార్వభౌమునికొలువు చాలించుకొని సామ్రాజ్యముననే యైన నొకసామంతరాజ్యమున కాధిపత్యము సంపాదించి, మహామండలేశ్వర బిరుద మందవలయునను కోర్కె జనించెను. కాని యది సమకూరుటెట్లు? అది యెప్పటికిని సమకూర నేరని మనోరథము. అయినను నాతని కుత్సాహభంగము కలుగ లేదు. ఎప్పటి కప్పు డావిషయమయి తీవ్రప్రయత్నము లొనర్చుచునే యుండెను.

సార్వభౌమునికిఁ గొంచెము పెద్దతనము వచ్చినప్పటి నుండి దక్షిణాపథమున రాజ్యాంగవ్యవహారములు తిన్నగ నడచుట లేదు. సామాన్యముగ సామంతరాజు లన్యోన్యమును గలహించుచు, నొకరిరాజ్యము లొకర పహరించుచుండిరి. కాని తిమ్మరుసుమంత్రి నీతిచాకచక్యమువలన దక్షిణసామ్రాజ్యమున కేకొఱతయు రాకుండఁ గడచిపోవుచున్నది. అయినను నీపాండ్య చోళరాజ్యముల కలహ మొకగాలిదుమారమువలె రేగి, క్రమక్రమముగఁ జిలికి చిలికి, గాలివాన యగునేమో యను భయము గలిగించినది. అందుచేఁ దిమ్మరుసు మంత్రి ప్రత్యేక

ముగ నాగమనాయుని నీదక్షిణరాజ్యవిప్లవ మణఁచివేయుటకుఁ బంపించెను. నాగమనాయకుఁ డిది తనమనోరథసిద్ధి కనుకూలించునేమో యనునాశతో నీపనికి సిద్ధపడెను.

దక్షిణయాత్రకుఁబోవునపుడు నాగమనాయకుఁడు రామభద్రినాయకుని బ్రోత్సహించి తనవెంట రావలసినదనికోరెను. కొన్ని కుటుంబవ్యవహారములవలన మొదట నాతఁడు నాగమనాయకు ననుసరించుట కిష్టపడలేదు. కాని మిత్రానురోధము వలనఁ జిట్టచివర కంగీకరించి వెంట బయలుదేఱెను. నాగమనాయకుఁడు కుమారునిగూడ వెంటఁగొనవలెనని తలఁచినాఁడు. కాని చక్రవర్తి యాతనిని రాజధానినుండి కదపుట కిష్టపడక పోవుటచే నప్పటికి మాట్లాడ కూరకుండెను. కాని యవసరము వచ్చినప్పు డేదైన నొకమిష పెట్టి యాతనిని దక్షిణమునకుఁ గొనిపోవలయునని నిశ్చయించెను. ఆతఁడు కుమారునివిషయము మహాప్రధానులకుఁగూడఁ గొంత చూచాయగా విన్నవించెను. ఆయన "దానికేమి! అవసరము కలిగినచో మీకుమారుని దప్పక దక్షిణమునకుఁ బంపించెదను" అని ధైర్యము చెప్పెను. అందుచే నాతఁడు వెడలిపోవునపుడు కుమారుని బిలిచి, "నేను మహాప్రధానులతో నీవిషయము చెప్పితిని. వారవసరము వచ్చినప్పుడు నిన్ను తప్పక పంపించెద మన్నారు. నాకుఁశరీరములో బూర్వమున్నంత దార్ఢ్యము లేదు. దాక్షిణాత్యులను విశ్వసించుటకు వీలులేదు. దక్షిణాపథమునుండి వార్తాహారుఁడు రాఁగనే తత్క్షణము బయలుదేఱి రమ్ము. అప్పుడప్పుడు రామ

భద్రము మామయ్యగారింటి కేగి వారియోగక్షేమము లరయు చుండుము. రాత్రివేళఁ గొంచెము పెందలకడ నింటికిఁ జేరు కొనుచుండుము. వారమువారమును దప్పకుండ యోగక్షేమము లెఱిగించుచుండుము. నే నింక నాలస్యము చేయుటకు వీలు లేదు" అని చెప్పి వెడలిపోయెను.

విశ్వనాథనాయకుఁడు తండ్రివాక్యములు సావధాన ముగ నంగీకరించి 'సరే' యని విజయనగరపుర బహిర్ద్వారము వఱకును దండ్రిని సాగనంపి, యాయన యిఁక రావల దను టచేఁ దిరిగి తన భవనమునకు మఱలెను. విశ్వనాథుఁడు 'సరే' యన్నాఁడుగాని, యాతనికి నిజముగ దక్షిణాపథమునకుఁ బోవుట కిష్టము లేదు. తండ్రియాజ్ఞ మీఱుటకు వీలులేక పోవుటచేఁ గేవలమును గత్యంతరములేక 'సరే' యన్నాఁడు. పైగఁ బ్రధానామాత్యులుగూడ దీని కంగీకరించినచో నిఁకఁ జెప్పెడి దేమున్నది! విశ్వనాథనాయకుని కీదక్షిణాపథప్రయాణ మిష్టము లేకపోవుట కొక కారణమున్నది.

ఆకథ యిది: రామభద్రనాయకునికి ముక్తాంబిక యనియు, మీనాంబిక యనియు నిద్దఱు కుమార్తెలు గలరు. రామభద్రనాయకుఁడు ముక్తాంబికను చోళస్థానాపతికిచ్చి వివాహము చేసెను. చోళస్థానాపతి మహైశ్వర్యవంతుఁడు. అందుచే రామభద్రనాయకుఁడు వారికిఁ దగినమర్యాదలు నడ పింపలేక పోయెను. అందుచే వియ్యపురాం డ్రిద్దఱికిని గ్రమ క్రమముగ మనస్పర్థలు పెరిఁగెను. ఆ యుక్రోషము మనస్సులో

బెట్టుకొని, అత్తవారు ముక్తాంబికను బుట్టినింటికిఁ బంపుటమాని వేసిరి. ఎప్పుడైన రామభద్రనాయకుఁడు వెళ్ళి "కాదు; కూడ" దని పట్టుపట్టినచోఁ బంపించెడువారు. ఒకప్పుడాతఁడు వెళ్ళినను గూడ నేదో సాకుచెప్పి పంపకుండఁ దప్పించుకొనుచుండిరి. ఇది యంతయు నాతనికి మిగుల మనోవైకల్యహేతు వయ్యెను. అందుచే నాతనికి రెండవకుమార్తె పెండ్లిమాట యనినభయము కలుగుచుండెను.

రామభద్రనాయకునికి రెండవకుమార్తె యనినఁ బ్రాణము. అందఱును మొదటిపిల్లకంటె రెండవపిల్ల చక్కని దనుచుండువారు. రామభద్రనాయకునికి మీనాక్షీసుందరేశ్వరు లిష్టదైవతములు. అందుచే నాతఁడు రెండవకుమార్తెకు మీనాంబిక యని పేరుపెట్టెను. ఆమె నేత్రములు కూడఁ బేరునకుఁ దగినట్లు మిగుల దీర్ఘములుగ నుండెను. అందుచే నంద ఱును నామెనుజూచి "వీరియింట సాక్షాన్మధురమీనాక్షీ దేవి యవతరించినది." అని యనుచుండువారు.

సామాన్యముగా నాయకవంశజులయిండ్ల నాఁడుపిల్ల లందఱికిని పదునాలుగు పదునేనేండ్ల వయస్సు వచ్చునరికి వివాహములు చేయుట యలవాటు. రామభద్రనాయకునికిఁ బెద్ద పిల్లవివాహమువలన, గలిగిన మనోవైకల్యమునుబట్టి మీనాంబిక వివాహమన్న భయము గల్గెడిది. అందుచేఁ బదునారేండ్లు నిండినను గూడ మీనాంబిక కింకను వివాహము చేయలేదు. ఆమె వివాహమాలస్యమగుట కింకొక కారణముకూడ నున్నది.

రామభద్రనాయకునికిఁ గావలసినంత సంపత్తియున్నది. ఆతని కింకఁ గుమారులు కలుగుదురను నాశలేదు. అందుచే నాతఁడు తనకుమార్తె నొకసంపన్నునికిచ్చి వానిచుట్టును దిరుగుటకన్న, సామాన్యుఁడగు నొకయోగ్యవరునకిచ్చి, వాని నింట నుంచుకొనుట మంచిదని తలఁచెను. అదియుఁగాక యాతనికిఁ గ్రమక్రమముగా వార్ధకముకూడ వచ్చుచున్నది. కాలుసేతులు వంగినతరువాత నీయాస్తిపాస్తులన్నియుఁ జూచువా రెవ్వరు? కావున నల్లు నిల్లరిక ముంచుకొనుట యావశ్యక మైనది.

ఈకారణముననే యాతఁడు తన మేనల్లుఁడగు చెవ్వప్పనాయకు నింటఁ బెట్టుకొని, యాతనికి విద్యాబుద్ధులు గఱపించెను. చెవ్వప్పనాయకుని తల్లిదండ్రులు సామాన్య సంసారులు. రామభద్రనాయకుఁడు తనచెల్లెలిభర్త యనుభవించు దారిద్ర్యబాధలు చూచి, జాలిపడి, నాగమనాయకునితోఁ జెప్పి, యాతని కొత్తరాహుసైన్యములో నొక యుద్యోగమిప్పించెను. చెవ్వప్పనాయకునికిఁ బదునాలుసంవత్సరములు వచ్చినప్పటినుండియు, నింటఁ బెట్టుకొని చదువు చెప్పించెను. కాని రామభద్రనాయకునిభార్యయగు వేంకటాంబకు మీనాంబికను జెవ్వప్పనాయకుని కిచ్చి వివాహము చేయుట యిష్టము లేదు. మీనాంబికకుఁ బదునాలవసంవత్సరము వచ్చినప్పుడు వేంకటాంబ భర్తతోఁ గుమార్తెవివాహమునుగూర్చి ప్రస్తావించినది. ఆతఁ డప్పుడు చూచాయగాఁ దనయభిప్రాయ మెఱింగించినాఁడు. వేంకటాంబ "పెద్దదానికిఁ గొంచె మున్న

సంబంధము చేసి, రెండవదాని కీవిధముగఁ జేసినచోఁ బెద్దదై నప్పు డది యేమవదా? ఉన్నయిద్దఱిలోను నీవిధముగఁ బక్షపాతము చేయుట న్యాయముకాదు! దీనికిగూడ బాగుగ నాలోచించి కొంచెమున్న సంబంధము చేయుఁడు!" అనియెను. ఆపై రామభద్రనాయకుఁడు "మనము చెవ్వప్ప నింట నుంచుకొనుచున్నప్పు డిదియంతయు వాని దేకదా! అప్పు డీఁక వాని యాస్తిపాస్తులతో నవసర మే మున్నది?" అనియెను. ఆపై నామె "ఏమో! నా కిది యేమియు బాగుగ లేదు! నాచిట్టి తల్లిభర్త నందఱును నిల్లఱికఁపుటల్లుఁడు, ఇల్లఱికపు టల్లుఁడు!" అని పిలిచినచో నేను సహింపలేను. కావలసినచో మీ మేనల్లునకు మీయాస్తియంతయు నిచ్చివేయుఁడు. దానినొకచక్కని వరునకిచ్చి వివాహము చేయుఁడు! చెవ్వప్పకు దానినిచ్చి వివాహము చేసినచోఁ జూచినవా రందఱును గాకిముక్కునకు దొండపండు కట్టఁబెట్టినారని యాడిపోసికొందురు. అసలు మీ కటువంటిపిల్లను దీసికొనిపోయి, యట్టివాని కీయవలెనని యెట్లుతోఁచినది!" అనియెను.

రామభద్రనాయకుఁ డామెమాటల కేమియుఁ బ్రత్యుత్తర మీయక యేదో పనియున్నదని మిషపెట్టి వీథిలోనికి వెడలిపోయెను. అస లాతఁడు మిక్కిలి మితభాషి. ఆపై నాఁడు వారితో వాదించుటవలనఁ బ్రయోజనము లేదని యాతని యభిప్రాయము. అప్పటినుండియు నాతఁ డీవిషయమున వేంకటాంబతో నెప్పుడును బ్రస్తావింపలేదు. మఱియొకవిధముగ

అని గద్దించి యడుగుచుండెడిది. అప్పుడాతఁడు "సరే! దాని కేమి! చూతముులే! ఇంతకను గళ్యాణతారవచ్చినప్పు డేదియు నాగదు! ఊరకే మన మనుకొనుచుందుముగాని, మనలో నేమున్నది? ఏది యెట్లు జరుగవలసి యున్నదో యట్లు జరిగి తీరును. కాన యన్యథా మార్చుట కెవ్వరికినిశక్తిలేదుగదా!' అని చెప్పి యప్పటికిఁ దప్పించుకొను చుండెను.

భర్తకోట్యమువారి సంబంధమువిషయమున నౌదా సీన్యము వహించినకొలఁదియు వేంకటాంబకు వారిసంబంధ ములో నెక్కువసుగుణములు కానఁబడఁజొచ్చెను. అందువలన విశ్వనాథనాయకుఁ డెప్పుడైన వారియింటికరుదెంచినప్పు డామె యాతనిని గ్రొత్తయల్లునివలె గౌరవించుచుండెడిది. ఇంతియే గాక, యే మంచితీర్థమో తెప్పించుమిషపై మీనాంబిక యాతని యెదుటఁ బడునట్లు చేయుచుండెడిది. క్రమముగా నీ విధములగు దోహదములవలన మీనాంబికావిశ్వనాథుల కొక రొకరిపైఁ బ్రేమలతాంకురము లల్లుకొనసాగెను. రామభద్ర నాయకుఁడు సామాన్యముగ రాజ్యవ్యవహారములపై నే మధురకో, తంజాపురమునకో, రాయచూరుదుర్గమునకో పయన మయి పోవుచుండెడివాఁడు. అట్లు పోవునప్పుడు, సామాన్య ముగ సైన్యములోఁ బ్రధానోద్యోగియగు చెవ్వప్పనాయకుని గూడ వెంటఁ గొనిపోవుచుండువాఁడు. అందుచే రామభద్ర నాయకునికిఁగాని, యాతని మేనల్లునికిగాని, యీవిషయమున ననుమానింప వలవసినంత యవకాశ మెప్పుడును గలుగ చేసి

అరియునుగాక, వేంకటాంబకూడ భర్తను మోసగింపవలయు నన్న దురుద్దేశముతో నెప్పుడును బ్రవర్తింపలేదు. అట్లు ప్రవర్తించుట కేవల మవివేకమనికూడనామెకుఁ దెలియకపోలేదు. కాని యామె విశ్వనాథుని జూచినప్పు డెంతో యాప్యాయముగ నుండెడిది! అందుచే నాతనిని మిగుల గౌరవముగఁజూచెడిది. మీనాంబికావిశ్వనాథుల నొకదృష్టితోఁ జూచినప్పు డామెకుఁ దెలియకుండగనే, హృదయాంతరాళమునుండి నొక యానందతరంగ మువ్వెత్తుగఁ బైకిఁ బొంగి, కనుగొలుకుల నుండి యానందబాష్పాంకురములు ప్రవహింపఁ జేసెడిది!

విశ్వనాథనాయకునికి మొట్టమొదట మీనాంబికను జూచినపు డామెలో నేమియు విశేష మగపడలేదు. కాని మీనాంబిక మొదట నాతనిని జూచినపుడు వంచిన శిరస్సు మరి పైకెత్తలేక పోయినది! ప్రథమదర్శనదినమునుండియు వారిలో నజ్ఞాతములగు రాగాంకురములు మెల్ల మెల్లగ నీటక లెత్తసాగెను. క్రమక్రమముగ విశ్వనాథనాయకుని హృదయ దర్పణమున మీనాంబికాసౌందర్యము ప్రతిబింబింపసాగెను. నడచుచున్నప్పుడు గూడ నాతని నెవరో వెన్నంటి వచ్చుచున్నట్లు పొడకట్టెడిది. ఆవిధముగఁ గొంతకాలము జరిగిన వెనుక విశ్వనాథనాయకునికిఁ దనకు మీనాంబికయం దనురాగము కలిగినట్లు విదిత మయ్యెను. గుఱ్ఱపుస్వారి చేయుచున్నప్పు డెప్పుడైనఁ దనయశ్వము రామభద్రనాయకుని యింటిముందుండిపోవుట తటస్థించినయెడల, విశ్వనాథనాయ

కనిముఖ మప్రయత్నముగ నాయింటిగవాక్షములవైపు తిరుగుచుండెడిది. అంతటఁ గొంతకాలము పోయినతరువాత నాతఁడే యేదో యొకమిష కల్పించుకొని, రామభద్రనాయకుని గృహమున కేగి, మీనాంబిక నొక్కసారి కన్నులారఁ గాంచి, యానందించెడివాఁడు. క్రమముగ నాతనికి మీనాంబికాదర్శనము లేనిరోజులు దుస్సహములై పోయెను. ఈకారణముచేతనే రాజధాని విడిచిపెట్టుట యనిన నాతనికి గుండెలలో రాయి పడినట్లుండెను. కావుననే తండ్రి తన్ను మధురకు రమ్మని పిలిచినప్పు డేమియు ననలేక మాటవరుసకు 'సరే' యన్నాఁడు.

కాని 'సరే' యన్న యుత్తరక్షణములో నాతనిమనోరంగములోఁ దెర తొలగించి వచ్చిన 'భామ' వలెఁ దళుక్కుమని మీనాంబిక ప్రత్యక్షమైనది! ఆతఁడు తన మనోనేత్రములతో నామెసౌందర్య మాలోకించుచు, మెల్లమెల్లగఁ దన భవనమునకుఁ జేరుకొన్నాఁడు. మార్గమున దృశ్యము లన్నియు నాతని కస్పష్టములై పొగమంచులో నదృశ్యములై పోవుచున్నట్లు కనుపట్టెను. అతని కామె యుజ్జ్వలరూప మొక్కటె తనతో నడచి వచ్చుచున్నట్లు తోఁచెను. ఆయాలోచనాపరంపరలలో మునుఁగుటవలన నాతఁ డశ్వము నదలించుట మానివేసెను. అందుచే నది యడుగులలో నడుగులు వైచుకొనుచు మెల్లమెల్లగ నడువసాగెను. అప్పటికింకను బాగుగఁ బ్రొద్దువాలలేదు. అందుచే నతఁ డొకసారి రామభద్రనాయకుని గృహమున కేగి, మీనాంబికను దర్శింప వలయునని తలఁ

చెను. కావున నాలోచనలలోఁ గూరుకొని పోవుచున్నముఖము పైకెత్తి, చుబుకుతో నొకసారి యశ్వము నదలించెను. అది యాతని నొక నిమేషములో స్వగృహమునకుఁ గొనిపోయెను.

---

౪

విశ్వనాథనాయకుఁ డింటికిఁ జేరుకొనఁగానే పన్నీటి పెప యుష్ణోదకమున జలక మాడెను. ఆపిమ్మట మోఁకాళ్ల వఱకును వ్రేలాడు నొకజరీయంగీయు, నిట్టూర్పు సోఁకినంత మాత్రమున నిటునటుఁ గదలాడు నొక చలువమడతయు ధరించెను. అపిమ్మట శిరస్సుపై రత్నములు పొదగిన యొకయుష్ణీషము దాల్చెను. తరువాత నిలువుటద్దము నెదుట కేఁగి, తన వేషసౌందర్యము పరిశీలించుచుండెను. ఇంతలో దాసి యొకతె కస్తూరితిలక పేటికఁ గొనివచ్చి యాతనిసన్నిధి నుంచెను. ఆతఁడది యందుకొని, యొకబంగారుశలాకతో నుదుటిపైఁ దిలకము దిద్దికొనియెను. ఆసమయమునఁ గస్తూరితిలకలేశ మాతని ముంగురుల కంటుకొనెను. అదితుడిచివేయుట కొకవస్త్రము తెమ్మని దాసితోఁ జెప్పవలయునని యనుకొని, యాతఁడామె వైపు చూచెను. అంతవఱకును నిశ్చలముగ నాతని సౌందర్యమీక్షించుచున్న యాదాసి తటాలునఁ గనుఱెప్పలు సమీప

గవాక్షమునుండి కానవచ్చుచున్న భవనోద్యానమువైపు ద్రిప్పి వేసెను. కాని మరల నాతనివైపు చూచి, యాతనియుద్దేశము గ్రహించి యొక చిన్న యుత్తరీయము తెచ్చియిచ్చెను.

ఎదురుగనున్న నిలువుటద్దములో నాతనియాణిముత్యములచౌకట్లు మిలమిల మెఱయఁజొచ్చెను. ఆతఁడు తన సౌందర్య మొక నిమేషమునకును గనుఱెప్పవేయకుండఁ జూచెను. ఆపిమ్మట దాసి యాతఁడు కూరుచున్న సింహాసనము వెనుక నొక బంగరుపళ్ళెరములో నెఱ్ఱనినిప్పులు తెచ్చియుంచి వానిపై ఘుమఘుమలాడు నగరుదంతవుఁ గంధపుబొడిచల్లెను. వెంటనే మంథరమంథరములగు ధూమలత లల్లిబిల్లిగ నల్లుకొనుచుఁ బైకి లేవసాగెను. ఆతని యెదురుగ నున్న దర్పణములో నాయెఱ్ఱనియంగారములు, ఆబంగరుపళ్ళెరము, అల్లిబిల్లిగ నల్లుకొనుచుఁ బైకిలేచుచున్న యాధూమమాలికలు, ఆమాలికలలో నొక వింతసోయగముతో వెలుఁగుచున్న యాతని ముఖము; ఆయెఱ్ఱనినిప్పుల వెలుఁగులు ప్రతిఫలించిన యాయాణిముత్యములచౌకట్లు మొదలగున వన్నియుఁ దళత్తళత్కాంతు లీనుచుఁ బ్రకాశించుచుండెను.

విశ్వనాథనాయకునిది పురుషులనుగూడ మోహింపఁ జేయఁగల సౌందర్యము. ఆతనిగరుడనాసికయు, విశాలనేత్రములును జూచినవారి కాతఁ డొకయసామాన్య పురుషునివలెఁ గాన్పించును. ఆతనివయస్సు సుమా రిరువదియైదేండ్లుండును వ్యాయామమువలనఁ గండలు తేరిన యాతనిశరీరము చూచిన

వారికి సామాన్యముగ నాతనికి ముప్పదియేండ్లవయ స్సుండ
వచ్చుననియు ననిపించును. ఆతని శరీరవర్ణము బాగుగ నెఱుపు
కలిసిన పసుపురంగుతో నిగనిగ లాడుచు, మిసమిసలాడు
నూత్నయౌవనమును సూచించుచుండెను. ఏదేని కార్యతత్పర
తలో నున్నప్పుడుతప్ప సామాన్యముగ నాతని విశాలనేత్రములు
కలలు గనుచున్నట్లుండును. ఆతఁడు మితభాషి; ఎదుటివారయి
దాఱువాక్యములలోఁ జెప్పువిషయ మాతఁ డొకపదముతోఁ
గాని, వాక్యముతోఁగాని ముగించును.

అలంకారము ముగించినవెనుక నాతఁడు సింహాసన
మున కల్లంతదూరములో నున్నపావలు తొడుగుకొని, మెల్ల
మెల్లగ వీధిగుమ్మమువైపు నడువఁదొడఁగెను. దాసి కను
రెప్పలు వంచి "ముత్యాలహారముకూడఁ దెత్తునా?" అనియెను.
ఆతఁడు వీధివైపు చూచుచు "ఔను! అన్నట్లు మఱచిపోయి
తిని" అనియెను. వెంటనే యామె లోనికేగి యొకవెండిపళ్ళెర
ములో ముప్పేటముత్యాలహారమును, దాంబూలపుఁజిలుక
లును, గొనివచ్చి యాతనిపార్శ్వమున నిలువఁబడెను. ఆతఁ
డాముత్యాలహారము మెడలో వేసికొని తాంబూలము నమ
లుచుఁ గొంచెము తొందరగ సింహద్వారము సమీపించెను.

నాగమనాయకుని భవనమునకును, రామభద్రనాయ
కుని భవనమునకును, నడుమ నయిదాఱువందలబారలకంటె
నెక్కువ దూరముండదు. అందుచే సామాన్యముగ నాతఁడు
వారియింటికి నడచియే పోవుచుండును. ఈనాఁడుకూడ నాతఁ

దర్శన చేయవలెఁచెను. ఆతఁడు వీథిలోనికి వచ్చి పది పదునేను బారలదూరము నడచెను. ఎదురుగనున్న శ్రీకృష్ణస్వామి దేవాలయముపైనున్న మాణిక్యభూషితమగు బంగారుచక్రము, సాయంకాలపు శీరాతపకాంతులలోఁ దళతళ మెరయుచుండెను. దేవాలయగోపురపుగూళ్ళలో నివసించు పారావతములు రెక్కలతో 'టపటప' మని ధ్వనిచేయుచు నటు నిటు నెగిరి మరల దేవాలయగోపురముపై వ్రాలుచుండెను.

అతఁడింకను బదిబారలదూరము నడచెను. ఎదురుగ నాతని కొక పెద్దజనసమూహము కానవచ్చుచుండెను. క్రమక్రమముగ జనులందఱు వచ్చుటఁ బోఁగుపడుచుండిరి. వారిలోఁ జాలమంది దేవాలయముల కేగి దేవతాదర్శనము చేసికొనుటకు బయలుదేరినవారే! మరికొందఱు సరోవరతీరముల విశ్రమించుటకై బయలుదేఱినవారు; కొంద ఱేవేవో పనులు చూచుకొనుటకై బయలుదేఱినవారు. కాని వారందఱును నొకరి నొకరు త్రోసికొనుచు నశ్వముపైఁ గళ్ళెములు బిగించి, కూర్చుండిన యొకవింతమానిసివైపు చూచుచుండిరి. అతఁడు చూచుటకుఁ దెల్లగ సన్నమువలె నుండెను. ఆతని యొజ్జ్వల నేత్రము కలగడ్డము గుండెలో గుచ్చుకొనుచున్నట్లుండెను. లోఁతుగ నున్నయాతనికనుగూండ్లలోఁ బిల్లికన్నులవంటి కన్నులు కానవచ్చుచుండెను. ఆతనిముందున్న రాజభటు లాతనియశ్వమున కొకింత త్రోవ చేయఁ బ్రయత్నించుచుండిరి. జనులు రాజభటుల యొత్తిడివలన నాక్షణమునఁ గొంచెము దారి యిచ్చు

చున్నను, ఉత్తరదక్షిణమున మరలఁ దేనెటీఁగలవలె గుమిఁ గూడుచుండిరి. విశ్వనాథనాయకుఁడు మెల్లమెల్లగ నాజన సమూహాము సమీపించెను. ఇంతలో నాతని సమీపమున నున్నకొందఱు "హరిణాస్థానాపతి" యని గుసగుస లాడుకొను చుండిరి. దానినిబట్టి విశ్వనాథుఁ డాతఁడు"బుడతకీచుల రాయ బారి" యని తెలిసికొనెను.

దూరమున నశ్వముపై నున్న హరిణాస్థానాపతి విశ్వ నాథనాయకుని జూడఁగనే తటాలున గుఱ్ఱము దిగి యాతనికి సవినయముగ నమస్కరించెను; విశ్వనాథుఁడుకూడ యథోచి తముగ నాతనికిఁ బ్రత్యభివాదన మొనరించెను. ప్రజ లంద ఱును విశ్వనాథుని జూచి "దళవాయి శ్రీవిశ్వనాథనాయనిం గారు" అని యనుకొనుచు నాతనికి దారి యిచ్చుచు, దూర ముగఁ దొలఁగి నిలుచుండిరి. హరిణాస్థానాపతియు, విశ్వనాథ నాయకుఁడును వారిచ్చిన దారినిఁబట్టి తమతమ గమ్యస్థానము లకు బయలుదేఱిరి. క్రమక్రమముగ జను లందఱును గుంపులు గుంపులుగ నచ్చటినుండి వెడలిపోయిరి.

విశ్వనాథనాయకుఁ డాజనసమూహాము దాఁటి రామ భద్రనాయకునిభవనమునఁ బ్రవేశించెను. కృపాణధారులైన ద్వారపాలకు లాతనికి నమస్కరించి నడుములవఱకును వంగి నిలువఁబడి యుండిరి. విశ్వనాథుఁడు క్రమక్రమముగ నంతర్భవ నమున కరిగెను. అచ్చట నొక పంజరమున వ్రేలాడు రామ చిలుక యాతనిని జూచి "బావ! బావ!" యని పలుకసాగెను.

దానిపలుకుల కాచావడిలో వ్రేలాడు ధాన్యగుళుచ్ఛములపై వ్రాలుచు ధాన్యపుగింజలు తినుచున్న పిచ్చుకలన్నియుఁ "గిచ కిచ" మని ధ్వనిచేయుచు నొక్కపెట్టున నచ్చటినుండి యెగసిపోయెను.

చిలుక కేకలు విని యాతనిరాక యెఱింగిన కొందఱు దాసీ లచ్చటికి వచ్చి తగిన మర్యాదలు చేయసాగిరి. ఇంతలో రామభద్రనాయకుని భార్యయగు వేంకటాంబ యచ్చటికి వచ్చి "ఇదిగో! మాయింటికి దారి తప్పి వచ్చినట్లున్నావు!" అని యెను. విశ్వనాథనాయకుఁ డొకసారి కంఠము సవరించుకొని "కాదమ్మా! ఈమధ్య నన్ను రాజధానిలో నున్నఘోజున కంత టికిని దళవాయిగా నేర్పరచినారు. అందుచేత—ఆపనితొంద రలలో నూపిరి యాడకపోవుటచే రామభద్రను మామయ్య గారిదర్శనము చేసికొన లేకపోయినాను. ఇంతలో నాయన మధుర వెళ్ళినారని తెలిసినది. పోనీ! ఒకసారి చూచి పోద మని యిటు వచ్చితిని." అని సమాధానము చెప్పెను.

"ఏమో! నాయనా! ఈదక్షిణరాజ్యకల్లోల మెప్పటికి ముగియునో!"

"దీనిలో నేమియు భయపడ నవసరములేదు! వారీ యల్లకల్లోలము లన్నియు నొక్కత్రుటిలో నడఁచివేయఁగలరు. మానాయనగారును, వారును, దలఁచుకొన్నచో వారియెదుట నెవ్వ రాఁగఁగలరు?"

"ఇది యంతయు ముగియునప్పటి కెంతకాలముపట్టునో?"

"అంతయు ననుకూలముగ నడచినచో రెండుమాస ములకాలముకంటె నెక్కువ పట్టదు."

"అంతవఱకును వారు మధుర విడిచివచ్చుటకు వీలుండ దన్నమాట?"

"అల్లకల్లోలములు కొంచెము శాంతించినచో నప్పు డప్పుడు వచ్చుచుఁ బోవుచు నుండవచ్చును."

సంభాషణ మీవిధముగ సాగుచుండెను. విశ్వనాథ నాయకుఁడు వేంకటాంబ యడిగినవాని కేవేవో సమాధాన ములు చెప్పుచుండెను. కాని యాతనిమన స్సాసమాధానము లలో లేదు. సామాన్యముగ నాతఁడు వచ్చినపు డెల్ల నేదో విధముగ నొకసారి మీనాంబికాదర్శనము చేయవలయునని యువ్విళ్ళూరుచుండువాఁడు. అందుచేత నీనాఁడుకూడ మీనాం బికాసాక్షాత్కృతి యగునేమో యను తహతహతో నాతని జ్ఞానేంద్రియము లన్నియు నట్టుడికిపోవున ట్లుడికిపోవుచుండెను. వేంకటాంబ తాను చావడిలోనికి వచ్చునపుడు, ప్రవేశించిన గుమ్మముతలు పోరువాకిలిగా నుంచి వచ్చెను. ఇచ్చటికి వచ్చి నపుడు మీనాంబిక సామాన్యముగ నేతలుపుచాటుననుం డియో యాతనివైపు చూచుచుండు టలవాటు. వేంకటాంబిక చావడిలోఁ బ్రవేశించిన ద్వారము విశ్వనాథనాయకుఁడు కూర్చున్న సింహాసనమునకు సరిగ నెదురుగ నున్నది. అప్పు డప్పు డాతఁ డావైపు చూచుచుండెను. విశ్వనాథనాయకుఁ

డిక్కడికి వచ్చి యప్పుడే యొక గడియ దాటినది. ఎంతసేపటి కిని నామెరాకయే లేదు!

కొంతసేపటికి మొదట విశ్వనాథనాయకుని కతిమృదు లములగు పదధ్వను లేవో వినవచ్చెను. ఆతని సర్వేంద్రియము లును నొక్కసారిగ శ్రవణద్వయిలో విలీనమై పోయెను. ఆపద ధ్వనులలో ఘల్లుఘల్లుమని మ్రోగిన ప్రతిచిఱుమువ్వయుఁ బాదసౌందర్యముతోఁ గలిసి యాతనియెదుట నాట్య మాడఁ జొచ్చెను. ద్వారముప్రక్కన నిలువఁబడిన వేంకటాంబ కాయ లికిడి లేశమైనను వినిపింపలేదు! తరువాత నాతనియెదురుగ మెల్లమెల్లగ నీటిలోనుండి తేలుచున్న గండుమీనులవలె రెండు నేత్రము లగపడెను. ఆతఁ డొకక్షణకాలము వానిసౌందర్యము తనివిదీఱఁ గ్రోలెను. అంతే! ఉత్తరక్షణములోఁ దటాలున నీటిలో మునిఁగిన మీనద్వయివలె నామెనేత్రము లదృశ్యములై పోయెను. ఆతనిశరీర మొక్కసారిగ నాపాదమస్తకమును జిల్లు మనియెను! తాంబూలరాగముచే సుందరములగు నాతని పెద వులపై నొక మందహాసము చిందులు ద్రొక్కసాగెను. ఆతని ముఖ మపరిమేయానందముతో సముజ్జ్వల మయ్యెను.

వేంకటాంబ యాతని ముఖభంగిమ చూచి యాద్వార ముదరికి మీనాంబిక వచ్చి యుండునని యూహించెను. వారిరువురి ముగ్ధప్రేమవిలాసములును జూచియుఁ జూడనట్లు చూచుచున్న యామెహృదయమున నొక్కసారిగ వాత్సల్య

తరంగ మొప్పొంగెను. ఆమె యొకసారి గొంతు సవరించుకొని "అమ్మా! అంబికా! బావవచ్చి యెంతసేపైనదో చూచితివా! ఈపాటికిఁ గొంచెము ఫలహార మేమైనఁ దేవలదా? తల్లీ!" యనియెను. ఆమె వచ్చువఱకును విశ్వనాథనాయకుఁడును వేంకటాంబయు మరల నేమియు మాట్లాడుకొనలేదు. నాలుగైదు నిమేషములు గడచిపోయెను. విశ్వనాథనాయకుఁడు మీనాంబిక శరీరసౌందర్యమంతయుఁ దనివితీరఁ గ్రోలవచ్చునను నుత్కంఠతో నామెదర్శనమున కెదురుచూచుచు, మరలఁ దనయుత్కంఠ వేంకటాంబ కనిపెట్టివేయు నేమో యను సంకోచముతో నప్పుడప్పు డటునిటుఁ జూచుచుఁ గూరుచుండెను.

ఇంతలో మీనాంబిక దక్షిణహస్తమున బంగారుపళ్ళెరముల నుంచిన భక్ష్యములనుఁగొని మెల్లమెల్లగ లోన బ్రవేశించెను. ఆమె వెనుక నొకదాసి క్షీరమును, నుదకమును గొని వచ్చెను. మీనాంబికావిశ్వనాథుల కనులొకసారి పై కెగసి, తటాలున మరలఁ గ్రిందికి వ్రాలిపోయెను. మీనాంబిక శరీర వర్ణ మెఱ్ఱగాఁ గ్రాగిన పాలవలె నుండును. నేత్రము లంతగా విశాలములు గాకపోయినను దీర్ఘములై కనుగొనలు వంపులు దేఱి చూపఱహృదయముల గాలములవలెఁ గ్రుచ్చుకొను చుండెను. ఆమెకు లోనికి వచ్చుసరికి ముచ్చెమటలు పోయుచున్నటు లుండెను. అందుచేఁ గనుబొమలకుఁ గొంచెము పైభాగమునను్న సిందూరతిలకము చెమ్మగిల్లెను. దాడిమీఫలారుణమగు నామె ధరించిన చెంగావిపట్టుదువ్వలువ శరీరసౌంద

ర్యము పై కెగఁ జిమ్ముచుండెను. ఆమె కర్ణముల కలంకరించు కొసిన బంగారు జూకాల చిఱుముత్తియములు కపోలములపై నస్పష్టముగఁ బ్రతిబింబించెను. ఆమె యొక్కొక్కయడుగు వేయుచు, సమీపించుచున్నప్పుడు కాలియందెలును, జడగంట లును నేకతాళమున నొక్కమాఱుగ మ్రోఁగుచుండెను.

చావడిలో నడుగు పెట్టఁగనే యామె కధరముపై నస్పష్టమగు నొక చిఱునవ్వుదయించెను. దాసి పాలును, మంచితీర్థమును, నాతనిదగ్గఱఁ బెట్టి, మరల నీవలకు వచ్చి ద్వారమునొద్ద నిలువఁబడెను. మీనాంబిక సిగ్గుపడుచుఁ దాను తెచ్చినపళ్ళెర మాతనియొద్ద నుంచి, లోనికిఁ బోవఁదలఁచెను. కాని వేంకటాంబ యామెతో "అమ్మా! వెళ్లుదువుగానిలే! బావ ఫలహార మయినంతవరకును నొకనిమిష ముండి, యాతని కేమేమి కావలయునో కొంచెముచూచి, మఱి వెళ్లుము" అనియెను. ఆమె గత్యంతరము లేనిదానివలె సిగ్గు పడుచు నొకమూలగా నిలువఁబడెను. విశ్వనాథనాయకుని ఫలహారము పూర్తియయిపోయెను. ఫలహారము ముగించిన తరువాత నాతఁడు సుగంధద్రవ్యములు చేర్చుటచే దూరము నకుఁగూడ ఘుమఘుమ పరిమళించుచున్న యాక్షీరములు త్రాగి యాపిమ్మటఁ గొంచెము మంచితీర్థము పుచ్చుకొనెను. వెంటనే మీనాంబిక మరల లోనికేగఁబోయెను.

విశ్వనాథుఁ డామెవైపు క్రీగంటఁ జూచుచు వేంక టాంబవైపు చూచి చిఱునవ్వునవ్వుచు, "మీనాంబిక లోనికిఁ

బోవుచున్నట్లున్న. ఈవేళ నా కేమియు నాఁకలి తీఱలేదు. ఇంకను గొన్ని భక్ష్యములు తినవలయునని యున్నది' అనెను. వేంకటాంబ యాతనిచమత్కృతి గ్రహించి మీనాంబికతో "చూచితివా! పాపము! నీ వెప్పుడు తెచ్చినను నాతని కాఁకలి తీరుట యనునది యుండదు. ఇంకను గొన్నిభక్ష్యములు తీసికొనిరా!" అనెను. మీనాంబిక కపోలములు సిగ్గుచే నెఱ్ఱవడెను. ఆమె మరల లోనకేగి కొన్నిభక్ష్యములు గొనివచ్చెను. విశ్వనాథుఁడు పళ్ళెమువైపును, నామెకపోలములవైపును, మరలఁ జూచుచు "ఈవేళ మీనాంబికను జాల శ్రమ పెట్టినాను. ఊరక నే నట్లంటినిగాని నా కివి యన్నియుఁ గావలెనా? మీనాంబికకూడఁ గొంచెము సాయము చేసినచో నేనివి తినగలను. లేకపోయినచో నివి యన్నియుఁ దినుట నాతరమా!' అనెను. మీనాంబిక లోలోపలినుండి పొంగిపొంగి పొరలి వచ్చుచున్న చిఱునవ్వుఁ జికొని, యాచావడిమూలగ నట్లులే నిలువఁబడియుండెను. వేంకటాంబ విశ్వనాథుని మాటపై "అమ్మా! ఎంతవాఁడవు! ఇంతవఱకును దెచ్చినతరువాత నా కక్కఱ లేదందువా! చాలులే నీగడుసుఁదనము" అనెను.

విశ్వనాథుఁడు "అక్కఱలేదనుచున్నానా? నేనొక్కఁడ నివి యన్నియుఁ దినలేను; నాకు మీనాంబికసాయము కావలెనని యున్నాను. అంతే!" అనెను. కాని మీనాంబిక యాతని దగ్గఱకు రాలేదు. విశ్వనాథుఁడు మరల "మీనాంబిక వచ్చి నాకు సాయముచేయనిచో నేనొక్క భక్ష్యమైన ముట్టను,

ఏమైననుసరే!” అనియెను. కాని మీనాంబిక తల వంచుకొని యట్లే నిలువఁబడిపోయెను. వేంకటాంబ “చాలులే! నాయనా! గడుసువాఁడవు కావున నాచిట్టితల్లి నీవిధముగ నాడించు చున్నావు” అనెను. విశ్వనాథుఁ డంతటితో నూఱకుండక “ఓహో! తెలిసినది! నేను స్వయముగ వచ్చి తనచేయి పట్టు కొని తీసికొనివచ్చి నాసరసను గూర్చుండఁ బెట్టుకొనవలయును గాఁబోలును!” అని చెప్పి లేచి, యామెదగ్గఱకేగి, యామె కుడిచేయి పట్టుకొనఁబోయెను. కాని మీనాంబిక యొక్క-త్రుటిలో నాతనికి దొరకకుండఁ దప్పించుకొని లోనికిఁ బాఱి పోయెను! వేంకటాంబ యాయిరువురిముగ్ధప్రేమకును, లోలోపల నానందించుచు “మంచిపనిజరిగినదిలే! ఇంత గడుసుఁదనము చేసినందులకు నీకిట్లుజరుగవలసినదే!” అని వేళాకోళము చేసెను.

విశ్వనాథనాయకుఁడు మరల వచ్చి స్వస్థానమునఁ గూర్చుండి, యప్పు డప్పు డొకటి రెండు భక్ష్యములు నోట వేసికొని నములుచు, వేంకటాంబయడుగువాని కుత్తరము లిచ్చు చుండెను. సంభాషణవశమున, నామె, యాతనినూతనోద్యోగ మునుగూర్చియు, మధురదండయాత్రనుగూర్చియు, నేవేవో ప్రశ్న లడుగుచుండెను. అతఁడుమాటిమాటికిని ద్వారము వైపు చూచుచు నట్లే యామె కేవేవో ప్రత్యుత్తరము లిచ్చు చుండెను. ఆతని కీమధ్య వచ్చిన యున్నతోద్యోగముచేనామె లోలోపల నెంతో సంతసించుచు “నాకితఁ డల్లుఁడైనచో నెంత బాగుండును” అని యనుకొనసాగెను. వా రిరువురును

నావిధముగ నత్యాసక్తితో మాట్లాడుకొనుచుండఁ, జావడి మూలమూలలలో సంధ్యాంధకారములు మెల్లమెల్లగ దాఁగి కొనసాగెను. ఇంతలో దాసి యచ్చట బంగారుసెమ్మా యమర్చి, దానిపై నొకదీపముంచెను. విశ్వనాథుఁ డదిచూచి యల్లన లేచి, వేంకటాంబకడ సెలవుగైకొని యింటికి బయలు దేఱెను. వేంకటాంబ యాతనిని సింహద్వారమువఱకును సాగ నంపి "మీమామయుఁ జెవ్వప్పయుఁగూడ లేకపోవుటచే నిల్లం తయుఁ జిన్నబోయినట్లున్నది. కొంచెము నీవప్పుడప్పుడు వచ్చి మమ్ములను బలుకరించి పోవుచుండుము!' అనియెను. విశ్వనాథుఁ 'డటులనే అమ్మా!' యని యామెకడ సెలవుగైకొని వెడలి పోయెను.

---

౭

నాగమనాయకుఁడు రామభద్రి చెవ్వప్పనాయకులను దోడుచేసికొనియొకముప్పదివేల సైన్యముతోమధురపైకిబయలు దేఱెను. ఈ ముప్పదివేలసైన్యములోను, నించుమించుగఁ బండ్రెండువేలవఱకును నాశ్వికసైన్యమే! ఆమిగిలినదానిలోఁ బది వేలకుఁబైగాఁ గాల్బల ముండెను. ఆమిగిలినదానిలో నేనుఁగులు, శతఘ్నిశకటములు, వృషభశకటములు మొదలగునవి యుండెను.

ఈసైన్యమంతయు బయలుదేఱుచున్నప్పు డొక మహానగరము కదలిపోవుచున్నట్లుండెను. శ్రీకృష్ణదేవరాయలు సైన్యసమీకరణాదివిషయములలోఁ జాలక్రొత్తమార్పులు తెచ్చిపెట్టెను. రాయలసైన్యములు కదలిపోవునపుడు, వానికిఁ గావలసిన సరకులు సమకూర్చుటకు వందలకొలఁది వణిజులు తమతమ యాపణములతోఁ గదలిపోవుచుండిరి. రాజధానిలో దొరకు సమస్తవస్తువులును నా సేనానివేశములో లభించుచుండెను.

నాగమనాయకుఁడు దక్షిణదండయాత్రల విషయము లలో బాగుగ నాఱితేరిన చేయి. కావున నాతఁడు సైన్యములను బగలు ప్రయాణము చేయనీయక రాత్రిమాత్రమే ప్రయాణము చేయనిచ్చుచు, నతిరహస్యముగ మధుర సమీపించెను. పగలు సామాన్యముగ నాతఁడు సైన్యముల కడవులలోనే విడుదు లేర్పాటు చేయించుచుండెను. ఈముప్పదివేల సైన్యమును నొక్కసారిగ మధురపై బయలుదేఱుచున్నదని తెలియకుండఁగ నాతఁడు సైన్యము మూఁడుభాగములుచేసి, వాటిలో నొకదానికిఁ దా నాధిపత్యము వహించి మిగిలిన రెండుభాగములకును, రామభద్ర చెవ్వప్పనాయకులను సైన్యాధిపతులనుగా నొనర్చి, యీమూఁడుసైన్యములును, రహస్యముగఁ ప్రయాణములుచేసి, మధురకుఁ నాలుగుక్రోశముల దూరముననున్న యొక యరణ్యమునఁ గలిసికొనునట్లేర్పాటు కావించెను.

ఈముప్పదివేలసైన్యము సురక్షితముగ నీమధురాసమీపమున నున్న యరణ్యమునకుఁ జేరుకొన్నది. ఇంతవఱకును

నీ సేనాధిపతులు ముఘ్వురును దమసైన్యముల నతిరహస్యముగ నడపించుచు, శత్రువుల కనుమానము గలుగకుండఁ బ్రవర్తింపఁ గలిగిరి. నాగమనాయకుఁడుగూడఁ బ్రత్యేకముగఁ దనకు రామభద్రచెవ్వప్పనాయకులు చూపిన తోడ్పాటున కెంతయు సంతసించెను. ఈయరణ్యమున కీసైన్యమంతయు గడచినరాత్రి చేరుకొనెను. సైన్యమంతయు దీర్ఘప్రయాణముచే నలసి పోయెను. అందుచే నాగమనాయకుఁడు సైన్యమునకుఁ గొంత విశ్రాంతి యిచ్చినపిమ్మట హఠాత్తుగా మధురపైఁ బడవలయు నని యాలోచించుచుండెను.

అప్పటి కర్ధరాత్రి యైనది. ఆనాఁడు ఫాల్గున శుద్ధ దశమి. ఆకాశమున నెక్కడను మేఘమనుమాట యైనఁ గను పట్టుట లేదు. దిశావకాశమంతయుఁ దెల్లని పొగమంచు ముసుఁగుచే నవకుంఠితమయ్యెను. పొగమంచుమూలమున సేనానివేశ మంతయు నొక్కసారిగ తిలకించుటకు వీలులేకుండెను. సైనికు లందఱును నిద్రించుచుండిరి. అప్పు డప్పుడు గజబృంహితము లును, హయహేషలును వారినిద్రలకు భంగము కలిగించు చుండెను.

నాగమనాయకుఁడు మేలుకొని తానున్న గుడారమున నటునిటుఁ బచారు చేయుచు సైన్యములన్నియుఁ బరిశీలించుచు నేమేమో యాలోచించుచుండెను. అతఁ డాజానుబాహువు; అతనికి సుమా రఱువదియేండ్లుండవచ్చును. శరీరము ముడు తలుపడి శుష్కించియున్నను, నాతనిచూపులలో వార్ధక మెచ్చ

టను గానవచ్చుటలేదు. సామాన్యముగఁ దెల్లగా నరసిన బొద్దు మీసములగుబురులో నాతనిపెదవులు కానరాకుండెను. సన్న నివియుఁ జిన్నవియునగు నాతని నేత్రములనుండి సూదులవంటి కనుచూపులు బయలువెడలుచుండెను. వృద్ధుఁడైనను నాతని నడు మొక్కింతయైనను వంగలేదు. ఆతనియొఱలో రత్నముల పిడిగల యొక దీర్ఘకరవాలము వ్రేలాడుచుండెను. ఆతఁ డిటు నటుఁ బచారుచేయుచున్నప్పుడు తెల్లగా నరసిన శిరముపై నలరారు నుష్ణీషముకుచ్చు గాలికిఁ గొంచె మిటు నటుఁ గద లాడుచుండెను. అటు నిటు నడచుచున్నప్పుడు సూదివలె మొన దేఱియున్న యాతనిశుష్కనాసిక దట్టముగ నావరించుకొని యున్న పాగమంచులో గుచ్చుకొనుచున్నట్లుండెను. చామన చాయగనున్న యాతనిశరీరముపై నొకయంగీ దట్టముగ నంటి పెట్టుకొనియుండి చలి వేయకుండఁ గాపాడుచుండెను.

ఒకగడియసేపటినుండి ప్రకృతియంతయు నిశ్శబ్దముగ నున్నది. మరల నానిశ్శబ్దతకు భంగము గలిగించుచు నొకటి రెండు తలక్రిందుపక్షులు రెపరెప ఱెక్కలాడించుచుఁ గీచుకీచు మని యఱచినవి. ఆ రెక్కలాడించునపుడవి యింతకుఁబూర్వము నుండి వ్రేలాడుచున్న చెట్టుకొమ్మల రెమ్మలనుండి మంచుబిందువులు రాలుచుఁ జిటపటమని ధ్వని చేసినవి. ఇంతలో నాగమ నాయకునికంటఁగొంచెము హ్రస్వకాయుడు, స్థూలాకృతియునగు నొకవ్యక్తి యాతనికి నమస్కరించి నిలువఁబడెను. నాగమ నాయకుఁడు "ఎవరు రామభద్రమా!" అనెను.

"ఔను నేనే!"

"వేగులవారు తిరిగివచ్చిరా?"

"వచ్చినారు"

"శత్రువులప్రయత్నము లెట్లున్నవి?"

వారు కొంచెము యుద్ధసన్నాహము చేయుచున్నట్లే కనఁబడుచున్నది. మనరాక చాలకాలమునకుఁ బూర్వమే వారికిఁ దెలిసిన దేమో!"

"అట్లైన్నటికిని జరిగి యుండదు!"

"ఎందుచేత?"

'శత్రువునకు మనరాకయే తెలిసినచో మనల నింత సమీపమువఱకును రా నిచ్చునా?'

"ఒకవేళ దృఢముగాఁ గోటలో నిలఁబడి మనల నెదిరింపవలయునని తలఁచె నేమో!"

ఈప్రశ్నపై నాగమనాయకుఁడు చిటికినవ్రేలిగోటితో మీసములు దువ్వుచు నొకటి రెండు నిమిషముల వఱకును నాలోచించి పచారుచేయుట యాపి, రామభద్రనాయకుని కేసిచూచుచు నిట్లనియెను.

"ఆత్మరక్షణకొఱకే ప్రయత్నించినను, ఇంకను జాల దూరమునుండి ప్రయత్నించుట శ్రేయస్కరము కాదా?"

"నిజమే కాని, వారేయెత్తుపై నిట్లు చేసిరో యని నేను శంగారు పడుచున్నాను."

నాగమనాయకుఁడు మరల నింకొక నిమిషమువఱకును సమాధానము చెప్పకుండనాగి, "వారేమాత్రము సైన్యము సన్నాహము చేసిరో తెలిసినదా?" అని ప్రశ్నించెను.

"తెలిసినది; ఇరువదివేలవరకును నుండవచ్చునని యంచనా వేయఁబడినది. కాని సైన్యమంతయు నతిత్వరితముగ సమకూర్పఁబడినటుల తోఁచుచున్నది. అందుచేత సమస్త సంభారములును సిద్ధపఱచుకొనుటకు శత్రువునకు వీలిచ్చినదో లేదో!"

'ఈసైన్యమంతయు నెటువైపుననున్నదో?'

'తూరుపుద్వారమున'

'అటులైనచో సైన్యమంతయు మూఁడు విభాగములు చేసి, యొక్కసారిగఁ బ్రాక్పశ్చిమోత్తరదిశలనుండి కోటముట్టడించు నట్లాజ్ఞాపించెదను."

రామభద్రనాయకుఁ డీవాక్యమున కేమియుఁ బ్రత్యుత్తరమీయలేదు. నాగమనాయకుఁ డిట్లు పలికిన పిమ్మట బోనులోఁబెట్టఁబడిన పులివలె మూటిమూటికిని దొందరతొందరగ నటునిటుఁ బచారు చేయసాగెను. పరిచారకుఁ డొకఁడు కాగడా చేతఁబట్టుకొని వారిరువురికిని గొంచెము దూరముగ నిలువఁబడెను. ఆకాగడామంట హెచ్చుతగ్గులతో మండుచుఁ గదలునప్పుడు నాగమరామభద్రనాయకులనీడలు నేలపై నటునిటుఁ గదలసాగెను. అప్పు డప్పుడు నాగమనాయకునిమెడలో వ్రేలాడుచున్న బంగారురుద్రాక్షమాలికలును, మొలలోనున్న

రత్నములపిడియుఁ దళతళ మెరయసాగెను. క్రిమక్రమముగా వెన్నెల యరణ్యచ్ఛాయలలో లీనమయి పోవుచుండెను. చంద్ర బింబము చెట్లసందున నణఁగి మణఁగియుండి మెల్లమెల్లగా నస్త మించుచుండెను. దూరమున రాఁబోవు వసంతసూచకముగ నొకకోయిల కువకువలాడెను. క్రమక్రమముగ సేనానివేశమం దంతటను బెద్దపెద్ద కాగడాలు వెలిగింపఁబడెను. కొన్నిమృగము లావెలుఁగులకు బెదరి యిటునటుఁ బరువెత్తఁ దొడఁగెను వాని కాళ్ళక్రిందఁబడి పండుటాకులు గలగల ధ్వనింప మొదలిడెను. ఇంతలో నొకభటుఁ డొకబ్రాహ్మణుని గొనివచ్చి నాగమ నాయకునియెదుట నిలిపెను. నాగమనాయకుఁ డాతనినిజూచిన తోడనే నమస్కరించి, "సోమయాజులుగారూ! మేము మీ మాటకై యెదురుచూచు చున్నాము." అనియెను.

సోమ—కోట భేదించుటకు శుభముహూర్తము సమీ పించినది. ఇఁక రెండు గడియల పిమ్మటఁ బ్రయాణమునకు శుభ ముహూర్తము కుదిరినది. కావున సైన్యములన్నియు సిద్ధపడున ట్లాజ్ఞాపింపుఁడు!

నాగ—మనము రెండుగడియల తరువాత బయలుదేఱి నచో నించుమించుగఁ గనుచీఁకటివేళకుఁ గోటదరికిఁ జేరుకొనఁ గలము. మీముహూర్తము బాగున్నది!

ఆబ్రాహ్మణుని శిరస్సంతయు ముండితమై యుండెను. వెనుక గోష్పాదమంత శిఖ వ్రేలాడుచుండెను. వానికుండల ములు బరువుగ వ్రేలాడుచుండుటచే రెండుచెవులతమ్ములును

రెండుపెద్దరంధ్రములుగ మాఱిపోయెను. కుడిచేతి యనామికపై నొకనాగాంగుళీయకము మెఱయుచుండెను. వాని రెండు కనుల చివరిభాగములును పైకనుఱెప్పలచేఁ గప్పఁబడి యుండెను. నాగమనాయకుఁడు తనఖడ్గ మాబ్రాహ్మణుని పాదములపై నుంచి, సాష్టాంగనమస్కార మాచరించెను. ఆబ్రాహ్మణుఁ డేవేవో మంత్రములు మెల్లమెల్లగ నుచ్చరించుచు "విజయీభవ!" అని యాశీర్వదించెను. నాగమనాయకుఁడు లేచి, రామభద్రనాయకుని బిలిచి, సైన్యములన్నియుఁ బ్రయాణమునకు సర్వసిద్ధముగ నుండునట్లాజ్ఞాపింపుము" అని చెప్పెను.

వెంటనే రామభద్రనాయకుని యాజ్ఞప్రకారము భేర్యాది యుద్ధవాద్యము లన్నియు సైన్యము లన్నిటికిని వినఁబడునంత యుచ్చైస్స్వనముతో మాత్రమే మ్రోయింపఁబడెను. నాగమనాయకుఁ డొకవిభాగమునకును, రామభద్రనాయకుఁ డొకవిభాగమునకును, చెవ్వప్పనాయకుఁడు మఱియొకవిభాగమునకును నాయకులైరి. వారియాజ్ఞలప్రకారము మూఁడు సైన్యములును గొంతదూరమువఱకును నొకేవైపునకు నడచి యాపిమ్మట భిన్నభిన్నమార్గములు పట్టి నడువసాగెను. నాగమనాయకుని సైన్యము ముందుగఁబోయి మధురానగరమును దూర్పుద్వారమున ముట్టడింపవలయుననియు, నాపిమ్మటఁ జెవ్వప్పనాయకుని సైన్యముత్తరమున ముట్టడింపవలయుననియు నటుతరువాత రామభద్రనాయకునిసైన్యము రహస్యముగఁ బశ్చిమద్వారము నెదుర్కొనవలయుననియునిశ్చయింపఁబడెను.

ఆసైన్యములు బయలుదేఱినపుడు పెద్దపెద్ద ధూమ
రేఖలును, వెలుఁగులును నాకాశమున మెఱయఁజొచ్చెను.
అరణ్యమృగము లన్నియు సూర్యోదయభ్రాంతిచేఁ దమతమ
నెలవులు వీడి, భేరీభాంకారములవలనఁ గంగారుపడుచు నటు
నిటుఁ బరువెత్తఁదొడఁగెను. సైన్యాధిపతు లందఱును పెద్ద
పెద్ద యేనుఁగులపై నెక్కి, సైన్యమధ్యమునుండి సైన్యము
లన్నియు జాగ్రత్తగఁ బరిశీలించుచుఁ దమక్రింది యోధకారుల
కాజ్ఞ లిచ్చుచుఁ బ్రోత్సహించుచుండిరి. సైన్యసంచాలన
మంతయు సాధ్యమైనంతవఱకు రహస్యముగ నుంచుటకే ప్రయత్నము
గావింపఁబడెను. ఆసైన్యము లన్నియు నరణ్యమును విడిచి, యొక
విశాలమార్గముగుండ నడువఁదొడఁగెను. అప్పటి కింక రెండు
గడియలరాత్రిమాత్రమే యున్నది. మధుర రెండుక్రోసుల
కంటె నెక్కుడుదూర ముండదు. అప్పటి కిప్పుడే మూఁడు
సైన్యములును భిన్నభిన్నమార్గములఁ బట్టి తమతమ నిర్దిష్ట
ద్వారములవైపునకు బయలుదేఱినవి. మూఁడువైపులకును
బోవుచున్న యామూఁడుసైన్యములును, గాఁగడాలవెలుతురు
వలన దూరదూరమునకు మూఁడుకాంతిప్రవాహములవలెఁ గాను
పించెను. సైన్యములన్నియు సాధ్యమైనంతవఱకు నిశ్శబ్దముగ
నడచుచుండెను. బాట కిరుప్రక్కలను గంభీరముగఁ గీచురాళ్ళ
మ్రోఁత వినవచ్చుచుండెను, దూరాకాశమున మెఱయు నా
నక్షత్రసమూహ మంతయు నిశ్శబ్దముగ నాసైన్యములను పరి
కించుచున్నట్లు కానఁబడెను.

---

## ౬

చోళులును బాండ్యులును జాలకాలమునుండి, తంజాపుర మథురా రాజ్యములను బాలించుచుండిరి. అప్పు డప్పుడా రెండురాజ్యములును గలహించుటయు, మరల సంధులు చేసికొనుటయుఁగూడ సామాన్య మైపోయెను. విజయనగర సామ్రాజ్యముప్రబలమై శ్రీకృష్ణదేవరాయలు దక్షిణమంతయు నాక్రమించుకొనిన పిమ్మటఁగూడ వారి లోలోపలి యంతఃకలహము లవ్విధముగనే యుండిపోయెను. కాని, వారు రాయలు వృద్ధుఁ డగునంతవఱకును బరస్పర రాజ్యముల కాసింపక సుహృద్భావముతో మెలగుచుండిరి. చక్రవర్తి వృద్ధుఁడైనపిమ్మట మరల వారియంతఃకలహములు తల లెత్తఁదొడఁగెను. అవి చిలికిచిలికి గాలివాన లగునేమో యను భయము కలుగుచునే యుండెను. కాని తిమ్మరుసుమంత్రి చాకచక్యము వలన నవి యింతవఱకును నుపద్రవకరములుగాఁ బరిణమింపలేదు.

ఈమధ్య వీరశేఖరచోళుఁడు చంద్రశేఖరపాండ్యుని దరిమివేసి, మథురారాజ్య మాక్రమించుకొనుట కొక ప్రధాన కారణ మున్నది. చంద్రశేఖరపాండ్యునితండ్రి రాజ్యము చేయుచున్నంతవఱకును బాండ్యరాజ్యప్రజ లాతనియెడలఁ గడుంగడు విముఖులై యుండిరి. దీనికిఁ గారణ మాతని యసామర్థ్యము; ఇంతియకాదు; ఆతఁడు నిత్యమును వారాంగనా

లోలుఁడై యుండెను. అంతటితో నాగక యప్పు డప్పుడాతఁడు సామాన్యసంసారుల సంసారములు కూడఁ బడగొట్టుచుండెను. దానితో రాజధానీనగరమగు మధురలో నాతనియెడల విముఖత్వము మరింత యెక్కుడై పోయెను. మధురలోనున్న కొందఱు బ్రాహ్మణులుపోయి యాతని దురాచారములన్నియు దిమ్మరుసుమంత్రితోడను, రాయలతోడను మొఱపెట్టుకొనవలయు ననికూడ తలచిరి. ఆతని క్రిందియధికారులుగూడ రాజ్య వ్యవహారములు తిన్నగాఁ జూడక, లంచగొండులై ప్రజలను బీడించుచుండిరి. సమీపారణ్యములనుండి బందిపోటుదొంగలు వచ్చి, పట్టపగలే మధురాపరిసరముననున్న పల్లెటూళ్ళన్నియు దోఁచుకొనఁ దొడఁగిరి. ఈయన్యాయము లెక్కువైనకొలఁదిని చోళరాజునకుఁ బాండ్యరాజ్యముపై మక్కువ యెక్కువ కాఁజొచ్చెను. మంత్రు లీవిషమపరిస్థితు లన్నియుఁ గనిపెట్టి రాజుతోఁ గుమారుఁడగు చంద్రశేఖరపాండ్యునికి రాజ్య మిచ్చి పట్టాభిషేకము చేసినచో నీయనర్థము లన్నియుఁ జాలవఱకుఁ దొలఁగిఁ పోఁగలవని చెప్పిరి. మొట్టమొదట నాతఁడు రాజ్యము కుమారుని కిచ్చుట కిష్టపడలేదు. కాని మొదటికే మోసము వచ్చునని మంత్రులు భయపెట్టుటచే నెట్టెట్లో విధిలేక కుమారునికిఁ బట్టము గట్టి, రాజ్యపాలనమున రహస్యముగ జోక్యము కలిగించుకొనుచుండెను; కాని యచిరకాలముననే యాతఁడు వ్యాధిగ్రస్తుఁడై మరణించెను.

చంద్రశేఖరపాండ్యుఁడు రాజ్యమునకు వచ్చిన నాలుగైదు సంవత్సరముల వఱకును, మరలఁ బాండ్యరాజ్యము ప్రశాంతస్థితిలోనికి వచ్చినట్లే కనఁబడెను. కాని, యాతఁడు పూర్వపురాజున కౌరసుఁడు కాఁడనియు దండ్రి కెంతకాలమునకును సంతానము కలుఁగనప్పు డాతఁడు రాజ్య మన్యాక్రాంతమయిపోవునేమోయను భయముచేఁ దన యుంపుడుకత్తె కప్పుడు పుట్టిన శిశువును దెచ్చి, భార్య కిచ్చెననియు, ఆమె యంతకుఁ బూర్వము తొమ్మిది నెలలనుండియుఁ దాను గర్భిణినని నటించినదనియు, బ్రవాదములు బయలుదేరెను. "వీనిలో సత్యాసత్యములమాట యెటులున్నను నివియన్నియుఁ బాండ్యరాజ్యమున దావాగ్నులవలె నలముకొనియెను. మంత్రులకుఁగూడఁ జాల మందికి—రా జౌరసుఁడు కాఁడేమోయను ననుమానము దృఢమయ్యెను. ఈయదను కనిపెట్టి చోళాధిపతియగు వీరశేఖరచోళుఁడుఁ బాండ్యరాజ్యమున నింకను నంతఃకలహములు లేవఁదీసెను. కొందఱు 'చంద్రశేఖరపాండ్యుఁ డౌరసుఁడు కాఁడు కనుక నాతని పినతండ్రి కుమారునికి బాండ్యరాజ్యము సంక్రమింపవలసియున్న' దనిరి. మఱికొంద ఱతఁ డౌరసుఁడే యనిరి. అస లేదైన నదను దొరకినచోఁ బన్ను లెగఁబెట్టవలయునని చూచుచున్న కొందఱు పాళెయగాండ్రు పాండ్యునికిఁ బన్నులిచ్చుట మానివేసిరి. పాండ్యుఁడు వారిని శిక్షింపవలయునని తలఁచినప్పు డింకను గొందఱు వారిపక్షములలోఁ జేరుచుఁ గోరంతలు కొండంతలు చేయుచుండిరి. ఈవిధముగఁ బన్నులు

రాకపోవుటచేఁ బాండ్యుఁడు విజయనగరము తోషేఖానా (ధనాగారమున) కుఁ గట్టవలసిన కప్పములు తగినసమయము నకుఁ గట్టలేకపోవుచుండెను. కావున రాజధానియగు విద్యా నగరమునుండి మాటిమాటికిని గబురులు వచ్చుచుండెను. పాపము! పాండ్యుఁడు తుద కమూల్యములగు తనముత్యాల హారము లమ్మి కప్పములు కట్టవలసివచ్చుచుండెను. ఈవిధముగఁ బ్రధానమంత్రి కాతనిపై ననుగ్రహము తప్పిపోసాగెను.

అదియుఁగాక చంద్రశేఖరపాండ్యునికిఁగూడఁ దండ్రి దురభ్యాసము లన్నియు నలవాటయ్యెను. జనకునకుఁ జంద్ర శేఖరపాండ్యుఁడు లేక లేక కలిగెను. ఆకారణముచేఁ దండ్రి యాతని నెక్కువగ గారాబముచేసి పాడుచేసెను. పాండ్యుఁడు బదునెనిమిదివత్సరములు వచ్చునంతవఱకును, దండ్రి యాతనిఁ దనతోఁ గొనిపోవుచుండెను. చిన్నప్పటినుండియుఁ దాను మద్యము త్రాగునప్పుడు తనకుమారునికిఁగూడ నొకచిన్న పాత్రలోఁ గొంచెము మద్యము పోసి యిచ్చుచుండువాఁడు. వాఁ డది త్రాగి, మైకముఁజెంది, నవ్వుచుఁ దేలుచు గంతులు వైచుచుండువాఁడు. రాజోద్యోగు లెవ్వరైన [illegible] నప్పుడు యువరాజు చులుకఁదన మధికమ [illegible] చుండువారు! ఈవిధముగ మద్యమును, దానికి సహకారులగు నితరదుర్గుణములునుగూడఁ జంద్రశేఖరుని కలవాటైపోయెను. ఈవిషయములలో నాతనికిఁ దండ్రికి వచ్చినంత యాకీర్తి రాలేదుకాని మొత్తముమీఁదఁ దండ్రికిఁ దగినకుమారుఁ [illegible] యనిపించుకొన్నాఁడు!

ఈ దురభ్యాసములవలనఁ గొంద ఱాతని నతిసులభముగ లోఁబరుచుకొనఁ గలిగెడువారు. అట్లు లోఁబఱచుకొని యాతనితో మైత్రిచేయువా రందఱును గేవలమును స్వార్థపరులై పాండ్యుని కపఖ్యాతి తెచ్చుచుండిరి. మఱికొందఱు వీరశేఖర చోళుని కాతనిరాజ్యములోని యానుపాను లన్నియుఁ జెప్పుచుండిరి. ఈవిధముగఁ బాండ్యుని కెటు చూచినను శత్రువులే కాని హితైషు లెవ్వరును లేకుండిరి. ఇటులుండ గోరుచుట్టుపై రోఁకటిపో టన్నటులు పాండ్యునికిని జోళునికిని రాజ్యపు సరిహద్దువిషయమున నొకతగాదా వచ్చెను. చోళుఁడు పాండ్యుని పరిస్థితు లన్నియు బాగుగ నెఱిఁగినవాఁడు గావున, నన్యాయముగ నాతనిరాజ్య మాక్రమించుకొనఁ దలఁచెను. పాండ్యుఁడాతని కొకయంగుళము భూమియైన నెక్కువ యీయనననెను. చోళుఁ డట్లే యైనచోఁ దక్షణము దండెత్తి వచ్చుచున్నామని సందేశము పంపించెను. పాండ్యుఁ డేమియుఁ జేయలేక మంత్రులను సలహా యడిగెను. వారు మాఱుమాటాడక చోళుఁ డడిగినదంతయు నిచ్చివేయుమని సలహా చెప్పిరి. చోళుఁడిపు డెత్తివచ్చినచోఁ బాండ్యునికి మొదటికే మోసముకలుగునని వారికి బాగుగఁ దెలియును! పాపము! పాండ్యుని కిపు డేమి చేయుటకును బాలుపోలేదు. మొదట నాతఁడు మంత్రులతో నాలోచింపకుండఁ దొందరపడి యొకయంగుళము నేలయైన వీరశేఖరచోళుని కీయనన్నాఁడు. మఱియిప్పుడు మంత్రులు దానికిఁ గేవలమును వ్యతిరేకముగ సలహా చెప్పిరి. ఆతఁ డిపు డేమి చేయవలయును.

మొదటఁ జంద్రశేఖరపాండ్యుఁడు మంత్రులయుపదేశము వినక యుద్ధముచేసి ప్రాణములు విడుచుట మేలనుకొన్నాఁడు. కాని సేనానులుగాని, మంత్రులుగాని యుద్ధమను మాట తలపెట్టనీయరైరి. వీరశేఖరచోళునిజూచినచో విలుచుకొని మీఁదఁబడునట్లున్నాఁడు. తుద కాతఁకి ఖడ్గము నేలపైఁ బాతి, దానిపైఁబడి ప్రాణములు విడువవలయునను బుద్ధి పుట్టినది. ఏమిఁ జేయుటకుఁ దోఁపక యయిదారురోజులవఱకును సందేహదోళాందోళితమానసుఁడై కంగారు పడినాఁడు. ఇంతలో వీరశేఖరచోళుఁడు ప్రబలసైన్యముతో దండెత్తివచ్చుటకుఁ దగుప్రయత్నము లన్నియు నొనర్చుచున్నాఁడని తెలిసినది. మంత్రులును, ప్రధానపౌరులును, జోళునికి సంధిరాయబారము పంపవలసినదని యొత్తిడిచేయసాగిరి. చివరి కాతఁడు చేయునది యేమియు లేక చోళునియిష్టప్రకారము సంధి చేసికొనుట కంగీకరించుచు నమూల్యములగు కానుక లిచ్చి యొకరాయబారిని బంపించెను.

దానితో మధురపౌరు లందఱును మిక్కిలి సంతసించిరి. చోళుడు సంధిరాయబారమునకుఁ బూర్తిగ నంగీకరించుటవలన నిఁక నేవిధమగు యుద్ధభయమును లేకుండ సుఖింపవచ్చునని తలఁచిరి. చంద్రశేఖరపాండ్యునికిఁగూడ హృదయమునుండి కొండంతభారము దించినట్లయ్యెను. ఆతఁడు సుఖముగఁ దన సౌధోపరిభాగమునుండి పౌరులయుత్సవములు చూచుచు వారకాంతానృత్యములతో మైమఱచి యానందించుచుండెను.

ఇంతలో ద్వారపాలిక వచ్చి చోళసేనాపతి వచ్చిన విషయ మెఱింగించెను. పాండ్యుఁడావార్తవిని మొదట విసుకుకొనెను. కాని యచ్చటినుండి లేచి, ప్రక్కనున్న యొకమందిరములోనికిఁ బోయెను. వచ్చిన చోళసేనాపతినోట మాటరాలేదు. అతఁడు మాట్లాడఁబోయెనుగాని కొంతసేపటివఱకును మాట్లాడలేక పోయెను. పాండ్యుఁడాతనిని స్వస్థపరచి లోలోపలినుండి పొంగి పొరలి వచ్చుచున్న యాందోళనములో "రాయబార మేమైనది?" అని యడిగెను.

"వీరశేఖరచోళుఁడు సంధిరాయబారమున కంగీకరించి నాఁడు—"

"అయినచో నింతభయ మెందులకు?"

"కాని నేను తంజాపురము విడిచిన మఱునాఁడే యొక్క పెద్దసైన్యముతో మధురపైకి దండెత్తి వచ్చుచున్నాఁడని విన్నాను!"

"నిశ్చయమే?"

"ఆ! నిస్సంశయముగ నిశ్చయమే! దీనిలో నిసుమంతైన ననుమానములేదు! సైన్యములు సాయంకాలములోపుగ మధుర ముట్టడించుట నిశ్చయము!"

"ఎంత ముష్కరత్వము!"

చంద్రశేఖరపాండ్యునిచేతిలోనున్న మద్యపాత్ర తటాలున నేలఁగూలెను. ఈసంగతి నిమిషములో మధురయంతయుఁ బ్రాకిపోయెను. పట్టణమంతయు నాలుగువైపులనుండియు

దహించుకొని పోవుచున్నట్లు కానఁబడెను. ముఖ్యముగా రాజ కుటుంబములో నెవరికిని ముఖముపై నెత్తురుచుక్క లేదు. క్రమముగాఁ బట్టణమున మూర్తిమంతమగు భయమువలె మహాంధకారము వ్యాపింపసాగెను. పాండ్యుఁ డతిత్వరితముగఁ బురరక్షణకు వలయు నేర్పాటులన్నియుఁ జేయించెను. సాయంకాలము కాకుండగనే శత్రువుపట్టణము ముట్టడించెను. కాని యంధకారము వ్యాపించుటచే యుద్ధము క్రమక్రమముగ నాపివేయఁబడెను.

రాత్రి చంద్రశేఖరపాండ్యుని కొక కునుకైనఁ బట్ట లేదు. వీరశేఖరచోళుఁ డెంతపని చేసినాఁడు! ఒకవంక సంధి రాయబారమున కంగీకరించుచు నింకొకవైపున మధురపైకి దండెత్తివచ్చునా? వీరశేఖరచోళుఁ డింత ద్రోహియని తెలిసి యుండినచోఁ దాను శ్రీకృష్ణదేవరాయలసహాయముతో నాత్మ రక్షణము చేసికొనెడివాఁడే! ఇప్పు డేమి చేసిన నేమిలాభము? కోటలో నొకవారము రోజులకు సరిపోయిన యాహారసంపత్తి గాని, యాయుధసంపత్తిగాని లేదే! అతఁ డనుక్షణమును గోట బురుజులవైపు చూచుచు వానివెనుక నున్న యాభయంకర శత్రుసైన్యముల యావేశము భావించుచుండెను. అతని శరీర మంతయు ముచ్చెమటలతోఁ దడసిపోయెను. అప్పటికర్ధరాత్రి దాటినది. పరిసరమం దంతటను గీచురాళ్ళు గంభీరముగ 'గీ' పెట్టుచుండెను. అతఁడు సౌధోపరిభాగమున నొంటరిగ సంచరించుచుండెను. అతనికి దగ్గఱగనున్న యొకగదిలో నొకటిరెండు

దంతపుసింహాసనములును, నేలపై నొకరత్నకంబళమును గానవచ్చుచుండెను. గదిమధ్య నాగాకారముగనున్న యొక స్తంభముపై నొకవిశాలమగు పళ్ళెరము గానవచ్చుచుండెను. ఆ గదిలో ఘూలగ సన్ననిదీపము వెలుఁగుచుండెను. ఆతనిదృష్టి యాలోచనాశూన్యముగ నటునిటుఁ దిరుగుచు నెదురుగనున్న గదిగోడపైఁబడెను. ఆగదిగోడపైఁ బురుగులకై పొంచియున్న యొకబల్లి తటాలున నొకపురుగును నోటఁగరచుకొని, యొకటి రెండు సారులు చప్పరించెను.

పాండ్యుఁ డాదృశ్యము చూచుచు నట్లే నిలువఁబడియుండెను. ఇంతలో దళవాయి చీఁకటిలో నిలువఁబడి యాతనికి నమస్కరించెను. చంద్రశేఖరపాండ్యుఁ డాతనిపై నొకక్షణము శూన్యదృష్టితోఁ జూచి, మరలఁ జటుక్కున నిదురనుండి లేచినవానివలెఁ గంగారుపడుచు, రుద్ధకంఠముతో నిట్లనియె

"ఏమైనది!"

"అగుట కేమున్నది! కేవలమును మీయాజ్ఞలకొఱకై వేచియున్నాము."

"స్వామి వే మందువు?"

'అనుట కే మున్నది! కేవలమును నిష్ఫలముగ జననాశన మొందులకని—'

ఛీ! నేను వానితో నేవిధములగు సంధిరాయబారములకును సంగీకరింపఁజాలను. "యశో వామృత్యుర్వా"—అంతే!"—

"కాని యంతఃపురమునఁ బసిపాపలును బిల్లలును—"

"అంతఃపురమంతయు నీరాత్రి జ్వాలాప్రవేశ మొనర్చుటకు సిద్ధముగ నున్నారు. రేపటితో వీరశేఖరచోళుఁడు నా యంతమో లేక నేను వాని యంతమో చూడవలయును. అంతే!"

"చిత్తము! మఱి నేను దేవరవారికడ సెలవు తీసికొందును."

"జయాపజయములు దైవాధీనములు! నాకింకను మన జయము విషయమున నాశ పోలేదు."

"చిత్తము!"

దళవాయి వెడలిపోయెను. ఆపిమ్మట నొకటి రెండుగడియలతరువాతఁ బౌరద్యునికిఁ గొంచెము కునుకుపట్టెను. పట్టణమంతయు బ్రకృతితోఁ బాటొకటి రెండు గడియలు గాఢముగ నిదురపోవుచున్నటులు కానుపించెను. తరువాత దూరమున బురుజులకు రెండువైపులందును గజబృంహితములును నశ్వహేషారవములును గ్రమక్రమముగ నధికమగుచుఁ బౌరుల మనస్సులు కలఁచివేయసాగెను. ఆపిమ్మట శతఘ్నీగర్జనలతోఁ బట్టణమంతయు మాఱుమ్రోఁగసాగెను. పాండ్యచోళబలములు రెండును నొండొంటితో డీకొనెను. క్రమముగఁ దెల్లవారుసరికి సంకులసమరము ప్రారంభమయ్యెను. మొదటఁ జోళునిసైన్యములు బాగుగ ముందునకుఁ జొచ్చుకొనివచ్చి, కోటబురుజులపై కెగఁబ్రాక మొదలుపెట్టెను. అది చూచి

పాండ్యసేనాధిపతి పాండ్యపతాక మెగురవేయుచు గట్టిగ కేకలు వేయుచు సైన్యమును పురికొల్పసాగెను. కొంతసేపటికిఁ జోళసైన్యము దూరముగ వెనుకకుఁదగ్గి కోటబురుజుల సమీపమునకుఁగూడ రా వెరచుచుండెను. పాండ్యసైన్యము మహావీరావేశముతో "హరహర మహాదేవా!" యని యఱచుచుండెను.

ఇంతలోఁ బాండ్యసైన్యమునఁ బిడుగువంటి వార్త యొకటి వ్యాపించెను. మొదట నీవార్త దళవాయి చెవిని బడెను. సైన్యము వెనుకనుండి సైన్యమును బ్రోత్సహించుచు నత్యుత్సాహముతో విధికృత్యములు నిర్వర్తించుచున్న యా దళవాయి యీవార్త వినగనే నిర్ఘాంతపడిపోయి నిలువఁబడెను. వెంటనే యాతనికడనున్న సహాయసేనాధిపతి యా వార్త యేమని ప్రశ్నించెను. దళవాయి "ఏమున్నది! చంద్రశేఖరపాండ్యుఁడు సకుటుంబముగ మధుర విడిచి పారిపోయెనని తెలిసినది!" అనియెను. దానితో నచ్చటనున్నవా రందఱికిని జేతులు నడికివేసి నట్లయ్యెను. ఎవ్వరికినిగూడ నిఁక యుద్ధము చేయుట కిష్టము లేకపోయెను. క్రమక్రమముగ నిది సైన్యమంతయు వ్యాపించెను. కొంతమంది సైనికు లిది విని యెవరికిఁ దోఁచిన దిక్కులకు వారు పారిపోఁ దొడఁగిరి. పాండ్య సైన్యమంతయు నొక్కనిమిషములో విచ్ఛిన్నమై పోవునటులఁ గానుపించెను. పాండ్యదళవాయికిఁ గనుల నీరు గిఱ్ఱునఁ దిరిగెను. ఆతఁ డనవసరముగ జననాశ మెందులకని తలఁచి వీరశేఖర

చోళునికి "మధురకోట వశపరచుకొనవచ్చుననియుఁ దమ్ముఁ గరుణింపవలసినదనియు" రాయబార మంపెను.

వీరశేఖరచోళుఁ డింత సులభముగ మధుర స్వాధీన మగునని కలలోనైనఁ దలఁపలేదు. అందుచే నతఁడు మహోత్సాహముతో మధురలోఁ బ్రవేశించెను. సైనికులు రెండు మూఁడురోజులవరకును మధురదోచుకొని, తప్పత్రాగి బాటల ప్రక్కలఁబడి తందనాలు ద్రొక్కసాగిరి. వీరశేఖరచోళుఁడు మధురలోఁ బ్రవేశించినపిమ్మటఁ దత్క్షణమును బాండ్యుని బంధింపవలెనని తలఁచెను. ఆకారణమువలనఁ బాండ్యుని కుటుంబముకొఱకై మధురయుఁ దత్పరిసరప్రదేశములును గాలించి వెదకించెను. క్రమక్రమముగ నాతనికిఁ బాండ్యుఁడు సకుటుంబముగ విజయనగరము చేరినట్లు తెలిసినది. దీనితో నాతని విజయోత్సాహమంతయు నువ్వెత్తుగఁ బొంగినతరంగము వలె నేలమట్టమైపోయెను. ఏమైననుసరే యని, యాతఁడు చోళపాండ్యములు రెండును దనగుప్పిటఁ బెట్టుకొని రక్షించు కొనుచు నాత్మరక్షణకై తగిన కట్టుదిట్టములు చేసికొనసాగెను.

మొదట నాతఁడు పాండ్యుని సకుటుంబముగ సంహరించి రెండురాజ్యములును దానే యేలుచు విజయనగరాధీశుని గప్పములతోఁ దృప్తిపఱచుచుఁ గ్రమక్రమముగ సర్వస్వాతంత్ర్యమనుభవింపవలయునని తలఁచినాడు. కాని యాతఁ డొకటితలఁచుటయు, దైవము వేఱొకటి తలఁచుటయు జరిగినది! పాండ్యుఁడు తలపూవు వాడకుండ సకుటుంబముగ విద్యా

నగరమునకుఁ బాఱిపోయి యాతనిపై మరల దండెత్తి వచ్చుచున్నాఁడని తెలిసినది! వీరశేఖరచోళుఁ డంతటితో నిరుత్సాహపడి యూరకొనలేదు. మహామంత్రికిఁ గొన్నియమూల్యములగు కానుకలు పంపించి విజయనగరసామ్రాట్టును దన్నుసామంతప్రభువుగ నొనర్పవలసినదని ప్రార్థించెను. కాని తిమ్మరుసుమంత్రి యూరాయబారి నవమానించి, కానుకలు గైకొనకుండఁ ద్రిప్పి పంపివేసెను! అంతటితో నూరకొనక, సార్వభౌముని కరుణాప్రసాదము కావలసివచ్చినచోఁ, బాండ్యుని రాజ్యము పాండ్యుని కప్పగించి మరిమాట్లాడవలయునని కబురంపించెను.

చోళుఁ డింక నేమి చేసిన నేమి, మూఁడునాళ్ల యనుభయముతోఁ బాండ్యచోళరాజ్యములు రెండును గట్టునిట్టముగఁ బరిపాలించుచు, స్వరక్షణార్థమై వలయు ప్రయత్నములన్నియు నొనరించుకొనుచుండెను. పాండ్యరాజ్యము జయించినప్పటినుండియుఁ బాప మాతనికి నిద్దురయే లేదు. ఇంకను బాండ్యరాజ్యము జయించి, యొకమాసమైనదో లేదో! అప్పుడే కృష్ణదేవరాయలు మధురపైకి బ్రహ్మాండమగు సైన్యము పంపించుచున్నటులు లోకప్రవాదము బయలుదేఱెను. వీరశేఖరచోళుఁ డీప్రవాదము విన్నప్పటినుండియుఁ విజయనగరమునకుఁ జారులను బంపి యచ్చటి వృత్తాంతములు తెలిసికొనఁ బ్రయత్నింపసాగెను. కాని యెంత ప్రయత్నించినను గేవలప్రవాదములే కాని సత్యవృత్తాంతము లేమియుఁ

తెలిసికొనుటకు వీలు లేకుండెను. అయినను, వీరశేఖరచోళుఁ డప్రమత్తుఁడై ప్రవర్తించుచు, వేయికన్నులతోఁ దనరక్షణ ప్రయత్నము లన్నియు నొనరించుకొనుచుండెను. ఈలోపుగ మరల విజయనగర చక్రవర్తితో నేమైన సంధి రాయబారములు సాగించుట కనువు పడునేమోయని ప్రయత్నించుచుండెను. కానియాతని ప్రయత్నములేమియు సఫలములు కాకుండెను. అంతియే కాదు; తుదకు విద్యానగరచక్రవర్తి యీవిషయమున నేమి చేయుటకు నిశ్చయించెనోగూడఁ దెలిసికొన వీలు లేకుండెను. ఈవిధముగఁ గొంతకాలము గడచినపిదప వీరశేఖర చోళుని కొకనాఁడు ముప్పదివేల విద్యానగరసైన్యము తనపైకి వచ్చుచున్నదని తెలిసెను. ఆవార్త వినగానే వీరశేఖరచోళుని గుండెలలో నెత్తురు గడ్డకట్టుకొని పోవుచున్నట్లయ్యెను. అతఁడిన్నాళ్ళనుండియుఁ బ్రోగుచేసిన సైన్య మిరువదివేలకంటె నెక్కువ యుండదు. ఎక్కడ? సామ్రాజ్యసైన్యము! ఎక్కడ పాండ్యసైన్యము! అయినను మధురకోటలో నిలువఁబడి యాత్మరక్షణ మొనరించుటకీమాత్రము సైన్యము చాలును. కావునఁ గోటలో నాతఁ డయిదారునెలలవఱకునుగూడ సరిపడు నాహారపదార్థము లన్నియు సమకూర్చెను. తనకున్న రత్నరాసులన్నియు వ్యయమొనరించి శతఘ్నులకుఁ గావలసిన తుపాకిమందును వివిధములగు నాయుధములును గొని నిలువ చేయించెను. తుద కాతనికి శత్రుసేన మధురాసమీపారణ్యమున విడిసిన విషయముకూడఁ దెలిసెను. అయినను జెక్కు-

చెదరక, కోటలో నిలఁబడి, సామ్రాజ్యసైన్య మెంతయున్నను దప్పక జయింపగలనను ధీమాతో నుండెను. ఆతనిధైర్యము చూచి, మంత్రులు కొందఱత్యాశ్చర్యనిమగ్నులైరి. తుద కొకనాటిప్రాతఃకాలమునఁ గోట లోహకవాటములు శత్రువుల శతఘ్నీగోళప్రయోగమున ఢామ్మని దద్దరిల్లెను. దానితో నిరు సైన్యములకును జరుగు మహాఘోరాహవనాటకమునకు నాందీ ప్రస్తావము సమాప్తమైపోయెను.

---

## ౮

క్రమక్రమముగ యుద్ధము భయంకరస్వరూపముఁ దాల్చుచుండెను. యుద్ధము ప్రారంభమై యప్పుడే మూఁడు రోజులు కావచ్చినది. ఈమూఁడురోజులును విద్యానగర సైన్యము క్రమముగ వెనుకకు నెట్టివేయఁబడెను. వీరశేఖరుఁడు స్వయముగ గోటబురుజుపైనుండి యుద్ధగతి యంతయుఁ బరిశీలించుచుండెను. ఆతఁడు తన దగ్గఱ నాయుధాగారములలో నున్న పెద్దఫిరంగు లన్నియుఁ దెప్పించి, కోటబురుజులపై కెక్కించి, నిరంతరముగ నగ్నిగోళవర్షము కురిపించు చుండెను. మొదట మూఁడురోజులును విజయనగరసైన్య మాధాటికాఁగ లేక వెనుకకుఁ దగ్గుచు, దూరదూరములనుండి కోటగోడలపై

నగ్నివర్షము కురిపింపసాగెను. చోళసైన్యములు తమకుఁ గలిగిన ప్రథమజయముచే నుప్పొంగుచు, శత్రుసైన్య మంతయుఁ జీకాకుపఱచుచుఁ జెల్లాచెదరు చేయుచుండెను. ఆసమయముఁలోఁ బెద్దపిడుగు పడినటు లొకశతఘ్నిగర్జనము వినఁబడెను. ఈమూఁడురోజులనుండియు నట్టిభయంకరనాద మెవరును వినియుండలేదు! అందుచేఁ జోళసైన్య మంతయు నిర్ఘాంతపడి యొకనిమిషమువరకును నాశతఘ్నిగర్జనమువైపు దృష్టి మరల్చెను. వెంటనే యాశతఘ్నినుండి బయలువెడలిన యగ్నిగోళము ధామ్మని మధురకోటగోడకుఁ దగిలెను. దానితో నాగోడయంతయు దద్దరిల్లి గజగజ వణఁకిన ట్లయ్యెను. ఆ దెబ్బ తగిలినప్రదేశమునకుఁ జాలదూరమువఱకును గోటగోడ బీటలు తీసెను.

ఆసమయముననే వీరశేఖరచోళుఁడు కోటబురుజులవెనుక నిశ్చలముగ నిలువఁబడి యుద్ధగతి యంతయుఁ బరిశీలించుచుండెను. ఈశతఘ్నిధ్వని వినఁబడగనే యాతనిశ్రోత్రములు గింగురుమని మాఱుమ్రోగెను. ఒక యరగడియవఱకును నాతని శ్రవణములకు శబ్దగ్రాహకశక్తి సంపూర్ణముగ నశించిపోయెను! నిర్ఘాంతపడి యాతఁడట్లే యాశబ్దము వచ్చినవైపు చూచుచుండెను. వీరశేఖరచోళుఁడు మిగుల బలిష్ఠుఁడు. బుగ్గలవఱకును బెరిగిన యాతనిమీసములు వడితిరిగి యుంగరములు చుట్టుకొనెను. ఆతఁడు తనచిఱుగడ్డము కొనగోళ్ళతో దువ్వుకొనుచుఁ గనుఱెప్ప వేయకుండ సైన్యములవైపు చూచుచుండెను.

గుండ్రముగను, విశాలముగను నున్నయాతని వినీలనేత్రములలోఁ బెద్దపులికనులలో నున్నంత భయంకరత్వము కానుపించుచుండెను. నేరేడుపండువలెనున్న యాతని శరీరముపై సూర్యకాంతులు ప్రసరించి మిలమిల లాడుచుండెను. రాత్రియంతయు నిద్దుర లేకపోవుటచే వానికన్ను లెఱ్ఱగ నుండెను.

ఇంతలో దళవాయి యరుణగిరి రోజుకొనుచు నాతని దగ్గఱకు వచ్చి నిలువఁబడెను. వీరశేఖరుఁ డాతనిని జూచి కనుబొమలు ముడిచి, యాతని నాపాదమస్తకమును బరీక్షించి యిట్లనియెను.

"ఏమి? సైన్యమునువిడిచి యిచ్చటి కెందుకువచ్చితివి?"

"ఏమున్నది! అనుకొనినంత పనియు నయిపోయినది!"

"వీరశేఖరుఁడు "ఏమది?" యనునభిప్రాయము సూచించు కనులతో నాతని బ్రశ్నించెను. అది విని యరుణగిరి "ఇప్పుడు మీరు విన్న యీభయంకరగర్జన మేదో యెఱుఁగుదురా?" అనియెను.

"తెలియలేదు."

"ఇది యొకభయంకరమగు శతఘ్ని. దీనిని మనవారందఱును శరభసాళ్వ మందురు. దీనిని రాయలు రహస్యముగ బుడతకీచులచేఁ దయారు చేయించెనని తెలిసినది. విజయనగరపు వేగులవారివలన నాకీవిషయములన్నియుఁ దెలిసినవి. దీనిధాటి కెటువంటికోటగోడ యైనను బటాపంచలై పోవలసినదే! మనదురదృష్టమువలన శత్రువులు దీనిని మొట్టమొదట

మనమీదనే ప్రయోగించినారు. ఇంక మన మీకోట సంరక్షించుట దుర్ఘటము.''

ఈమాటలు వినఁగనే వీరశేఖరునిముఖము జేవురించెను. అతనిఘోరణి చూచి యరుణగిరి కొంచెము తెల్లఁబోయెను. వీరశేఖరుఁ డరుణగిరివైపు తీక్ష్ణముగఁ జూచి "నీ వింత పిరికిపంద వనుకొనలేదు" అనెను. అరుణగిరి దక్షిణహస్త మప్రయత్నముగ మొలలో వ్రేలాడు కటారిపిడిపైఁ బడెను. కాని యాతఁ డాత్మనిగ్రహ మవలంబించి దండ కట్టుకొని సగర్వముగ నిలువఁబడి, అధరాంతరమున నడగిపోయిన చిఱునవ్వుతో "నావిషయ మింతేనా మీరు గ్రహించినది!" అనెను. ఇంతలో మఱియొకసారి ఫిరంగి ప్రేలెను. దానితోఁ గోటయంతయుఁ బునాదులవరకును దద్దరిల్లెను. వారు చూచుచుండగ నాశతఘ్నిగోళము తగిలిన ప్రదేశమునఁ గోటగోడ యయి దాఱుబారలవఱకును సంపూర్ణముగ నేలపైఁ గూలిపోయెను!

దానితోఁబాటు వీరశేఖరుని మనమున దృఢముగ నిలువఁబడిన నాత్మవిశ్వాసకుడ్యముగూడ నొక్కనిమిషములో నేలఁ గూలెను. ఆతఁ డాశతఘ్నిగోళము వచ్చినదిక్కు మొగంబై, జాగ్రత్తగ నాప్రదేశము పరిశీలించెను. కనుచూపుమేరలో నున్నయొక చిన్నిగుట్టపై బ్రహ్మాండమగు నొక ఫిరంగి కానఁబడెను. ఆఫిరంగివెనుక రాళ్ళగుట్టపై నిలువఁబడిన కొందరు మనుష్యు లాఫిరంగిలో మందు కూరుచున్నారు. జాగ్రత్తగఁ బరిశీలించినపిమ్మట నాతని కాఫిరంగిప్రక్క మఱి

యొక శతఘ్నియు, దానివెనుక మఱికొందఱు మనుష్యులును గూడఁ గానఁబడిరి. ఇంతలోఁ జెవులు గింగురుమను గంభీర నిర్ఘోషముతో మఱియొక శతఘ్నిగోళము కోటతలుపునకుఁ దగిలెను. దానితోఁ గోటతలుపు బ్రద్దలై విడిపోలేదుగాని, యా లోహకవాట మాగోళపుఁదాకిడికి మొఱపెట్టినట్లు గట్టిగ ధ్వనించెను.

కోటగోడ కొంత పడిపోవుట చూచి శత్రుసైనికు లుప్పొంగుచున్న తరంగములవలె నురకలు వైచికొనుచు ముందునకు వచ్చుచుండిరి. అది చూచి, వీరశేఖరుఁ డరుణగిరి హస్తము పట్టుకొని సానునయముగ "నరుణగిరీ! నేను తొందరపడి నిన్ను దూలనాడితిని! నన్ను మన్నింపుము" అనియెను. ఆమాటలు వినుసరి కరుణగిరికిఁ గంఠము గద్గద మయ్యెను. అతఁ డొక్క నిమిష మేమియు మాట్లాడలేదు. తరువాత గొంతు సవరించుకొని "ఇందు మన్నించుట కేమున్నది! కాని యువ్వెత్తుగఁ బొంగివచ్చుచున్న యీ రాయలసైన్యము చూడుఁడు! మన మిఁక నొకనిమిషమైన నాలస్యము చేయుటకు వీలులేదు!" అనియెను. వీరశేఖరుఁ డొకసారి యాశత్రుసైన్యము చూచెను. ఇఁక నొకక్షణకాల మాలస్యము చేసినను గూడ లాభము లేదు! రక్తోత్పలములవలె నెఱ్ఱవారిన యాతని కన్నులనుండి రెండుకన్నీటిబిందువులు రాలి కపోలములపై దిగజాఱెను. వెంటనే యాతఁ డాకన్నీరు తుడుచుకొనెను. క్షణములో మరల నాతనికనులలో నపూర్వగాంభీర్యము ప్రత్యక్ష

మయ్యెను. ఆతఁడు క్షణకాలము మరల శత్రుసైన్యము చూచి మెల్లగ నరుణగిరివైపు మొగము త్రిప్పి యిట్లనెను.

"తత్క్షణమే పోయి యంతఃపురమున కగ్నిప్రవేశప్రయత్నములు చేయుము. తిరిగి వచ్చునప్పుడు నాయింద్రనీలమును గూడఁ దోడ్కొని రమ్ము. మన మిద్దఱము గలిసియే యుద్ధమునకుఁ బోవుదము."

"సంధికై ప్రయత్నింపఁ గూడదా?"

వీరశేఖరుఁడు మరల నొకసారి శత్రుసైన్యమువైపు చూచి, "కొంచెమించుమించుగ సమానులతో సంధి పొసఁగునుగాని, యీపరిస్థితులలో వారు మనతో సంధికి వత్తురా? అవియన్నియు నింతకుఁబూర్వమే పాసిగిపోయినవి! ఇఁక వాని ప్రస్తావనవలన నేమియు లాభము లేదు. నీవుతత్క్షణమే పోయి రావలయును" అనియెను. అరుణగిరి "మన మీక్షణమునఁ దంజాపురమునకుఁ బోయి యచ్చటినుండి యుద్ధమో, సంధియో యేదోయొకటి—అని యేదో చెప్పఁబోయెను. వీరశేఖరుఁడు తీవ్రముగ నాతనివైపు చూచి "ఇఁక నట్టియుపాయములవలన లాభము లేదు! మృత్యువుకోఱలలోఁ జిక్కినపిమ్మట నింక బాఱిపోవుట యెక్కడికి? ఒకసారి మనసు నిబ్బరము చేసికొనుము. ఇఁక మాఱుమాటాడకుము" అనియెను. అరుణగిరి యిఁక మాఱుమాటాడక యక్కడనుండి బయలుదేఱి, తొందఱగ రాజభవనమువైపు వెడలిపోయెను.

అరుణగిరి వెడలగనే వీరశేఖరుఁ డొకసారి యుద్ధరంగమున కేగి సైనికుల నందఱిని బ్రోత్సహించి వచ్చెను. శత్రుసైనికులు కోటగోడ పడిపోయినవిషయము గమనించి, పెద్దపెద్ద కేకలు వైచికొనుచు, నావైపునకు వచ్చుచుండిరి. మధురాసైనికులు ప్రాణములకుఁ దెగించి, పోరాడుచు శత్రువులొకయడుగైన ముందునకు రాకుండఁ జూచుచుండిరి. వీరశేఖరుఁడు బాగుగ గుఱిచూచి ముందుముందునకుఁ జొచ్చుకొని వచ్చుచున్న సైనికులపై నగ్నిగోళవర్షము కురిపించెను. ఆశతఘ్నీగోళములవర్షమున కాసైనికులు దూది యేకునపుడు తుత్తునియలై యెగిరిపోవు తూలరాశివలె వెనుకకుఁ బడిపోవుచుండిరి. ఇంతలో మరల హృదయవిదారకమగు శరభసాళ్వధ్వని వినఁబడెను. ఒకశతఘ్నీగోళ మింతకుఁబూర్వము పడిపోగా మిగిలిన కుడ్యభాగముపైఁ బడియెను. అది తగిలినతరువాత నావంకనున్న కోటగోడ మరికొంత పడిపోయి యొక పెద్దదారి యేర్పడెను. ఈపరిస్థితులలో నాతఁ డొకసారి సైన్యములోఁ బ్రవేశించి సైనికులఁ బ్రోత్సహించెను. కాని యాతని కీసైనికులఁ బ్రోత్సహించు కార్యము మిగులఁ గష్ట మనిపించెను. ఇఁకఁ దానుగూడ వచ్చి వారిసరసను స్వారిచేయుచుఁ బోరాడవలయునని నిశ్చయించి మరలఁ గోటబురుజుపై కెక్కి యరుణగిరివచ్చు మార్గము చూచుచు నిలువఁబడెను.

అరుణగిరి యాతనికి వరుస కన్నగా రగును. ఇద్దఱును బాల్యమిత్రులు. కావుననే వీరశేఖరుఁ డాతనికి దళవాయిపద

మిచ్చెను. ఒక్కసారిగా నాతనికి బాల్య మాదిగా నడచిన వృత్తాంతము లన్నియుఁ గన్నులకుఁ గట్టినట్లయ్యెను. ముందు రాఁబోవు యుద్ధమునుం డాతనికి గతజీవిత మంతయు స్వప్న ప్రాయముగఁ గానుపింపఁ దొడఁగెను. ఆపిమ్మట నాతనిదృష్టి రాజభవనముపైఁ బడెను. ఆయుత్తరక్షణమున నాతనిహృదయమున నొకవజ్రాఘాతము జరిగెను. తనయంతఃపుర మంతయు నొక్కనిమిషములో నిఁక భస్మమై పోవనున్నది! ఎవరో వృద్ధులును, బాలబాలికలును దక్క నందఱును నొక్కనిమిషములో మరణింప నున్నారు! అతఁడు వారిదుఃఖము లన్నియుఁ దలఁచుకొని యా వేదన భరింపలేక కుడిచేతితో నొకసారి హృదయమదిమి పట్టుకొనెను! ఆతనిది సామాన్యముగ మాటిమాటికిని గన్నుల నీరునించు స్వభావము కాదు. కాని యా యంతఃపురమున నగ్నిప్రవేశ మొనరింప నున్నవారివేదనలు తలఁచుకొనఁగానే యాతని కనుగొలకులనుండి వేడి కన్నీరు ప్రవహింపఁ జొచ్చెను. ఆతని మనస్సేవేవో స్మృతులలోఁబడి నిదురించినట్లయ్యెను. ఇంతలో రాజభవనమువైపునుండి యొక పెద్ద ప్రేలుడుశబ్దము వినఁబడెను. తటాలున మేలుకొనినవానివలె నాతఁడావైపునకుఁ జూచెను. ముందుగ బ్రహ్మాండమగు ధూమరేఖ యాకసమువైపున కెగసినది! ఆపిమ్మట నొకపెద్ద యగ్నిజ్వాల కనఁబడినది! రాజభవనద్వారముదగ్గరనుండి యరుణగిరి యొక యశ్వముపై నెక్కి తొందరతొందరగ నాతనికేసి వచ్చుచున్నాఁడు! ఆతనివెనుక నింద్రనీలమను నాతనియశ్వమెక్కి యింకొక రౌతు వచ్చుచున్నాఁడు.

ఆతఁడు తొందరతొందరగ బురుజుదిగి యరుణగిరి కెదురుగఁ బోయెను. ఇద్దఱిముఖములనుండియు నొక్కమాటయైన వెలువడలేదు. కాని వీరశేఖరచోళుఁడు నిమిషమాత్ర మాతని ముఖ మవలోకించి "యంతయు నయిపోయినదా?" అనెను. అరుణగిరి వంచిన తల యెత్తకుండగనే "యంతయు నయిపోయినది!" అనియెను. వీరశేఖరుఁ డొకటి రెండు నిమిషము లట్లే నిలువఁబడెను. ఆతనికను లొక్కసారిగ నాఁకొన్న బెబ్బులికనుల వలె మాఱిపోయెను. వీరశేఖరుఁడు తనయింద్రనీలముదగ్గఱకు వచ్చి దానివీపుపై మెల్లగఁ దట్టి "ఇంద్రా! ఇదే! నా తుది యుద్ధము! దీనితో నీకష్టములును, నాకష్టములును గట్టెక్కునులే!" అనెను. దాని కేమర్థ మయినదో, యది యేమి చెప్పదలఁచినదోగాని, యది మెల్లనఁ దోఁక యాడించుచు సకిలించెను. వీరశేఖరచోళుఁడు గుఱ్ఱమెక్కుటకు ముందు "అరుణగిరి! బహుశః ఇది మనతుదికలయిక" అనియెను. ఇరువురి కంఠములును నొక్కసారి గద్గదము లయ్యెను. అరుణగిరి యేమియు మాటాడలేక యొక నిమేషమువఱకును నీరవ దృష్టితో నాతనివైపు చూచెను. వీరశేఖరచోళుఁ డాతనిని గాఢముగఁ గౌగలించుకొని హృదయమునకు హత్తుకొనియెను. ఇంతలోఁ బ్రళయభీకరగర్జనముతో నింకొక శతఘ్నిగోళము దుర్గకవాటమునకుఁ దగిలెను. దానితో దుర్గద్వారము తుత్తునియలై పడిపోయినధ్వని యయ్యెను. వారిరువురును దటాలున గుఱ్ఱములెక్కి యొకసారి పరస్పరముఖములవైపు చూచుకొని విద్యుద్వేగముతో రణరంగమున కుఱికిరి!

ఆకాశమున శతఘ్నీముఖములనుండి బయలు వెడలిన ధూమము మెల్లమెల్లగ నెగురుచు మేఘశకలములవలెఁ గానుపించెను. విశ్రాంతముల గ్రద్దలును రాబందులును వలయాకారముగఁ దిరుగుచుండెను. అప్పు డప్పు డాకాశమున గ్రద్దల కూఁతలు వినిపించుచుండెను. శతఘ్నులు ప్రేలునపుడెల్ల నా చుట్టుపట్టులఁ జెట్లపైనున్న కాకులు 'కావుకావు' మని యఱచుచు నాలుగుదిక్కులకును బారిపోవుచుండెను. భూమిపైఁ బోరువారి యరపులును, మరణించుచున్నవారి మూలుగులును, గజాశ్వాదులధ్వనులును గలిసి దూరమునకొక భయంకరమగు సముద్రఘోషవలె వినవచ్చుచుండెను.

---

౮

కేవలమును సైన్యములతో బలాబలములు చూచుకొనుట యయినచో వీరశేఖరుఁడు యుద్ధమున జయించుట కొకింతయవకాశ ముండెడిది! కాని తలఁవని తలంపుగా నీశర భసాళ్వ మవతరించుటచే నాతనిప్రయత్నము లన్నియు, బూడిదలోఁ బోసిన పన్నీరయ్యెను. నాలుగైదు దినములలో వీరశేఖరుని బలము లన్నియు నశించిపోయెను. చివర కొకనాఁ డరుణగిరియు, వీరశేఖరుఁడునుగూడ యుద్ధములో మరణించిరి.

మిగిలినవారందఱును నాగమనాయకునికిఁ బాదాక్రాంతులయిరి. నాగమనాయకుఁడు మహావైభవముతో మధురలోఁ బ్రవేశించెను. అంతటితో నాతఁ డూరకొనలేదు వెంటనే తంజాపురముపైకిఁ బోయి యారాజ్యముకూడ స్వాధీనపఱచుకొనియెను. తంజాపురము వశపఱచుకొనుటలో నాతనికేమియుఁ గష్టము కలుగలేదు. అచ్చట నాతఁ డొక ప్రతినిధిని నియమించి మరల మధురకు మరలివచ్చెను. ఇప్పుడు తంజాపుర మధురారాజ్యములకోటలు రెండును సంపూర్ణముగ నాతనికి వశమైనవి. ప్రత్యక్షముగా నాగమనాయకు నెదిరింపఁగల శత్రువు లెవ్వరును లేరు.

కాని పాళియగాండ్రుమాత్ర మింకను నాగమనాయకునికి స్వాధీనము కాలేదు. ఇంకను మధురలోఁ గొందఱు కాకపోయినఁ గొందఱయిన నాతనిదర్శనము చేసి తమతమ స్వామిభక్తి ప్రకటించిరి. కాని తంజాపురపుఁ బాళియగాండ్రలో నొకఁడునుగూడ నాతనిదర్శనము చేయలేదు. మధుర తంజాపురముల పాళియగాండ్ర నందఱిని బూర్తిగ స్వాధీనపరచుకొనుటకింకను ధనబలమును, సైన్యబలమును గావలసియున్నవి. ఈ పరిస్థితులలోఁ జంద్రశేఖరపాండ్యునికి రాజ్య మప్పగించినచోఁ బాండ్యరాజ్య మల్లకల్లోల మగుటలో నేమియు సందేహము లేదు. ఆవిషయము నాగమనాయకునికి జంద్రశేఖరపాండ్యునికిని గూడఁ దెలియును. నాగమనాయకుఁడు తంజాపురపు కోట జయింపఁగనే యచ్చట నొకప్రతినిధి నేర్పాటుచేసెను.

మధురారాజ్యము రామభద్రనాయకునితోడ్పాటుతో స్వయము గఁ బరిపాలించుచుండెను.

నాగమనాయకుని చాకచక్యమువలన మధురారాజ్యముఁ బాళియగాండ్రు క్రమక్రమముగ స్వాధీన మగుచుండిరి. కొందఱిపై సైన్యములు పంపించినగాని స్వాధీనము కాకుండిరి. నాగమనాయకుఁడు మధుర వచ్చి, యప్పుడే యొక నెలరోజు లైనది. ఈనెలరోజులలోను మధురపాళియగాండ్రందఱును జాలవఱకు స్వాధీనులైరి. కాని తంజాపురములో నొక్కఁడును స్వాధీనుఁడుకాలేదు. నాగమనాయకునికిఁ దంజాపుర ప్రతినిధిపై విసుగు పుట్టినది. అందుచే నాతఁడు పదివేల సైన్యము చెవ్వప్పనాయకుని కిచ్చి తంజాపురము పంపించెను. చెవ్వప్ప నాయకుఁ డచ్చటి ప్రతినిధిని దనకు సహాయసైన్యాధిపతిగా నొనరించుకొని తంజాపుర రాజ్య మంతయు స్వాధీనపఱచు కొనెను. పదివేలసైన్యముతోఁ జెవ్వప్పనాయకుఁడు తంజాపురము చేరుకొనె నను వార్త వినఁగనే పాళియగాండ్రందఱికిని భయభక్తు లెక్కువయ్యెను. క్రమక్రమముగఁ దంజాపురప్రఁ బాళియగాండ్రుకూడ నాగమనాయకునికిఁ గప్పములు చెల్లించుట కంగీకరించిరి. చెవ్వప్పనాయకుఁడు క్రమక్రమముగఁ దంజాపురమునఁ గుదురుకొని రాజ్యమంతయుఁ బ్రశాంతస్థితికి దీసికొని వచ్చెను.

చెవ్వప్పనాయకుఁడు తంజాపురము వచ్చి దరిదరిగా నొక నెల యైనది. ఎప్పటి కప్పు డాతనికి మధురవార్త

లన్నియుఁ దెలియుచునే యున్నవి. మధురారాజ్యముకూడ సరిపూర్ణముగఁ బ్రశాంతమైన వార్త తెలిసినది. ఇప్పుడు తంజాపుర రాజ్యము సంపూర్ణముగ యథాప్రకారస్థితికి వచ్చినది. చెవ్వప్పనాయకుఁడు రాజభవనమునఁ దనవిధికృత్యములన్నియు నిర్వహించుచుఁ గూరుచున్నాఁడు. అప్పటి కొక జాముప్రొద్దెక్కినది. ఇఁక నానాఁటికిఁ జేయవలసిన వొకటి రెండుముఖ్య కార్యములుమాత్రమే మిగిలియున్నవి. చెవ్వప్పనాయకుఁ డొకసారి యొడలు విఱుచుకొని లేచి, యొకసారి వరాండా వైపు వచ్చి యటునిటుఁ బచారుచేయుచు, సౌధమునకుఁజుట్టు నున్న యుద్యానమువైపు పరధ్యానముగఁ జూచుచుండెను.



ఆతనికిఁ దంజాపురము పరిపాలించు నధికారమువచ్చుట గొప్పయదృష్టమే! ఇట్టియధికార మెంతో గొప్ప యనుభవమున్నవారికిఁగాని యీయరు. తనమేనమామకును నాగమనాయకునకును గలస్నేహమువలన నాతని కీయుద్యోగములభించినది. ఆయధికారము, ఆరాజమర్యాదలు మొదలగునవి యన్నియు ననుభవించునప్పు డతని కీయధికారము శాశ్వతముగఁ దనకుఁ లభించిన బాగుండునని యనిపించినది. కాని యీయధికార మాతనికి సంక్రమించు నవకాశము లేమియు లేవు. ఇప్పు డిది కేవలమును నాగమనాయకుని తాత్కాలికపు టేర్పాటువలననే లభించినది. ఈతరువాత, చోళరాజ్యమున కధికారు లెవ్వరో తేలినపిమ్మట వారి కిది యంతయును సంక్రమించును. కావున "నీక్లేశ మంతయుఁ గేవలమును వృథా

మైపోవునుగదా!" యని యాతనికి విచారము కలిగినది. దీని వలన నాతనికి రాత్రి చాలసేపటివరకును నిద్రపట్టలేదు. అతని నేత్రాంతములు కొంచె మెఱ్ఱవడినవి.

ఆతనిమనస్సున నింకొక విషయముకూడ వేధించు చుండెను. ఆతఁడుకూడ మీనాంబికయనిన నెక్కుడు మక్కువగా నుండెను. ఆతఁ డామెను జూచి యప్పుడే యొక నెల యైనది. మీనాంబికవివాహవిషయమున వేంకటాంబా రామభద్రనాయ కులకుఁగలయభిప్రాయభేదముకూడనాతనికొకింతచూచాయగాఁ దెలియును. కాని యావిషయ మంతగా నాతనిని భయపెట్ట లేదు. ఎప్పటికైనఁ దనమేనమామమాట నెగ్గితీరునని యాతని దృఢవిశ్వాసము. వేంకటాంబకు విశ్వనాథనాయకుఁ డన్న కొంచె మెక్కుడు మక్కువ యుండవచ్చును! కాని యంత మాత్రములో మునిఁగిపోయిన దేమియున్నది! కాని, మీనాం బికకుఁ దనకంటె విశ్వనాథనాయకునిపై నెక్కుడు యిష్టమేమో యని యాతనియనుమానము! ఇప్పుడు విశ్వనాథనాయకుఁడు తనమేనమామగారి భవనమునకుఁ బదేపదే వచ్చుచుఁ బోవు చుండును. మీనాంబికావిశ్వనాథు లిరువురును గలకల నవ్వు కొనుచు మాట్లాడుచుండురు! వేంకటాంబ వా రిరువురి కిలకిల లును నొకతలుపుచాటుననో, యొకగవాక్షమువెనుకనో యుండి వినుచు నానందించుచుండును! చెవ్వప్పనాయకునికి వారిముప్వురి యానందములును దలఁచుకొన్నప్పుడు హృదయములో మండి నట్లయ్యెను.

అప్పుడే నవవసంతము తరుశాఖలపై నాట్యమాడు చున్నది! ఒకకోకిల యుద్యానచూతమునుండి 'కో' యని కూసినది! రాజమార్గమునఁ బోవు బాలకు లెవరో యది విని 'కో' యని మాఱుకూసినారు. మరల నాకోయిల మరింత పట్టుదలతో గట్టిగా 'కో' యని కూసినది! ప్రాతఃకాలమున నింకను జిఱుచలి పూర్తిగ నంతరింపలేదు. ఆతఁడు తనశరీరముపై వదులుగ వ్రేలాడుచున్న కాశ్మీరశాలువ నొకింత బిగువుగఁ గప్పుకొనెను. వంగపండువలె నున్నయాశాలువ చామనచాయగ నున్నయాశరీరమున కొక విచిత్రసౌందర్యము కూర్చెను. ఆతనియెదురుగ నుద్యానవనమున శాద్వలముపైఁ బచ్చగడ్డిపరకలు కొఱుకుకొని తినుచున్న యొకపెంపుడులేడి యేదో యొకచిన్నశబ్దమునకుఁ గంగారుపడి తృప్తినుండి మఱి యొకచోటికిఁ బరువెత్తినది! ఆతనియెదురుగ నున్న మామిడి యాకులుకూడఁ గనఁబడనంత యెత్తుగఁ బూసినది! ప్రభాత హిమవర్షముచే మాడిన యామామిడిపూగుత్తులనుండి యెండిన మామిడిపూ లప్పుడప్పుడు రాలుచున్నవి. అప్పుడే కొంచెము పొద్దెక్కినది. ప్రకృతిసౌందర్యమున నొకవిధమగు చిఱువెచ్చతన మావహించిన ట్లుండెను.

చెవ్వప్పనాయకుఁడు లోలోపల నేమేమియో యాలోచించుచుండెను. ఆతని హృదయమందలి భావపరంపరలు గాలి దుమారమునకుఁ బరుగెత్తుకొనిపోవు పండుటాకులవలె నేదో యొకప్రవాహములోఁ బడి కొట్టుకొని పోవుచున్న ట్లుండెను.

ఆతనిహృదయమున ననేకవిధములగు భావములు బయలు దేరుచుండెను. అప్పుడప్పుడు తరుచుగ నాతనిహృదయమున నీయభిప్రాయము లుప్పొంగుచుండెను. "నిజముగ నాలోచించినచో విశ్వనాథునిలో నాకంటె ఘనత యేమున్నది! విద్యలో నిద్దఱమును సహాధ్యాయులమేకదా! విశ్వనాథనాయకుఁ డొక ప్పుడు చక్రవర్తిదగ్గఱఁ దాంబూలకరండవాహకుఁడుగ నుండెడి వాఁడు! చక్రవర్తి యిప్పు డాతనిపైఁ గొంతయనుగ్రహము గల్గినది. అందుచే నాతఁడు నాకంటె ముందుగఁ గొంచెమున్నతాధికారము సంపాదింపఁ గలిగినాఁడు! ఇప్పుడు నేను నాగమ నాయకుని యనుగ్రహమువలన నీతంజాపురాధిపత్యము సంపాదింపలేదా! ఇప్పు డీతంజాపురపు సింహాసనమునకు వారసు లెవ్వరో నిర్ణయించుట కష్టముగా నున్నది! నాగమనాయనిం గారి కిప్పుడు పాండ్యరాజ్యసింహాసన మాక్రమించి మహామండ లేశ్వరపద మందవలయునని యున్నదని విన్నాను! మహామంత్రికిఁ బాండ్యుఁ డనినఁ గిట్టదు! మూఁడుపాళ్ళు దక్షిణరాజ్య మహామండలేశ్వరపదవి నాగమనాయనింగారికే లభించునని తోఁచుచున్నది. ఆపరిస్థితులలో నాకుఁ దంజాపురసామంతాధి కారము తప్పదు! ఇప్పుడు నాయధికారము విశ్వనాథనాయకు నితో సరిసమానము కాదా!"

అప్రయత్నముగ నాతనిమనస్సు విశ్వనాథునియాకృతి విషయమున నాలోచింపఁ దొడఁగెను. "లోకులు సామాన్యముగ విశ్వనాథుఁడు చక్కనివాఁ డందురు! నేనుమాత్రము

సౌందర్యవంతుఁడను గాదా? మీనాంబిక కనులాతనిని జూచు నప్పుడు నక్షత్రములవలె మిలమిలలాడును! ఆతనిని జూడఁగనే యామె కేదో పట్టరానంత యానందము వచ్చి, యది కనుల నుండియుఁ బెదవులనుండియుఁ బొంగి పొరలిపోవుచున్నట్లుండును! నిజముగ నామె కాతడనిన నెక్కువ మక్కువయేమో! అట్లయినచో నాతోఁగూడ నామె నవ్వుచుఁ బ్రేలుచు మాట్లాడుచుండుటకుఁ గారణ మేమో? ఆహా! ఒక్కసారియైన నామెహృదయమున నిలువఁగలిగిన పురుషుఁ డెంత ధన్యుఁడు! మా మేనత్త విశ్వనాథునిమహాధికారము చూచి మురిసిపోవు చున్నది! నా కీతంజాపురప్రభుత్వము వచ్చినదని తెలిసినతరు వాత నామె కెవరిపస యెట్టిదో తెలిసివచ్చును! "కన్యామాత వరునివిత్తము పరీక్షించు" ననుమాట యూరక పుట్టలేదు!

ఏది యెటులున్నను మామామ గట్టిగఁ బట్టు పట్టి నచో నామె యెదు రాడఁగలదా! మా మామకు నేననిన నెంతో యాప్యాయముగదా! ఇఁక విశ్వనాథునియాట లెట్లు సాగునో చూచెదను!"

ఆతరువాత నాతనిభావప్రవాహము మీనాంబికవైపు మరలినది. ఒక్కత్రుటిలో నామె దేదీప్యమానమగు సౌందర్య ముతో నాతనిహృదయరంగమున సాక్షాత్కరించినది! ఆతఁడు మరల నివ్విధమునఁ దలపోయఁజొచ్చెను. "ఆహా! మీనాంబిక యెంత చక్కనిది! తుద కామె యెవరిని వరించునో! ఎందుకు నా కీయధైర్యము! ఇఁక నామెవివాహవిషయమున నాలస్యము

చేయను! ఏదోవిధముగా నీవైశాఖమాసములో నామెనువివాహమాడి తీరెదను! అబ్బా! పానకములోఁ బుడకవలె నీదాక్షిణాత్యులగందరగోళ మొకటి వచ్చినది! చక్రవర్తి కనవసరముగ నింతపట్టుదల యెందుకో! వీరశేఖరచోళుఁడుమాత్రము చక్రవర్తికిఁ గప్పము కట్ట నన్నాఁడా!"

ఆపిమ్మట నాతనికొక చిన్నవిషయము జ్ఞాపకమువచ్చినది. ఒకసారి విశ్వనాథచెవ్వప్పనాయకు లిరువురును రామభద్రనాయకుని భవనప్రాంగణమున సుఖాసీనులై మాట్లాడుకొనుచుండిరి. ఆనాఁడేలనో చెవ్వప్పనాయకునిమనసు మనస్సులోలేదు. మీనాంబిక యారోజులలోఁ గ్రొత్తగ వీణాభ్యాసమొనర్చుచున్నది. ఇంతలో మీనాంబిక యొకవీణియ వారిదగ్గఱకుఁ బంపించి శ్రుతి సరిచేసి పెట్టవలసినదని కబురంపించినది. విశ్వనాథుఁడు శ్రుతిచేసి పెట్టవలయు ననుకొనెను గాని చెవ్వప్ప ముందుగ దాసిచేతివీణఁ గైకొని, పరిశుద్ధముగ శ్రుతిచేసి పంపించెను. కాని దాసి మరల వచ్చి, మీనాంబిక శ్రుతి బాగుగ లేదన్నదని చెప్పి విశ్వనాథనాయకునిచే శ్రుతి సరిచేయించుకొని పోయినది! ఆక్షణములో నాశ్రుతి సరిచేసిన వీణియ చూచునప్పు డాతనిహృదయవీణాతంత్రు లన్నియు నొక్కసారిగఁ ద్రెంపివేయఁబడిన ట్లయ్యెను!

ఆవిషయము మరల స్మరించుచున్న యాతనిహృదయవాళిక లతికఠినముగ బిగింపఁబడుచున్న ట్లయ్యెను. ఆతఁ డొక నిట్టూర్పు విడిచి "అయ్యో! నాకుఁ దెలియకుండగనే నాహృ

దయ మీామెప్రేమపాశములోఁ జిక్కుకొనినది! ఇప్పుడు నా కొకక్షణముకూడ హృదయశాంతి లేకుండఁ బోవుచున్నది! తుద కిది హృదయమున నొకయారని చిచ్చువలెఁ బరిణమించు నేమోకదా!" అని యనుకొనెను. ఇంచుమించుగ బాల్యము నుండియు మీనాంబికయుఁ జెవ్వప్పనాయకుఁడును గలిసి యాడుకొనుచుండెడివారు. అందుచేత మీనాంబిక కీడు వచ్చి నప్పు డెప్పుడైనఁ జెవ్వప్పనాయకుఁడు కంటఁబడినచో నామె యంతగ సిగ్గుపడకుండ సామాన్యముగ మాటలాడుచుండెడిది. కాని యారోజులలోఁ విశ్వనాథనాయకుఁడు కంటఁబడినచో నత నితో మాట్లాడునపుడు కనురెప్పలైనఁ దిన్నగఁ బైకెత్తలేకుం డెడిది! ఆసమయమున నామెశరీరమంతయు లజ్జాభారముతోఁ గ్రుంగిపోవుచున్నట్లుండెడిది! అప్పు డామెతల్లి "అంత సిగ్గెం దుకు తల్లీ! విశ్వనాథనాయకుఁడేమైన మనకుఁ గొ్రత్తవాఁడా!" అని యనుచుండెడిది. ఇటువంటి చిన్నిచిన్ని సన్నివేశము లన్నియుఁ జెవ్వప్పనాయకుని హృదయమునకు దారుణాఘాత ములవలెఁ దగులుచుండెడివి. అవి యన్నియు నిప్పు డాతనికి వరుసగ స్మృతిపథమునఁ బ్రత్యక్షము లయ్యెను!

చెవ్వప్పనాయకుఁడు సామాన్యముగఁ బట్టిన పట్టు విడచువాఁడు కాడు. అతఁడేదైనఁ దలపెట్టినచో నది తుద ముట్టి తీరవలసినదే! ఈవిషయములన్నియు నాలోచించు చుండిన యాతని కప్రయత్నముగ "పెన్మకుకూవ నాదరింతురు! క్షణక్షణముల్ జవరాండ్రచిత్తముల్!" అను పద్యపాదము జ్ఞాప

కము వచ్చెను. అది జ్ఞాపకము వచ్చినతరువాత నాతఁడు "రవి గాంచనిచోఁ గవి గాంచునేకదా!" అను పద్యపాదము మెల్ల మెల్లగ నుచ్చరించెను. ఇట్లుచ్చరించుచుండగ మెల్లమెల్లన నాతనిపాదము లాతని నొకనిలువుటద్దము నెదుటికిఁ గొంపో యెను. ఆతఁడానిలువుటద్దమునెదుట నిలువఁబడి తనయవయవ సౌష్ఠవ మొకసారి పరిశీలించుకొనెను. ఆసమయమున నాతని లోలోపల "నాకంటె విశ్వనాథనాయకుఁ డేమంత యందమైన వాఁడు!" అను నభిప్రాయ ముదయించెను.

సౌందర్యము కేవలము దృష్టులపై నాధారపడిన విషయమని చాలమంది సౌందర్యవేత్తల యభిప్రాయము. కాని లోకప్రవాదముబట్టికూడ సౌందర్యనిర్ణయము జరుగుచుండును. ఆవిధముగ నిర్ణయింపవలసి వచ్చినచో సామాన్యముగ విశ్వనాథనాయకు నందఱును రూపసి యనుచుండెడివారు. తాను కూడ సౌందర్యవంతులలో నొకఁడనిన చెవ్వప్పనాయకుఁ డను కొనుచుండువాఁడు. అది కేవలము నహంభావమని త్రోసి వేయుటకు వీలులేదు. చెవ్వప్పనాయకుఁడు మొత్తముమీదఁ గొంచెము పొడగరి యనియే యనుచుందురు. ఆతనిది కను ముక్కుతీరుగల కోలముఖము. శరీరవర్ణము బాగుగ నెఱుపు కలిసిన చామనచాయ. ఆతనికనులలో నహంభావము కలిసిన రాజనీతిజ్ఞత గోచర మగుచుండెను. ఆతనివయస్సు ముప్పది సంవత్సరములకు లోపుగ నుండును. అట్లాలోచించుచు నతఁ

డతితీవ్రదృష్టితోఁ బచారు చేయుచుండెను. ఇప్పు డాతనికనుల ధోరణిని బట్టి చూచినచో నాతఁడేదో మహోద్యమమునకుఁ బూనుకొన్నట్లు కానవచ్చెను.

ఇంతలోఁ బరిచారకుఁ డొకఁడు లక్కముద్రలుగల యొకచిన్న దంతపుఁబెట్టె గొనివచ్చి యాతని కొంతదూరమున సవినయముగఁ బ్రణామము చేసి నిలువఁబడెను. ఆ పేటిక చూడఁగనే యది మధురనుండి వచ్చినదని యాతఁడు గ్రహించెను. వెంటనే యాతఁ డాపేటికఁ గైకొని దానిపైనున్న ముద్రలు జాగ్రత్తగఁ బరిశీలించి యది తెరచి యందున్న తాళపత్రము తీసి చదువ మొదలుపెట్టెను. అది మిక్కిలి వెడలుపుగల లేఁతతాటియాకుపై వ్రాసినలేఖ. ఆలేఖచుట్టును జిత్రచిత్రవర్ణములుగల నగిషీపని మెరయుచుండెను. అక్షరములపైఁ గాకరాకుపసరు పూయుటచే నవి దూరమునకుఁగూడ నిగనిగ లాడుచుండెను. అది రామభద్రనాయకుఁడు వ్రాసిన లేఖ. అందాతఁడు చెవ్వప్పనాయకునికి సత్వరముగ నొకసారి మధురకు రమ్మని వ్రాయుచుఁ గొన్ని యతిముఖ్యములగు విషయములు వ్రాసెను వెంటనే చెవ్వప్పనాయకుఁడు తగు మాత్రపుసిబ్బందితో నొకసారి మధుర వెళ్ళి రావలయునని నిశ్చయించుకొనెను.

# ద్వితీయ ఖండము.

## ౯

నాగమ చెవ్వప్పనాయకులకు మధుర తంజాపుర రాజ్యముల పాళియగాండ్రు లొంగిపోయి, కప్పములు కట్టుట కంగీకరించినమాట నిజమే. కాని నాగమనాయకునికిఁగాని, చెవ్వప్పకుఁగాని వారిని విశ్వసించి వ్యవహరించుటకు వీలులేకుండెను. అందుచే నాగమనాయకుఁడు సైన్యములన్నియు నెప్పటికప్పుడు యుద్ధసన్నద్ధములుగ నుండునట్లాజ్ఞాపించెను. కాని రోజులు గడచినకొలఁదియు మధుర తంజాపుర రాజ్యములు బాగుగఁ జక్కఁబడునను ధైర్య మెక్కుడగుచుండెను.

ఇంతకుఁబూర్వ మొకవిషయము జరిగినది. అసలు మధురకోట స్వాధీనము కాఁగానే నాగమనాయకుఁడు చంద్రశేఖరపాండ్యునిబిలిచి రాజ్యస్వీకారవిషయమున సంప్రతించెను. నాగమనాయకుఁ డానాఁడు నూతన రాజ్యవ్యవహారములన్నియు ముగించుకొని కూర్చుండి యుండెను. అప్పటికి మధ్యాహ్నము మూఁడుజాములు దాఁటినది. చంద్రశేఖరపాండ్యుఁ డప్పుడే లోనఁ బ్రవేశించెను. అది కోటలోని సౌధాగ్రమున నున్న మంత్రాంగభవనము. నాగమనాయకుఁడు సగౌరవముగ నాతనిని లోనఁ బ్రవేశపెట్టి హంసాకృతిగనున్న యొక సింహా

సనముపైఁ గూర్చుండఁబెట్టెను. ఒక తాంబూలకరండ వాహిని వచ్చి తాంబూలద్రవ్యములును, గొన్ని చిలుకలును వారిసన్నిధి నుంచి వెడలిపోయినది. నాగమనాయకుఁడును, జంద్రశేఖర పాండ్యుఁడును మొదటఁ గొంతసే పిష్టాగోష్ఠి జరిపి యాపిమ్మట రాజ్యాంగవ్యవహారములలోనికి దిగిరి. పాండ్యుఁడు తాంబూల సేవనము చేయుచు నాకులు నమలుచుండెను. నాగమనాయ కుఁడు తాంబూలము ముట్టలేదుకాని యప్పుడప్పుడు పార్శ్వ మునున్న లవంగములు నోట వేసికొనుచుండెను.

చంద్రశేఖరపాండ్యుఁడు స్వయముగ నాతనికొక చిలుక చుట్టి యీయఁబోయెను. నాగమనాయకుఁ డాతనినివారించుచు "ఎంతమాట! నేను మీకుఁ గేవలమును భృత్యునివంటివాఁడను! మీరు నాకు చిలుకలు చుట్టియిచ్చుటా!" యనెను. పాండ్యుఁ డాపై "తమరిట్లు సెలవిచ్చుచున్న చో నాకెంతో చిన్నతనముగ నుండును." అనెను. తరువాత వారిసంభాషణము ప్రకృతవిష యమునకు మరలినది.

నాగమ — సార్వభౌములు నాకుఁ గేవలమును మీ రాజ్యము మీ కప్పగింపుమనియుఁ జోళరాజ్యము జయించిన తరువాత దాని కొకప్రతినిధి నేర్పాటు చేయుమనియు నాజ్ఞా పించినారు. చోళరాజ్యమునకుఁ జెవ్వప్పనాయకుని బ్రతినిధిగా నియమింపవలెనని యనుకొన్నాను. అది జరిగినది. మీరా జ్యము మీరు స్వాధీనము చేసికొనినచో నేను సైన్యములు తీసి కొని సత్వరముగ రాజధానికిఁ బోయెదను.

చంద్ర—నేను వేయి జన్మలెత్తి పాదసేవ చేసినను మీఋణము తీర్చుకొనఁ జాలను! దయయుంచి యొక పదిపదు నేనురోజులపాటు నాయాతిథ్య మంగీకరించి నాభవనము పావనము చేయవలెనని నాప్రార్థన!

నాగమనాయకుఁ డీమాటపైఁ గొంచె మాలోచించి, మీసములు పెదవుల కడ్డురాకుండఁ గొనగోటితోఁ బ్రక్కకు దువ్వుచు నొక చిఱునవ్వు నవ్వి "మీయింట విందులు గుడుచుచుఁ గూర్చుండుటకన్న నత్యానందకరమగు విషయము వేఱొకటి యుండదు. కాని యిక్కడ నిరువదివేల రాణువకును, దినమున కేనూరు సువర్ణసుదర్శనములు వ్యయమగును. ఇంకను మీరు రాణువకై పంపించు రసవర్గములవ్యయ ముండనే యున్నదికదా! అదియునుగాక సార్వభౌములయాజ్ఞకు వ్యతిరేకముగ నిచ్చట నొకక్షణమైన నాలసించుటకు వీలులేదు. అందుచేత మాకు సెలవిప్పింపుడు!" అనియెను

ఈప్రత్యుత్తరముతోఁ జంద్రశేఖరపాండ్యునికి గొంతులోఁ పచ్చివెలగ కాయ చిక్కుపడినట్లయ్యెను! అతఁ డేదో చెప్పఁ బోయి యొకనిమిషము వరకును దడఁబడుచు నివ్విధమునఁ బలికెను. "నేనీవిషయము మీతోఁ జెప్పవలయునని యనుకొనుచుంటిని. యిది దాచినచో మీకును నాకునుగూడ ముప్పు వాటిల్లును. కావున మనసులో నున్న దేదో యున్నట్లు చెప్పుచున్నాను. మీ రీసమయమున వెడలిపోయినచో మఱుచటి క్షణములో నిచ్చట నొక పెద్దయల్లకల్లోలము బయలుదేఱును.

నాకీ పాళిగాండ్రందఱును శత్రువులేగాని యిష్టుఁ డొకఁ డును లేఁడు కావున నిచ్చటనొక పదిపదునేనుదినము లుండి నచో నాపరిస్థితులన్నియుఁ జక్కఁబడును. ఆపైని సైన్యములు తరలించుకొని పోయినను భయముండదు."

"బాగుగనే యున్నది. కాని, యీపదిపదునేను రోజు లును నీరాణువకగు ధనవ్యయమంతయు నెవరు భరించెదరు?"

"నేను కేవలము నిఁట నిస్సహాయముగ నున్నాను. ఇఁట బాగుగఁ గాలూనినపిమ్మట శ్రీరాయలధనాగారమునకు రావలసిన ధనమంతయుఁ గ్రమక్రమముగ సమర్పింపఁ గలవాఁ డను. కావునఁ గటాక్షించి నాకీమాత్రము సహాయము చేయింపుడు."

"ఈయల్లకల్లోలము లన్నియు నడఁచివేయుట కెంత కాలము పట్టునో యెవరు చెప్పగలరు."

"ఒకమాసము రోజులకంటె నెక్కువపట్టదనిదృఢముగఁ జెప్పగలను!"

"ఆపైని మరల గల్లోలములు బయలు దేఱినచో?"

"వృక్షమునకు వ్రేళ్లు బాగుగ భూమిలోనికిఁ జొరఁ బారినచో సికఁనెన్నిగాలిదుమారములు రేఁగిన నేమిభయము?"

"సరే! యట్లే యనుకొందము! ప్రస్తుతము మఱిధన మెచ్చటఁ దేగలము!"

ఈమాటపైఁ జంద్రశేఖరపాండ్యుఁడు మరల నొక చిలుక నోట వైచుకొన ముసిముసి నవ్వులు నవ్వుచు 'ఎంత

మాట! మీరు తలఁచుకొనినచో ధనమునకుఁ గొఱఁత కలుఁగునా?" అనెను. ఆపై నాగమనాయకుఁ డొకింత సేపు కొంచెము తీవ్రముగ నాలోచించి "మీరు పొరపడుచున్నారు. సార్వభౌముని యాజ్ఞ లేకుండ నేను ధనాగారమునుండి యొక్క-చిల్లిగవ్వయైన వ్యయపఱచుటకు వీలులేదు." అనెను.

"ఈమాత్రమునకు మీరు సార్వభౌముని ధనాగారము వఱకును బోవలెనా? పోనీ! సార్వభౌముని ధనాగారమునుండి ధనము స్వీకరింపవలసి వచ్చుననియే యనుకొందము! మీరు ధనాగారాధిపతులుగదా! సార్వభౌముని సామ్రాజ్యరక్షణకై ధనము వినియోగించినచో మిమ్మడుగువా రెవ్వరుందురు?"

నాగమనాయకుఁ డిది విని తల యడ్డముగఁ ద్రిప్పుచు "లేదు! లేదు! సార్వభౌముని యనుజ్ఞ లేనిదే ధనాగారమునుండి నేనొక్క-తృణముకూడ వ్యయమొనరింపఁజాలను!" అని విస్పష్టముగఁ జెప్పివైచెను.

"పోనిండు! ఈవిషయమున మీస్వీయధనము వ్యయపఱుపవచ్చును!"

"వ్యవహారము వ్యవహారమే! కావున నున్నమాట యేదో మీ ముఖముమీఁదనే యనుచున్నాను. నాకీవిషయమున స్వీయధనము ఖర్చుపెట్టుటకు ధైర్యము చాలకున్నది!"

ఆమాటపైఁ బాండ్యుఁ డొకింతతడవు కనుఱెప్ప వేయకుండ నాలోచించి ప్రశాంతముగఁ "బోనిండు! దీనిలో నాకు వచ్చు నాపత్తేమియు లేదు! నాకెవ్వఁడును దిగిగి రాజ్యము

చేయవలయుననుకోరికయే లేదు! దీనివలన వచ్చునష్టియంతయు మీదే! ఈజయించిన రాజ్యమంతయు నొక మాసములో బలవంతుఁడగు నొకసామంతుఁ డెవ్వఁడో తన్నుకొనిపోవును! అట్టిపరిస్థితులలోఁ దలవంపు లెవరికో యాలోచించుకొనుఁడు!" అనిసమాధానము చెప్పెను. అప్పుడు నాగమనాయకుఁడు "మీరు చెప్పునది బాగున్నది! చూచిచూచి, ధనమంతయు గంగలోఁ బారపోయుమందురా!" అని ప్రత్యుత్తర మిచ్చెను. ఆపైఁ బాండ్యుఁ డొకకొంతతడవు తీవ్రముగ నాలోచించి ఇదియా! "మీకుఁ గలిగిన యనుమానము! అటులయినచో మీధనము మీరు రాఁబట్టుకొనువఱకును నీమధురారాజ్యము సంపూర్ణముగ మీచేత నుంచుకొనుఁడు! అంతవఱకును నే నీరాజ్యాధికారము స్వీకరింపను! ఇంకొక విషయము చెప్పు చున్నాను! అసలు నాకీశత్రుమధ్యమున రాజ్యము స్వీకరింప వలయుననియే లేదు! ఏదోనారోజులు నాకుమర్యాదగ వెళ్ళి పోవున ట్లేర్పాటుచేయించినచో నాకదియే పదివేలు! అంత కన్న నాకేమి కావలయును!" అని నచ్చఁ జెప్పెను.

చంద్రశేఖరపాండ్యుఁ డిట్లుమాట్లాడినతరువాత నాగమ నాయకుని కిఁక నంగీకరింపక తప్పినదికాదు! అతఁ డవసర మయినచో నొకటిరెండుమాసములవఱకును గూడ నుండి యీ రాజ్యము నిరుపద్రవముగ నొసఁగెదనని వాగ్దాన మొనర్చెను. ఇంతధనము వ్యయపఱచి మధుర చంద్రశేఖరుని కప్పించిన తరువాత దానికిఁ దగిన కట్టుదిట్టములు చేయకుండ మరలి

పోయినచో సార్వభౌములు మాత్రము హర్షింతురా? ఇంతకును నీధనము నాగమనాయకునిదిగాని, సార్వభౌమునిది గాదుగదా! దీనిపై సార్వభౌమునికి విప్రతిపత్తి కలుగవలసిన యవసరమే మున్నది! చంద్రశేఖరుఁడు ఋణమంతయుఁ దీఱువఱకును, మధురారాజ్యము కుదువ యుంచుట కంగీకరించినాఁడు! ఒక చిల్లిగవ్వయైనఁ బోకుండఁ జంద్రశేఖరున కిచ్చిన ఋణమంతయు రాఁబట్టుకొనవచ్చును! ఆపైఁ జంద్రశేఖరుఁడుపడినశ్రమ కంతకును నేదైన ఘనపారితోషిక మీయకుండఁ బంపివేయఁడు కదా! ఏవిధముగ నాలోచించినను నిచ్చట నొకటి రెండు మాసములవఱకును నాగుటలో నష్ట మేమియు లేదు! ఒక వేళ ఖర్చుపెట్టిన ధనమంతయుఁ దిరిగి రాదనుకొందము! అప్పుడు చంద్రశేఖరుఁడు కుదువయుంచిన మధుర యెక్కడకుఁబోవును? ఇఁక సార్వభౌములదగ్గరనుండి యీసైన్యము లింతకాలమిచ్చట నుంచుట కభ్యనుజ్ఞఁ బడయవలయును. అల్లకల్లోలము లడఁచు చున్నామని చెప్పినచో సార్వభౌముని యనుజ్ఞ పొందుట యంత కష్టముకాదు! సార్వభౌమునికిని, దిమ్మరుసుమంత్రికిని నాగమనాయకునిమాట యనిన వేదాక్షరము! అతఁడు చిన్న తనమునుండియుఁ జక్రవర్తికి నమ్మిన బంటు! ఈవిషయమున నీవిధముగ సాధకబాధకము లన్నియు నాలోచించిన తరువాత రామభద్రచెవ్వప్పనాయకులుగూడ నాగమనాయకుని నిశ్చయమునకు సంపూర్ణాంగీకృతిని దెలియఁజేసిరి.

---

౧౦

కాలచక్రము గిరగిరఁ దిరిగి పోవుచుండెను. నాగమ నాయకుఁడు చెవ్వప్పనాయకుని దంజాపురప్రతినిధిగా నియమించి, స్వయముగ మధుర పాలింప మొదలుపెట్టిన తరువాత నప్పుడే రెండుమాసములు గడచిపోయినవి. వైశాఖమాసపు టెండలు నిప్పులు చెరిగిపోయుచుండెను. అది రామభద్రనాయకుని భవనము. పగలు మూఁడుజాములు దాఁటవచ్చెను. రామభద్రనాయకుఁడును, చెవ్వప్పనాయకుఁడును గలిసి యేమేమో మాటలాడుకొనుచుండిరి. వారు కూర్చున్న భవనముచుట్టును నున్న సాంద్రచూతతరువులపై వ్రేలాడుచున్న మల్లెతీవలనుండి మధురపరిమళ మెల్లెడలను వ్యాపించుచుండెను. దూరదూరమునఁ జెట్లపై నున్న కాకములు తాపబాధ కోర్వఁజాలక, కరుణస్వరములతోఁ 'గావు కావు' మని కూయుచుండెను. ప్రాసాదోపరిభాగమునుండి యప్పు డప్పుడు పారావతరుతములు మంద్రమంద్రముగ వినిపింపసాగెను. ఎడనెడ నెచ్చటనో చెట్లపై మిగిలిన యొకటి రెండు పండుటాకులు మెల్లగఁ గ్రిందఁ బడుచుండెను. అతీక్ష్ణాతపబాధ కోర్వలేక చాలమంది మధురానివాసులు తలుపులు బిగించుకొని శయ్యలపై నిటునటు దొరలుచు నుస్సు రనుకొనుచుండిరి.

రామభద్ర చెవ్వప్పనాయకు లిరువురును నింతకుఁ బూర్వమే మధ్యాహ్ననిద్రనుండి లేచి, లఘువుగ ఫలాహారము

ముగించి, స్వాదుశీతలములగు మృదులగంగానారికేళసీరములు గ్రోలి, యనంతర మిచ్చటికి వచ్చి కూర్చుండి సావకాశముగ సంభాషణ ప్రారంభించిరి. దూరమునుండి యొక సేవకుఁడు క్షీరాబ్ధిదుకూలనిర్మితమగు యంత్రవ్యజనము మెల్లగ లాగుచుండెను. ఆవ్యజనము దూరమునుండి లాగునపు డాత్రాటిరాపిడి వలన మంద్రమగు నొక మధురధ్వని బయలుదేఱి వారి కానందముఁ గూర్చుచుండెను. పైనుండి గాలివీచినపుడెల్ల మృదులాతి మృదులములగు వారిదుకూలాంచలములు చలించుచుండెను. వారిముఖముల వైఖరినిబట్టి చూచినచో వా రేదో రహస్య విషయములు చర్చించుచున్నట్లు కనఁబడిరి.

హ్రస్వస్థూలాకృతియగు రామభద్రనాయకుని కన్నులు కొంచె మెఱ్ఱగఁ గానవచ్చుచుండెను. అతఁడు ప్రతిపదమును బాగుగ నాలోచించి, తూఁచి తూఁచి చెప్పుచున్నట్లు మాట్లాడు చుండెను. అతనికిఁ గొంచెము మెల్ల. అందుచే మాట్లాడు చున్నప్పు డెటు చూచి మాట్లాడుచున్నాఁడో గ్రహించుట కష్టము. నల్లగనున్న యాతనిశరీరము కుదిమట్టముగను, దృఢముగను గానవచ్చెను. కనుబొమలశల్యములు ముందునకుఁ జొచ్చుకొని వచ్చుటచేఁ గనుదోయి కనుగూండ్లలోఁ జిక్కుకొన్నట్లు కనఁబడెను. కొంతసేపు రామభద్రనాయకుఁడు చెప్పిన వృత్తాంత మంతయు విని చెవ్వప్పనాయకుఁ డిట్లు చెప్పెను.

"చంద్రశేఖరపాండ్యుఁ డడిగినచో మధుర యాతనికి స్వాధీనము చేయుట న్యాయము గాదా!"

"న్యాయమే! మరి నాగమనాయనికి రావలసినధనము మాట!"

"ఇప్పటికింకను నాయున కెంత ఋణము తీర్చవలసి యున్నది?"

"పదివేల సువర్ణసువర్ణనములు!"

"పాండ్యుఁ డది తీర్చుకొందు ననుచున్నాఁడు గదా!"

"మొదట నాతఁడు ఋణమంతయుఁ దీర్చుకొనువఱకును రాజ్యము స్వాధీనము చేయనక్కఱలే దన్నాఁడు. ఆరోజులలో నసలు తనకు రాజ్యమే యక్కఱలేదనియు, మర్యాదగఁ గాల క్షేపము చేసికొనుటకు వీలగువసతి యేర్పరచినఁ జాలుననియు ననుచుండువాఁడు! అప్పు డాతఁడు "అస లీరాజ్యము నాగమ నాయనింగారి కెన్నటికిని దిన్నగ స్వాధీనము కా" దని యను కొన్నాఁడట! ఇప్పు డిదియంతయు దారిలోనికి వచ్చినతరువాతఁ దనరాజ్యము తనకుఁ దెమ్మనుచున్నాఁడు!"

అప్పైఁ జెవ్వప్ప యొక చిఱునవ్వు నవ్వి "ఎప్పటికైన నాతఁడు మనచేతిలోనివాఁడేకదా! అట్టిచోఁ బదివేలసువర్ణన ముల ఋణమును దీర్చుకొందు నన్నప్పుడు వానిరాజ్యము వానికిఁ బాఱవేయుట మంచిదికదా!" అనెను.

రామ—ఏమో! అతఁడు తీర్చఁగలఁడను నమ్మక మేమున్నది?

చెవ్వ—దీని కంత యనుమానపడనలసిన యవసర మేమున్నది?

రామ—మన మిటు విజయనగరము పోయిన యనంతరము పాళియగాండ్రందఱును నేకమై వానిని దఱిమివేసినచో దిక్కేమున్నది?

చెవ్వప్ప—(చిఱునవ్వు నవ్వి) బాగుగనే యున్నది! అట్టి అసమర్థుఁడు సామ్రాజ్యమునకుఁ గప్పముమాత్రము తిన్నగఁ గట్టఁగలఁడను నమ్మక మే మున్నది?

రామ—కనుకనే నాగమనాయకుఁ డాతనికి రాజ్య మప్పగించుటకు సందేహించుచున్నాఁడు.

చెవ్వప్ప—ఒకవేళ రేపటియుదయమున నాతఁ డాపది వేలసువర్ణములను గొనివచ్చి నాగమనాయునింగారి యెదుట బోసినచో మన మేమని సమాధానము చెప్పఁగలము?

ఈ ప్రశ్నపై రామభద్రనాయకుఁడు బొమముడి విడిచి యొకింతసే పాలోచించి "దీని కింత యాలోచింపవలసిన పని యే మున్నది! రాజ్య మప్పగించుటకు వీలులేదని స్పష్టముగ సమాధానము చెప్పవలసినదే!" యనెను. ఈసమాధానము విని చెవ్వప్పనాయకుఁడు కొంచె మాశ్చర్యపడెను. కాని యాతఁ డాయాశ్చర్యము పైకిఁ గనఁబడనీయక "ఆవిధముగ నీతిమాలి ప్రవర్తించినచో మథుర యంతయు మనపై దుమ్మెత్తిపోయదా?" యనెను.

రామ—(నిశ్చలముగ) అసమర్థునికి రాజ్య మప్పగించినచో నంతకన్న నెక్కువగ దుమ్మెత్తిపోయును!

చెవ్వప్ప— (తల యడ్డముగఁ ద్రిప్పి) ఏమో! దీనికి సార్వభౌము లెన్నటికిని నంగీకరింపరు! పాండ్యునికి రాజ్య మిచ్చెనదన్నతరువాత వారు మాట తిరుగుదురా? ఇదియెన్న టికిని జరుగనేరదు!

రామ— ఔను! నాగమనాయకునికిఁగూడ నీవిషయ మునకు సార్వభౌము లంగీకరింప రేమోయని భయముగనే యున్నది!

చెవ్వప్ప— పోనీ! వారి కీవిషయము లన్నియు నెటి గించి. వారియాజ్ఞప్రకారము చేయరాదా?

రామ— నాగమనాయకుఁ డంతవఱకు బో నక్కఱ లేకుండ నీవ్యవహారము పరిష్కరింపవచ్చునేమోయని చూచు చున్నాఁడు. మొదట నాతఁడు తన కీరాజ్య మక్కఱలేదనియు, మర్యాదగఁ గాలక్షేపము చేయుటకుఁ దగినవృత్తి యేర్పాటు చేసినఁ జాలుననియు నన్నాఁడుగదా! పోనీ! ఆవిధముగ వానిని సంతోషపెట్టినచో నీవ్యవహారము పరిష్కార మగునేమోయను నాశ కలుగుచున్నది. అందుచే నీవిషయము లేమియు సార్వ భౌమునికిఁ దెలియ నీయలేదు.

చెవ్వప్ప— ఏమో! నా కిది యంతయుఁ జిలికి చిలికి గాలివాన యగునేమో! యని భయముగా నున్నది!

రామ— ఎందుచేత?

చెవ్వప్ప— పాండ్యుని నమ్ముటకు వీలులేదు! వాఁడు పయికట్లు కాన్పించునుగాని కేవలమును బయోముఖవిషకుం

భము! వానివిషయమునఁ జాల మెలఁకువతోఁ బ్రవర్తింపవల యును! తలఁచుకొన్నచో వాఁ డెంతపనినైనఁ జేయఁగలఁడు! సార్వభౌమునికిఁ బ్రతివిషయమును నెఱిగించి యుండినచో బాగుగ నుండెడిది!

రామ—దీనిలో సార్వభౌముని మభ్యపెట్టుట యేము న్నది! కేవలమును సామ్రాజ్యక్షేమ మాలోచించి మే మీ విధముగఁ జేయవలసి వచ్చినది!

చెవ్వ—కాని యిదియంతయు నొక్కసారిగఁ దెలిసి నచో సార్వభౌము లేమనుకొందురు! లోకు లందఱును నాగమ నాయనింగారు కేవలమును రాజ్యలోభమువలనఁ బ్రవర్తించి రని యనుకొనరా?

రామ—మే మంతవఱకును వచ్చునని యనుకొనుట లేదు. పాండ్యుఁ డేదో విధముగ సంధికి దిగునని మాయాశ!

చెవ్వ—సరే? అట్లు జరిగినచో మంచిదే! మీయాశకుఁ గూడఁ గొంత యవకాశము లేకపోలేదు. ఇంతకును దైవ నిర్ణయ మెట్లున్నదో!

రామ—నీవుమాత్రము మిగుల జాగ్రత్తగ నుండవల యును. ఎప్పటికప్పుడు నీ కిచ్చుటవిషయములన్నియు నెఱిం గించుచుందుము.

అనిచెప్పి రామభద్రనాయకుఁ డొకనిట్టూర్పు విడచి పెట్టెను. ఎండవేడిమి కొంచెము తగ్గినది. కాని వేడిగాఘుపు లిప్పు డిప్పుడే వీచుట కారంభించినవి. చెవ్వప్పనాయకుఁ డా

యుద్యానవనమున నవతరించిన వసంతసౌందర్య మవలోకించుచు, నొక నిట్టూర్పు విడిచిపెట్టెను. ఆతనియెదుట నొకముంగిస తోఁక కదుపుచుఁ దొందరగఁ బరువెత్తి యాతోఁటలో మాయ మయ్యెను. పిచ్చుకలు కొన్ని యుద్యానదీర్ఘికల మెట్లపైఁ గూర్చుండి దీర్ఘికోదకములచే దాహము తీర్చుకొనుచున్నవి. ఆకాశాంతమున నొకనీలమేఘము మెల్లమెల్లగఁ బైకి లేచుటచే నొక పెద్ద గాలిదుమారము రేగునేమో యను భయము గలుగుచుండెను. చూచుచుండఁగ నొక ఝంఝా మారుతము వీచెను. రామభద్రచెవ్వప్పనాయకు లిరువురు నాహోరుగాలికి భయపడి భవనాభ్యంతరమునకుఁ బోయిరి.

---

## ౧౧

"నేను తమ కీయవలసిన ధనమంతయు నిచ్చివేయుటకు సిద్ధముగానున్నాను. నా రాజ్యము నాకు స్వాధీనము చేయింపుమని మనవి."

"ఇంతధన మంతయు నెచ్చట సమకూర్పఁ గలిగితిరి."

"దీనికొఱకై మాపూర్వులయ మూల్యమాణిక్యహారములన్నియు విక్రయింప వలసివచ్చినది. అప్పటికిని ధనము చాల లేదు. తుదకు నాయమూల్యరత్నాంగుళీయకముఁ గూడ నమ్మి

వేసితిని. ధనమంతయు సిద్ధముగనున్నది. మీ సెలవైనచో నొకగడియలోఁ గోటలోనికిఁ దెప్పింపఁ గలను."

"అయ్యో! ఈస్వల్పధనము కొఱకు మీ రంత శ్రమ పడుట యెందులకు? రాజ్యమునకు వచ్చిన తరువాతఁ గ్రమక్రమముగ నిచ్చివేయవచ్చును గదా!"

ఈసమాధానము చంద్రశేఖరపాండ్యునికిఁ జిత్రముగఁ గనబడెను. ఇంతకుఁ బూర్వము చంద్రశేఖరపాండ్యుఁడు నాగమనాయకునితో సంప్రతించినాఁడు. అప్పు డాతఁడు ఋణమంతయుఁ బూర్తిగఁ దీర్చివేసినఁగాని రాజ్యము స్వాధీనము చేయుటకు వీలుపడ దన్నట్లు మాట్లాడినాఁడు. మఱి యిప్పుడీతీయతీయనిమాట లెందుకు? ఇంతకును నిందులో నేమి విషమున్నదో! అసలు నాగమనాయకుఁడు రాజ్యము స్వాధీనము చేయుద నన్నప్పుడు మాఱుమాట్లాడకుండ మధురారాజ్యము స్వీకరింపవలసినది! చేతులు కాలినపిదప నాకులు పట్టుకొనిన నేమిలాభము! పాండ్యుఁడు కొంచమునే పేమియు మాట్లాడ కూరకుండి, సగముసగము సంకోచముతో నొకచిఱునవ్వునవ్వి "మీసౌమనస్య మట్టిదని నే నెఱుఁగుదును. కాని వ్యవహారములో నెప్పుడును నిష్కర్ష మంచిదని ధనము సిద్ధము చేసికొని వచ్చితిని." అనియెను.

దానిపై నాగమనాయకుఁడు కుడిచేతి బొటనవ్రేలితో నరసిన మీసములు మెల్లగ దువ్వుచు "సరే! పోనిండు! ధనమెట్లును సిద్ధము చేసికొనివచ్చితిరిగాన ధనాగారాధికారికి ధన

మంతయు నిచ్చి వారిదగ్గర ఋణవిమోచనపత్రిమును గైకొ నుఁడు!" అనియెను. చంద్రశేఖరపాండ్యుఁ డందులకు సంతసించి సాదరముగఁ "ఉత్తమక్లే చేసెదను" అనియెను. ఆతరువాతఁ జంద్రశేఖరపాండ్యుఁడు నాగమనాయకుఁడు తనకు మధుర యప్పగించు విషయమున నేమైనఁ జెప్పునేమోయని యెదురు చూచెను. కాని యాతఁ డావిషయ మేమియు నెత్తలేదు. నాగమనాయకుఁ డొక్క నిమిష మూరకుండి "మీ కిక్కడ గాడ్పులు చాలఁదక్కువ! మారాజధానిలో నీపాటి కీచెంప గాడ్పు లాచెంపకుఁ గొట్టుచుండును!" అనియెను. చంద్రశేఖర పాండ్యునినుదుటిపైఁ జిఱుచెమట లంకురించెను. ఆతఁ డొక నిట్టూర్పు విడచి చిఱునగవుతో "నిదియంతయు మీచలువ!" యనియెను. కాని నాగమనాయకుని సంభాషణ వైఖరివలన నాతని కరికాలిమంట నెత్తికెక్కినది! అయినను నిది తగిన సమయము కాదని మాట్లాడకూరకుండెను. ఒకటి రెండు నిమి షములవరకును మరల నిరువురును మాట్లాడలేదు.

నాగమనాయకుఁడు జంద్రశేఖరపాండ్యుఁడును రాజ భవనమునఁ బైయంతస్తుపై హంసాసనములపై నుపవిష్టులై యుండిరి. అప్పటికప్పుడే సూర్యాస్తమయము కావచ్చుచుం డెను. సమీపముననున్న వైగైనదినుండి యప్పుడప్పుడు చల్లని పిల్లతెమ్మెరలు వీచిప్రాణములకు హాయిఁ గొలుపుచుండెను. దూరమునమీనాక్షీ సుందరేశ్వరుల యాలయమునుండిఘంటా ధ్వనులును, శంఖారావములును వినవచ్చుచుండెను. వైగైనదీ

సైకతములపైఁ గూర్చుండి చల్లగాలి యనుభవించుచుండిన కొందఱు పౌరు లప్పుడే వెడలిపోసాగిరి. సాయంకాలారుణ కాంతులలో వైగైనదీనీరము కరగిన మేలిమిబంగారమువలెఁ గానవచ్చెను అప్పుడే సుందరేశ్వరుని దేవాలయగోపురములపై నొకటి రెండు చిఱుదీపికలు మిలమిల లాడినవి.

చంద్రశేఖరుని కిఁకఁ గూరుచుండుట మిగులఁ గష్టమని పించెను. నాగమనాయకుఁ డీవిధముగ నేమియు మాట్లాడకుం డుటవలన నాతఁ డింకఁ దన కేదో మూడనున్నదని గ్రహిం చెను! అయినను నిష్కర్షగ వ్యవహార మంతయుఁ దేల్చుకొన వలెనని నిశ్చయించెను. అందుచే నాతఁడు మెల్లగ హంసాసనము నుండిలేచి "మఱి నేను సెలవు తీసికొందునా? తమయాజ్ఞ ప్రకారము రేపటియుదయమే సువర్ణమంతయుఁ గోశాగారాధి కారి కప్పగించెదను." అనియెను. నాగమనాయకుఁడు గూడ లేచి, నిలువఁబడి "అవును! అవును! అప్పుడే చీఁకటి పడు చున్నది! మీ రింక దయచేయుఁడు! కోశమునకు రేపే ధన మందవలయునను తొందర లేదు. మీ కెప్పుడు వీలుగ నున్న నప్పుడే పంపవచ్చును." అని యత్యాదరముగఁ బలికెనుఁ

"ఎందుకు! ధనమంతయు సిద్ధముగ నున్నప్పు డింకనాల స్యము చేయుట నాకిష్టము లేదు! అన్నట్లు తమతో నే నొక విషయము విన్నవించ వలయునని యనుకొనుచున్నాను."

"దాని కింత సంకోచ మెందులకు? అవశ్యము సెల వీండు? వెళ్ళుదురుగాని! ఒకసారియాసనముపైఁగూర్చుండుడు!"

దానిపై నాగమనాయకుఁడును జంద్రశేఖరపాండ్యుఁడును మరలఁ గూర్చుండిరి. చంద్రశేఖరపాండ్యుఁడు 'అబ్బే! ఏమియు లేదు! మీకు మరల శ్రమయిచ్చినట్లున్నాను. నేను పట్టాభిషేకమునకు శుభముహూర్త మేర్పాటు చేయింపవలె నని చూచుచున్నాను. ఆవిషయము తమచెవిని బడవేసి మఱి పోవలయునని యనుకొన్నాను! అంతే!' అనెను. నాగమ నాయకుఁ డొకనిమిషమూగి, యెదురుగనున్న వైగైనదీవేణిక నైపునకుఁజూచుచు 'దానికేమి! మీరుముహూర్తనిర్ణయము చేయింపవలయు ననుకొన్నచో నాయడ్డేమున్నది! అవశ్యము ముహూర్తము పెట్టింపుడు!' అని పలికెను.

"అయిన నెప్పుడు ముహూర్త మేర్పాటు చేయింపు మని సెలవు?"

'దీనిలో నాయధికార మేమున్నది! సార్వభౌముని యనుజ్ఞపై మీ రెప్పుడైనను ముహూర్తనిర్ణయము చేయింప వచ్చును!'

ఈసమాధానము విన్నతరువాతఁ జంద్రశేఖరపాండ్యు నిపై బిడుగు పడినట్లయ్యెను. నిజముగ నాలోచించినచో సార్వభౌముఁ డీయధికారములన్నియు నాగమనాయకుని కిచ్చి నాఁడు. చంద్రశేఖరపాండ్యుఁడు సార్వభౌముని దర్శించినపు డాతఁడు 'నాగమనాయకుడు వీరశేఖరచోళుని దరిమి నిన్ను నీరాజ్యమునఁ బ్రతిష్ఠించునని చెప్పినాఁడు! మఱి నాగమనా యకుఁ డీవిధముగ మాట్లాడుటలో నర్థ మేమున్నది! బహుశః

ఆతని కీవిషయమున నేదో దురాలోచన కలిగినది! సందేహము లేదు! అయినచో నాగమనాయకుఁడు మధురదుర్గము స్వాధీనము కాఁగానే యది తనకుఁ గైవసము చేయుదు నన్నాఁడే! అతఁడట్లనుటలో నంతరార్థ మేమి? బహుశః ఆసమయమునఁ జంద్రశేఖరునికి రాజ్య మిచ్చినను నాతఁ డది స్వాధీనముఁ చేసికొనుస్థితిలో లేఁడని యిట్లన్నాఁడేమో! ఏమయినను నాగమనాయకుఁ డేదో కుతంత్రము పన్నుచున్నాఁడు! ఏమియు సందేహము లేదు! అయినను జంద్రశేఖరపాండ్యుఁడు సాధ్యమైనంతవఱకు సామోపాయమున నాగమనాయకుని హస్తములనుండి రాజ్యము గుంజుకొనవలయునని యోచించినాఁడు. అదియుఁగాక, ఆతఁ డంతకంటెఁ జేయగలిగినదికూడ నేమున్నది! ఇప్పుడు తొందర పడినచో నేమియు లాభము లేదు! ఈ విధముగ నీయాలోచనలన్నియు నాతనిహృదయములో నొక కనుఱెప్పపాటులో గిఱ్ఱునఁ దిరిగిపోయినవి!

చంద్రశేఖరపాండ్యుఁ 'డొకటి రెండు నిమిషములు నైగై కేసి చూచుచున్నట్లుండి మరల నొక్కచిఱునవ్వు నవ్వి "శ్రీసార్వభౌము లీవిషయమయిన సర్వాధికారములును మీ పరము చేసినారుగదా! రాజధానినుండి తిరిగి వార్త నచ్చునప్పటి కెంత యాలస్య మగునో! రాజ్య మంతయుఁ బ్రశాంతముగ నున్నది! నాకు రాణువకగు ఖర్చు భరించుటకు శక్తి లేకుండ నున్నది! కావున నాపైఁ గరుణించి, నా ప్రార్థన మన్నింపుఁడు! ఈ ఋణము తీర్చుట కెంతకష్ట మయినదో

తమరు గమనించియే యున్నారుగదా!" అనెను. నాగమనాయకుని ముఖముపైఁ గొంచెము విసుగు కనఁబడెను. అతఁడొక నిమిషము బొమముడి విఱచి "దానికి నేనేమి చేయఁగలను! సార్వభౌమునియనుమతి లేకుండ నే నేమి చేయుటకును వీలు లేదు! అదియుఁగాక, ఈరాజ్యమున మీకందఱును శత్రువులే! అట్టిసందర్భములోఁ జూచుచుఁ జూచుచు నీరాజ్యము మీ చేతిలో నెట్లు పెట్టగలము! ఇంతకును నేను సార్వభౌము లెట్లు నిర్ణయించిన నట్లాచరింపవలసినవాఁడను. అంతేగాని స్వతంత్రుఁడను గానుగదా! ఇంతకాలమును నోపిక పట్టినవారిఁక మఱి కొన్ని రోజు లోపిక పట్టినచో వ్యవహారము లన్నియుఁ బరిష్కారమయిపోవును! మీ రనవసరముగఁ దొందరపడినచో నే నేమి చేయగలను!" అని సమాధానము చెప్పెను.

పాండ్యుఁడిఁక మాట్లాడిన లాభము లేదని గ్రహించి "సరే! పోనిండు! మఱికొంతకాలము నిరీక్షింపవచ్చును. నేఁడో రేపో సార్వభౌములదగ్గఱనుండి యాజ్ఞ వచ్చినతరువాతనే శుభముహూర్తనిర్ణయము చేయవచ్చును!" అని చెప్పి నాగమనాయకునికి నమస్కరించి సెలవు తీసికొని వెడలిపోవుచుండెను. అంతలో నాగమనాయకునిముఖమునఁ జిఱునవ్వుదయించెను. అతఁడు "మీవ్యవహారము తొందరగనే పరిష్కారము చేసెదను! కొంచె మోపిక పట్టుఁడు!" అని చెప్పుచు నాతనిని గొంత దూరము సాగనంపి కొంచెము చీఁకటిపడుట చూచి "చీఁకటి పడినది! మీకుఁ బల్లకీ పంపించెదను." అని పలికి యాతనిని

కర్పూరకరదీపికామృతమగు తనపల్యంకికపైఁ గూర్చుండఁబెట్టి సగౌరవముగఁ బంపివేసెను.

ఆ పిమ్మటఁ జంద్రశేఖరపాండ్యుఁడు మరల రెండు మూఁడుసారులు నాగమనాయకుని దర్శించి "సార్వభౌముని యనుమతి యైనదా?" అని ప్రశ్నించెడువాఁడు. నాగమనాయకుఁడు ఏమోగాని, యింకను సమాధానము రాలేదు" అని పలికి యాతని నత్యంతగౌరవముతో సాగనంపుచుండెడివాఁడు. పాండ్యుఁడు తుదకుఁ గొందఱు మధ్యవర్తులనుగూడ నాగమనాయకునికడకుఁ బంపించెను. వారు తిరిగివచ్చి "మీరు యావజ్జీవము మర్యాదగఁ గాలక్షేపము చేసికొనుటకుఁ దగిన యవకాశము కల్పించుటకు వారు సిద్ధముగా నున్నట్లు మాట్లాడుచున్నారు. అంతే! ఇఁక రాజ్యమువిషయ మెత్తినచో సార్వభౌమునియనుమతి కావలయు ననుచున్నారు." అని చెప్పిరి! ఆమాటలు వినునరికి పాండ్యునిహృదయములోని రక్తమంతయు నొకసారిగఁ గన్నుల కెక్కెను! ఆతఁడు క్రింది పెదవి పైపంటి కొనతో నొక్కిపట్టి "నాగమనాయకుఁడు నాకు భరణ మిచ్చెద నన్నాఁడేమి? సరే!" యనెను. ఆతరువాతఁ బాండ్యుఁడుగాని; యాతనిమధ్యవర్తులుగాని మఱినాగమనాయకుని దర్శింపలేదని వేఱుగ వ్రాయ నక్కరలేదు!

౧౨

నాగమనాయకుని పరిపాలనమునఁ బాండ్యరాజ్య మంతయు నిష్కంటక మయ్యెను. పాళియగాండ్రందఱును గ్రమక్రమముగ నీక్రొత్తప్రభువు ననుగ్రహము సంపాదింపఁ బ్రయత్నింపసాగిరి. పౌరులలోఁ దగవరు లందఱును నేదో విధముగ నాగమచంద్రశేఖరులకు సంధిఁ గూర్ప యత్నించిరి. పాండ్యుని వైఖరినిబట్టి "యాతఁడు నాగమనాయకుని కనువర్తిగ నుండి సుఖముగఁ గాలక్షేపము చేయు" నని యెల్లరును విశ్వసించిరి. కాని కొందఱు విజ్ఞులగు పౌరులుమాత్రము చంద్రశేఖరుని విశ్వసించుటకు వీలులేదని వాదించిరి. చివర కీవిజ్ఞులు చెప్పిన మాటలే నిజమైనవి! పాండ్యుఁ డొక్కసారిగ సకుటుంబముగ మాయమై పోయెను! ఎవరికిని నాతనిజాడ తెలియలేదు!

నాగమనాయకుని కీవార్త తెలియఁగనే కూర్చున్న సింహాసనమునుండి కస్సుమని లేచి నిలువఁబడెను! ఆసమయమునఁ నాతని సమీపించుటకుఁగూడ నెవరికిని సాహసము గలుగలేదు! వెంటనే యాతఁడు నలుదిక్కులకును వందలకొలఁది యాశ్వికులను బంపి చంద్రశేఖరపాండ్యుని సజీవముగఁ బట్టి తేవలయునని యాజ్ఞాపించెను. ఆతనికిఁ జంద్రశేఖరుఁడు మరల విద్యానగరమునకుఁ బోయియుండునని గట్టిగ ననుమానము గలిగెను. అందువలన నాతఁడు విద్యానగరమునకుఁ బోవు రాజమార్గము లన్నియు సైనికులచే నరికట్టించెను. గూఢచారులను

బంపి పాండ్యరాజ్యమున నున్నపల్లెలను, బట్టణములను వెద కించెను. కాని యెచ్చటను బాండ్యునిజాడగాని, బాండ్యుని కుటుంబముజాడగాని లభింపలేదు! పాండ్యుఁడు సకుటుంబముగఁ బరారియైనప్పటినుండియు నాగమనాయకునికి సరిగ నిద్రపట్టుట మానివేసెను!

అర్ధరాత్రి దాఁటినది. నాగమనాయకుఁడు శయనాగారమున నొంటరిగ నటునిటుఁ బచారు చేయుచుండెను. ఎదురుగ రక్తపద్మాకృతిగనున్న కాచపాత్రమున నొక చిఱుదీపిక వెలుఁగుచున్నది. అది మండువేసఁవి యగుటచే నాగమనాయకుఁడు పైయంతస్తుననున్న యొక పటకుటీరమున నమర్చిన మృదులతల్పముపైఁ బరుండెను. కాని యెంతసేపటికిని నాతని కొకక్షణమైనఁ బట్టలేదు! అప్రయత్నముగ నాతఁడు తల్పము వీడి క్రిందికిదిగి యటునిటుఁ బచారుచేయసాగెను. క్రమక్రమముగ నాతఁడు వడివడిగ నటునిటుఁ బచారుచేయ మొదలిడెను. భోజనానంతర మాతనికిఁ జంద్రశేఖరపాండ్యుఁడు సకుటుంబముగ విద్యానగరము పాఱిపోయినట్లు తెలిసినది! ఆతఁ డావార్త తెచ్చిన గూఢచారునినైౖ పోకయరగడియవఱకును నట్లే చూచుచు నిలువఁబడెను! ఆతని కప్పటినుండియు మనసు మనస్సులో లేదు!

నాగమనాయకుని హృదయమున ననేకాలోచనాం పరంపరలు బయలుదేఱుచుండెను! అతఁడు దుర్మార్గుఁడని యనుట కెవ్వరును సాహసింపరు! పైఁగ నాతఁడు పరమశివభక్తుఁడు!

పాండ్యరాజ్యాధికారము వహించినప్పటినుండియు, నాతఁడు శ్రీమీనాక్షీసుందరేశ్వరుల దేవాలయములకుఁ జేసిన దానములకు మితిలేదు! పాండ్యమున నాతని ధర్మకార్యాసక్తి ప్రశంసింపనివారు లేరనుట యతిశయోక్తి కాదు! ఉత్సవసమయముల యం దాతఁడు స్వయముగ వచ్చి శ్రీసుందరేశ్వరుని పల్లకీ మోయుచుండును! కాని యర్చకులును, సామంతులును, బలవంతముగ నాతనిచేతినున్న యాపల్యంకికాదండము లాగుకొనుచుందురు! ఆతనికిఁ బాండ్యుఁడు విద్యానగరమునకుఁ బాఱిపోయెనని తెలిసినప్పటినుండియు వాని నొక్కచూపుతో దహించునంత క్రోధము వచ్చెను!

పాండ్యుఁడంత రహస్యముగ విద్యానగరమునకుఁ బాఱిపోయి, తలదాఁచుకొనవలసినంత యవసర మేమివచ్చినది! ఆతఁడు ప్రత్యేకముగఁ బాండ్యునికిఁ జేసిన యపకార మేమియున్నది! ఆతఁడు నిశ్శేషముగఁ బాండ్యుని శత్రువులను హతమార్చినాఁడు! ఆపైఁ బాండ్యుని ప్రార్థనముపై మధురలో సుమారొక మాసమురోజులవఱకును నుండి పాండ్యుని పాళియగాండ్ర నందఱిని బాదాక్రాంతుల నొనర్చినాఁడు! చంద్రశేఖరుఁడు వీరశేఖరు నోడించిన తరువాతఁగూడఁ దనకు రాజ్యమక్కఱలేదనియుఁ దనకు మర్యాదగఁ గాలక్షేపము చేసికొనుటకుఁ దగిన యేర్పాటు చేయించినఁ జాలుననియు చాలసారు లన్నాఁడు! ఆతనికి ధనదారిద్ర్యము కలిగినపుడు నాగమనాయకుఁ డడ్డుపడనిచో నింక దిక్కేమున్నది! మాటవరుసకు

సార్వభౌములు పాండ్యునికి మధురారాజ్య మిప్పింతుమని యన్నారనియే యనుకొందము! ఆసమయమున నాయన యావిధముగఁ జెప్పక మఱియొక విధముగ నెట్లు చెప్పఁగలరు? ఆవిధముగఁ జెప్పుట కేవలమును రాజనీతియే! పోనీ! ఒకవేళ నాయన త్రికరణశుద్ధిగఁ బాండ్యునికి రాజ్యమిప్పింపవలయు నని తలఁచినారనియే యనుకొందము! సార్వభౌముని కీపాండ్య రాజ్యకల్లోల మంతయు నేమి తెలియును? ఇచ్చటి సంగతి సందర్భములు తెలిసిన వారెవ్వరైనఁ బాండ్యునికిఁ దిరిగి రాజ్య మిప్పించుట కంగీకరింతురా? అట్లిప్పించిన మరునాఁ డాతని చేతిలోని రాజ్యమెవరో యొకరు తన్నుకొనిపోవరా? ఇంత శ్రమపడి చోళులతో వైరమునకుఁగూడ వెనుదీయకుండ, నీపాండ్యరాజ్యము స్వాధీనపఱచుకొనుట, కేవలమును ప్రజా సంక్షోభము తెచ్చిపెట్టుట కొఱకేనా? పాండ్యరాజ్యము పరాధీనమయినచో సామ్రాజ్యపుఁ బునాదులు నిలుచుట కేమైన నవకాశమున్నదా?

పాండ్యుఁ డన్నఁ బాళియగాండ్ర కెవ్వరికిని సరిపడదే! అసలు, వారీతనిపై నయిష్టముచే వీరశేఖరునికి రహస్యముగ సహాయముచేసి, యీతనిని రాజ్యమునుండి తఱిమివేసిన విషయ మెవ్వ రెఱుఁగరు? ఇన్ని జరిగినను గూడఁ బాండ్యుని కింకను బుద్ధి రాదే! ఎంతసేపును "రాజ్యము ప్రశాంతముగా నున్నది! ఇఁక నొకరి ప్రేక్ష్య మక్కఱలేకుండ స్వయముగఁ బరిపాలించు

కొనవచ్చును!" అను నీయుబలాటమేగాని, యింములోని కష్ట నిష్ఠురములేమియుఁ దెలియవే! గోరుచుట్టుపై రోఁకటిపోటు వలె, నీతని రాజ్యార్హతవిషయమున వివాదముకూడ నొకటి వచ్చిపడినదిగదా! ఒకవేళ నీతఁడు రాజ్యముచేయఁ బ్రారంభించినచో నీకుఁ జోళులీతనికి నిద్రపట్టనిత్తురా? ఈసందర్భములోఁ జంద్రశేఖరుఁడు, తనకు మర్యాదాభంగము కలుగకుండ నేర్పాటు గావింపఁబడినపుడది యనుభవించుచు సుఖముగ నెందు కుండఁగూడదు? సార్వభౌమునితో నాగమనాయకునిపై చాడీలు చెప్పినంతమాత్రమున నాయన యవియన్నియు విశ్వసించునా? ఇంతకును నాగమనాయకుఁడు సార్వభౌముని మభ్యపెట్టిన దేమున్నది? చక్రవర్తి నాగమనాయకుని సంగతి యెఱుఁగరా!

చంద్రశేఖరుఁ డింత హఠాత్తుగఁ బాఱిపోవలసిన యవసర మేమి వచ్చినది! నిజముగ నాగమనాయకుఁ డాతని కపకారము చేయఁదలఁచిన నడ్డుకొనఁగలవా రెవ్వరైన నున్నారా? అయినచో నెందుల కీరహస్యపలాయనము! ఇంతకును జక్రవర్తికిని, మహామాత్యునికిని నీవిషయమునఁ దెలియనీయకుండ దాచివేసిన దేమున్నది? తాను మధురలో నల్లకల్లోలము లడఁచుట కింతకాల ముండవలసివచ్చినదని మహామాత్యునికిఁ దెలియఁ బఱిచినాఁడే! సరే! పాండ్యుఁడు తాను చేసినదాని కంతటికిని ప్రతిఫల మనుభవించితీఱును! ఎంత జిత్తులమారికి

తనము! ఈమాత్రపుఁదెలివి మఱియెవ్వరికిని లేదనుకొన్నాఁడు కాఁబోలును!

నాగమనాయకునిహృదయమున నాయర్ధరాత్రమునఁ బాండ్యరాజ్యవివాదమునకు సంబంధించిన సమస్తవిషయము లును, బూర్తిగ నవలోకితము లయ్యెను. ఆతఁడు చర్చించిన విషయములే మరల మరలఁ జర్చింప మొదలుపెట్టెను. అప్పటికిఁ దెల్లవాఱుజాము సమీపించెను. మధురా పట్టణమున నచ్చటచ్చటఁ గుక్కలు మొఱుగుధ్వను లస్పష్టముగ వినవచ్చుచుండెను. ఒక గబ్బిలము మాతని శిరోభాగమునుండి యెగిరిపోయినది! దూరమున వైగైనదీతీరమునుండి యస్పష్టముగ మండుచున్న చితాగ్నిజ్వాలలు కానవచ్చుచున్నవి! ఆవెలుఁగులలో నప్పుడప్పు డటునిటు దోఁక లాడించుచుఁ బోవుచున్న నక్కలు కూడఁ గానవచ్చుచున్నవి! చూచుచుండఁగ నాతనికనుల యెదుట నొకనక్షత్రము రాలి క్రిందబడెను! నల్లని కారు చీఁకటి వెనుకనుండి యాతనియెడలు నాకుచున్నట్లు తోఁచెను. నాగమనాయనికన్నులు బరు వెక్కెను. ఆతఁడు తల్పమున మేను వాల్చి, కొంతసేపు నక్షత్రములవైపు శూన్యదృష్టితో నవలోకించుచు మేలుకొనియుండెను. ఆపిమ్మట దుస్స్వప్ననివారణమునకై రామాదివీరులను ధ్యానించుచు నటునిటుదొర్లుచుఁ గొంతసేపటికి కెల్లెట్లో నిద్ర పోయెను. జుమ్మ్మను కీచురాళ్ళ మ్రోత యను మహాశ్రుతిలోఁ బ్రాపించిక నినాదము

లన్నియు, మంద్రాతిమంద్రమగు నేదో రాగాలాపనమువలె వినిపించినవి.

---

## ౧3

ఈవేళసాయంత్రము మీనాంబిక చేసికొను నలంకరణమున కంతు కనఁబడలేదు! అసలీమధ్య నామె క్షణక్షణమును నతి నూతాన్నలంకారములతో నలంకరించుకొనుచున్నది. ఆచీర కాదని మఱియొక చీర! ఆ తాటంకములు కావని మఱియొక మంజీరములు! ఆమంజీరములతో నొకటి రెండడుగులు నైచి "అబ్బే! పీనిచిఱుమువ్వ లోటిపలుకు పలుకుచున్నవి! ఇవి బాగుగ లేవు!" అని మఱియొక యందెలజంట కాలికిఁ బెట్టుకొన్నది! ఆపిమ్మట నామె వీణియ చేతఁ బట్టుకొని తంత్రులు శ్రుతి చేయ నారంభించినది! కాని యీనాఁ డెంత సేపటికిని శ్రుతి కుదరలేదు! ఆమె "పాడుతీఁగలు పాఁతపడి పోయినవి!" అని విసుగుకొనెను! తరువాతఁ గొంతసేపటి కెట్లో శ్రుతులన్నియు సరియయినవి. ఆమె మెల్లగ వీణ నాయింప మొదలుపెట్టినది. ఇంతలో నామెచెలికత్తె మూర్తమాంబ లోపలికి వచ్చి కన్నులు పెద్దవి చేసి "మీనా! మీబావ వచ్చి

నారు!' అన్నది. మీనాంబిక వీణ వాయించుట యాపి యామె కేసి చూచి "నిజమే!" అని ప్రశ్నించెను.

"నిజమేనే!"

"ఉత్తది"

"కాదే! నిజముగ వచ్చినారే"

మీనాంబిక కపోలములపై లజ్జారేఖలును గన్నులపైఁ గ్రోధరేఖలును నొక్కసారిగ నృత్యము చేసినవి! ఆమె చటుక్కున "అయినచో నే మందువు!" అనియెను. మూర్తమాంబ "పోనీ! నాకేమి! ఇదిగో! నిన్నుఁ దీసికొనుపోవుటకు మీయమ్మగారే వచ్చుచున్నారులే!" అని తటాలున లోపలికిఁ బోయెను. మీనాంబికకు విశ్వనాథనాయకుఁడు నిజముగ వచ్చెనేమో యని కొంచె మనుమానము గలిగినది! మూర్తమాంబ వెళ్ళిన తరువాత నామె మనస్సుండఁబట్టలేక వీణయ క్రిందఁబెట్టి యొకసారి గుమ్మమువఱకును బోయి చావడిలో నెవరైన నున్నారేమో యని తొంగితొంగి చూచినది! వెంటనే తలుపువెనుక దాఁగిన మూర్తమ్మ మీనాంబిక వెనుకనుండి పకపక నవ్వసాగినది! మీనాంబిక యామెను బట్టుకొని గిద్దెడునూనె యింకునట్లొక మొట్టికాయ మొట్టవలయునని చూచినది! కాని యామె చంగున దాఁటి మీనాంబికకు దొరకకుండఁ దప్పించుకొని పాఱిపోయినది! మీనాంబిక కొంతదూర మామెవెంటఁ బరువెత్తినది! కాని యామె దొరకకుండఁ దప్పించుకొని పాఱి

పోవుచు నామెను జూచి విరగఁబడి నవ్వసాగినది! మీనాంబిక యింకఁ బరువెత్తలేక, రోజుకొనుచు నామె కేసి తన్నని చూపించి "సరేలే! యింక నెప్పుడును నాచేతికి దొరకవా!" అనెను.

మీనాంబిక చెదరిన యలంకారములును, ముంగురులును యథాప్రకారముగ సవరించికొని మరలవచ్చి కూర్చుండి వీణ వాయింప మొదలు పెట్టెను. అప్పటి కప్పుడే బాగుగఁ జీకఁటి పడినది. దాసి సూర్యాస్తమానము కాఁగానే మీనాంబికదగ్గఱ నొకదీప ముంచిపోయెను. సూర్యకాంతి యున్నంతవఱకును నాదీపము లేనట్లే కనఁబడెను. కాని క్రమక్రమముగ దానిప్రకాశ మెక్కు వయ్యెను. మూర్తమాంబ వెనుకఁ బరువెత్తుటచే నలసిన యామెముఖమున మకుళించిన ప్రసన్నభావము మరల వికసింపసాగినది! ఆమె నేఁడు జయదేవుని యష్టపదులలో "యామిహే! కమిహ శరణం!" అను గీతము పాడుచున్నది. తదియచంద్రుఁడాభవనోద్యానమునఁ జెట్లకొమ్మలవెనుకనుండి తొంగి, తొంగి చూచుచు నాపాట వినుచుండెను. భవన మంతయు దీపకాంతులతోఁ దళతళ లాడుచుండెను. క్రమముగా వేంకటాంబయు మూర్తమాంబయుఁగూడ నచ్చటి కరుదెంచి యామెగానము వినసాగిరి. ఇంటనున్న యొక రిద్దఱు దాసీలుకూడ నచ్చటి కరుదెంచి ద్వారముల కవ్వల నిలుచుండి యాగానామృతము గ్రోలసాగిరి.

ఇంతలో విశ్వనాథనాయకుఁడు మెల్లగ లోని కరుదెంచి యచ్చటనున్న యొక మయూరాసనముపైఁ గూర్చుండెను. వీధిలో నున్నప్పుడే యావీణావాద్య మాతనికి వినిపించెను. ఆతఁడు చావడిలోనికి వచ్చి చూచుసరి కందఱును నాప్రక్క నున్న గదిలోఁ గూరుచుండి గానతన్మయతలో మునిగిపోయి యుండిరి. ఆతనికిఁ దనమూలమున వారి కానందభంగము గలుగుట యిష్టము లేకపోయెను. ఆకారణమున నాతఁడు వారికిఁ గనఁబడకుండునట్లు కూర్చుచుండెను. దీపపువెలుతురులో నాతని కాలోపలఁ గూర్చున్నవా రందఱును సుస్పష్టముగఁ గానవచ్చుచుండిరి. దీపికా కాంతిలో సముజ్జ్వలశోభలతో వెలుఁగొందుచున్న మీనాంబికముఖములో నాతని కీనాఁ డొక యలౌకికమగు దివ్యసౌందర్యము గోచరించెను. ఇన్నాళ్ళనుండియు నాతని కింత సౌందర్య మెప్పుడును గోచరింపలేదు! ఆమె మృదులాంగుళులు రెండును ద్వరితగమనముతో నటు నిటుఁ బరువెత్తుచు నృత్యము చేయుచుండెను. ఆమెశరీరకాంతి వీణపైఁ బ్రసరించుటచే నదియంతయు స్వర్ణమయమయినట్లుండెను. విశ్వనాథుఁ డాసంగీతము వినుచు నర్ధనిమీలితనేత్రములతో నటులే కూర్చుండియుండెను. ఆతనికి వీణపై బంగారు సంగీతతరంగము లుప్పొంగుచున్నట్లు కనఁబడెను. తరువాతఁ గ్రమక్రమముగ బాహ్యపదార్థజాల మంతయు నొక మధుర సంగీతసముద్రములోఁ గరగిపోయినది! ఆసమయమున నాతని హృదయమున వీణాస్వరములు తక్క నిఁక మిగిలిన బాహ్య

పదార్థజాల మంతయు నదృశ్యమై హృదయాంతరమున విలీనమై పోయినటు లుండెను.

మీనాంబిక "యామిహే! కమిహ శరణం!" అనుచరణ మెంతో మనోహరముగఁ బాడెను. ఆచరణము పాడుచున్నప్పు డామె కనుఁగొలుకులనుండి యొకటి రెండు కన్నీటి బిందువులు నేలపైఁ బడెను. వేంకటాంబిక యది యామెభక్త్యుద్రేక మనుకొని యెంతయు నాశ్చర్యపడెను. మూర్తాంబిక యదిచూచి కపోలము లెఱ్ఱపడునట్లు సిగ్గుపడి తల వంచుకొనెను. అటు పిమ్మట మీనాంబిక వల్లకీవాద్య మాపివేసెను! ఆమె మెల్లగ వల్లకీవాద్యము ముగించునప్పుడు విశ్వనాథుని కనుల యెదుట నున్న బాహ్యప్రపంచ మంతయు, మరల మూర్తిమంత మగు చున్నట్లు కానిపించెను. సంగీతాంతమున నాతఁ డొకనిట్టూర్పు విడిచి లేచి నిలుచుండెను.

అంతలో గుమ్మముదాఁటి యివతలికి వచ్చిన మూర్త మాంబ యాతనిని జూచి, లోపలికిఁ బరువెత్తెను! వేంకటాంబ వెంటనే గుమ్మము దాఁటివచ్చి యాతనివైపు కటాక్షణకాలము చూచి యిట్లనెను.

"నీ వెంతసేపైనది వచ్చి?"

"అబ్బే! ఎంతోసేపు కాలేదు!"

"మే మెవ్వరమును జూడనే లేదు!"

"అవును. మీ రందఱును దన్మయులై యానందించు చున్నారు!"

"నీవు స్సాయంకాల మెంత సేపటికిని రాకపోవుటచే నిక నీవేళకు రా వనుకొన్నాము."

"అవును! అసలు నే నీవేళ నిచ్చటికి రావలయునని యనుకొనలేదు. కాని మధురనుండి యొకకబురు వచ్చుటచే నిచ్చటికి వచ్చినాను."

"అటులనా? అందఱును క్షేమముగ నున్నారా!"

"ఆఁ! క్షేమముగనే యున్నారు! మధురలో మానా యనగారు శ్రీ మీనాక్షీసుందరేశ్వరులకు మాసశివరాత్రి మహోత్సవము చేయుచున్నారఁట! రామభద్రము మా మయ్యగారు నన్ను మీఁయురుపురిని, మాయమ్మగారిని వెంటఁ బెట్టుకొని రమ్మన్నారు! ..కాని విద్యానగరము విడిచి నేనెట్లు రాఁగలను! నా కీయధికారము వచ్చినప్పటినుండియుఁ దిన్నగ నూపిరి పీల్చుకొనుటకుఁగూడ వీలు లేకుండ నున్నది!"

"ఇన్నాళ్ళనుండియు వారిదగ్గఱనుండి కబు రేమియుఁ దెలిసినది కాదు! క్రిందటికమ్మ వచ్చి యప్పుడే యొకమాసము రోజులు కావచ్చినది! ఒక కాతుచేఁ గొంచెము కబురుగూడఁ బంపించుటకు వీలు లేకపోయినదా? వారి కిల్లు కదలినచో నిఁక యింటిమాటే జ్ఞాపక ముండదు!"

"అవు నవును! మహామంత్రులుగూడ నీవిషయమునఁ గొంతకళవళపడినారు! మానాయనగారిదగ్గఱనుండి యెంత సేపును "మే మిచ్చటియల్లకల్లోలము లడఁచుట కింకను గొంత కాల ముండక తప్పదు" అనియే సమాధానము వచ్చుచున్న

దఁట! "కోట స్వాధీన మయినతరువాతఁగూడ నింత యాలస్య మెందుల" కని వారిప్రశ్న. అక్కడవ్యవహారము లెటులున్నవో యెవరు చెప్పఁగలరు? నాకుఁగూడ వారిదగ్గఱనుండి లేఖ యేమియు రాలేదు. మేమందఱమును గొన్నిరోజు లెంతో కంగారు పడినాము."

"హాసీ! అందఱును క్షేమముగ నున్నా రనుమాట తెలిసినది! అదియే పదివేలు! మఱి నీవు రాఁకపోయినచో మేమెట్లు పోఁగలము!"

"ఏమియు భయము లేదు! నేను మీరు తలపూవు వాడకుండ మధురఁ జేరుకొను నేర్పాటు లన్నియుఁ గావించె దను!"

"మే మెప్పుడు బయలుదేఱ వలయును."

"రేపు సోమవారమే మాసశివరాత్రి కావున మీరు తెల్లవారుజామున నే బయలు దేఱవలయును. మధుర చేరుట కెంత తొందరగఁ బోయినను నధమపక్షము నాలుగైదు దినము లైనఁ బట్టునుగదా!"

నీ వెటులైనను బోయి చక్రవర్తియనుమతి తీసికొని మధుర వచ్చినచో బాగుండును! రాయలు నీవు మధురవచ్చుట కంగీకరింపరా?"

"అస లీవిషయమున వారిని దర్శించుటకే భయముగా నున్నది! ఇంత కార్యభారము నా నెత్తిపైఁ బెట్టిన తరువాత నేనే మొగము పెట్టుకొని వారిని సెల విప్పింపవలసినదని కోరఁ

గలను! ఈవిషయములో మాత్రము మీరు నన్ను మొగమోట పెట్టవలదు!"

"సరే! నీ వటులనుచున్నప్పుడింక నేనేమి చెప్పఁగలను! అప్పుడప్పుడు మీక్షేమసమాచారములు తెలియఁజేయుచుండుము! ఇఁక మీయమ్మగారితోఁ జెప్పి వెళ్ళుట కవకాశము లేదు! ఆమెతో మేము నిలుచున్న పాటున మథుర వెళ్ళవలసి వచ్చినదని చెప్పుము."

"అట్లే!"

విశ్వనాథుఁడు బాగుగఁ జీఁకటి పడినదని తొందరగ బయలుదేఱి యింటికిఁ బోవలయునని తలఁచి వేంకటాంబతోఁ జెప్పి బయలుదేఱఁ బోయెను. కాని యామె "ఒక్కనిమిష మాగుము! నాయనా! మీనాంబిక నీకై యొక విరజాజిపూల దండ గ్రుచ్చినది. పాపము! నీవు సామాన్యముగా వచ్చు వేళకు రాలేదని యెంతో చిన్నబుచ్చుకొన్నది. అది తీసికొని వెళ్ళుదువుగాని!" అనిచెప్పి "అంబికా! దండ తీసికొనిరా! అమ్మా! మీబావ కిత్తువుగాని!" అని పలికెను. ఆమాటవిన్న మీనాంబిక సిగ్గుపడి, తల వంచుకొని నిలుచున్న చోటనే నిలుచుండిపోయెను. కాని మూర్తమ్మయామెను నిలుచుండ నీయ లేదు! ఆమెచేయి పట్టుకొని బలవంతముగా జావడిలోని కీడ్చుకొనిపోయినది! వేంకటాంబ "గ్రుచ్చినదండ మీబావ కిచ్చుట కంత సిగ్గెందుకు! తల్లీ!" యనెను. మీనాంబిక యెట్లెట్లో విరజాజిదండ విశ్వనాథుని కిచ్చెను. విశ్వనాథుఁడా దండకై

దోసిలి యొగ్గి యతిభక్తితో స్వీకరించువానివలె నిలువఁబడెను. వేంకటాంబిక యాతనిక్రొంజెతనము చూచి లోలోపల నవ్వుకొనెను. విశ్వనాథుఁ డావిరజాజిదండ తీసికొనఁగనే మూర్తమాంబ ముసిముసినవ్వులు నవ్వుచు మీనాంబికకేసి చూచి "యింక తమపని యయిపోయినది! తమరు వెళ్ళవచ్చును' అనియెను. ఆమాటపై మీనాంబిక ముగ్ధాననము పద్మరాగమువలె నెఱ్ఱవడెను. ఆమె చెలికత్తెవైపొకటి రెండు చుఱుకు చూపులు చూచి "చాలులే! నేర్చితివి!" అనిపలికి చివాలున లోపలికిఁ బోయెను. విశ్వనాథనాయకుఁ డామెవైపు చూచి యొక చిఱునవ్వు నవ్వి పెన్నిధానమువలె నావిరజాజిదండ చేతఁ గైకొని వేంకటాంబకడ సెలవు తీసికొని వీధిలోనికి వెడలి పోయెను.



## ౧౪

విశ్వనాథుఁడు స్వభవనమునకు వచ్చి యుష్ణోదకస్నానము చేసి, తల్లి యాప్యాయముగ వడ్డించుచుండ సగము సగము పరధ్యానముతో భోజనము ముగించెను. తల్లి యాతని పరధ్యానము చూచి యచ్చెరువందెను. ఆమె సామాన్యముగ సాయంత్రము భోజనమువేళ నాతనిని "నాయనా

మథురనుండి నర్తమాన మేమైన వచ్చెనగా?" అని యడుగు చుండును. ఈరోజునగూడ నామె యటులే ప్రశ్నించెను. అతఁడామెకు నాగమనాయకుని క్షేమ మెఱింగించి, వేంకటాంబ యామెతోఁ జెప్పుమన్న విషయము చెప్పెను. ఆమె యది విని యొక నిమిషమువరకును దెల్లఁబోయి మెల్లగ నిట్లనెను.

"అంత నిలుచున్నపాటున నెళ్ళవలసిన పని యేమి వచ్చినది నాయనా!"

"అక్కడ బాబయ్యగారు మీనాక్షీసుందరేశ్వరులకు మాసశివరాత్రిమహోత్సవము చేయించుచున్నారట! రామభద్రముమామయ్యగారు నన్ను వారికుటుంబమును, నిన్నును దీసికొని రమ్మని కబురు పంపించినారు. ఇంతసేపటినుండియుఁ బరాకుపడి యీమాట చెప్పుట మఱచినాను. రేపు తెల్లవారు జాముననే ప్రయాణము! నేనువచ్చుటకు వీలు లేదుగదా! అందుచేత మనపిన్నిగారియబ్బాయికిఁ గొంతసైన్య మిచ్చి మీతోఁ బంపించెదను. అతఁడు మిమ్ములను సురక్షితముగ మథుర తీసికొనిపోవును!"

విశ్వనాథునితల్లికి దైవభక్తి యెక్కువ! సంవత్సరమున కాఱుమాసము లామె తీర్థయాత్రలు సేవించుచుండును! ఈ ప్రయాణములో నామె దక్షిణదేశ పుణ్యతీర్థము లన్నియు సేవింపవచ్చునని తలఁచెను. ఆయుత్సాహమువలనఁ బ్రయాణ సమయమువఱకును నామెకు నిద్రయే పట్టలేదు! విశ్వనాథ

నాయకుఁడు తెల్లవాఱుజామున లేచి తల్లిని, వేంకటాంబా మీనాంబికలను బ్రయాణము చేయించి, విద్యానగరదుర్గము దాటువఱకును సాగనంపెను. ఆపమ్మట సయిదాఱురోజులు గడచిపోయెను. నాగమనాయకునిభవనమున నిప్పుడు విశ్వనాథ నాయకుఁ డొక్కఁడే నివసించుచుండెను. భోజనమునకుమాత్రి మాతఁడు తనపినతల్లిగారి యింటికిఁ బోయి వచ్చుచుండెను.

రాత్రి యాతఁడు భోజనముచేసి పైయంతస్తుపైఁ బరుండెను. ఇంట నౌకరిద్దఱు సేవకులు తక్క నింకెవరును లేకపోవుటచే భవనమంతయు నిశ్శబ్దముగా నుండెను. దాసి సూర్యాస్తమానము కాఁగానే పైయంతస్తుపై శయ్య యమర్చి యొక చిన్నదీపిక వెలిగించి వెడలిపోయెను. విద్యానగర కోలాహల మాతనిచెవులలో వఱద వచ్చిన యొకమహానదీ ప్రవాహపు ధ్వనివలె వినఁబడసాగెను. అతనిచుట్టును మనోహరములగు ప్రాసాదములును, దేవాలయములును దీపికాలంకృతములై కన్నులపండువు చేయుచుండెను. కొన్నిసౌధములనుండి మధురమధురములగు వీణావేణుమృదంగధ్వనులు వినవచ్చుచున్నవి. అచ్చటచ్చటఁ బట్టణమధ్యమునసున్న యుద్యానవనములలోఁ దలక్రిందుపక్షులు జెపజెప ఱెక్క లాడించుచుఁ గీచుగీచు మనుచున్న ధ్వనులు వినఁబడుచున్నవి.

క్రమక్రమముగా నర్ధరాత్రి కావచ్చెను. ఆతని చెవులలో వినఁబడుచున్న యామానవసముద్రఘోష క్రమక్రమముగా సన్నగిలసాగెను. ఇంతవఱకును నాకాశమున వాయు

ప్రసారము లేదనియే చెప్పవచ్చును. కాని యిప్పుడు పిల్లగాలులు నిట్టూర్పులు బయలుదేఱునటులు మెల్లమెల్లగ వీవఁ దొడఁగెను. దేవాలయ గోపురముపైఁ బెట్టిన ప్రమిదలలోని నూనె యయిపోవుటచే నందున్న దీపికలు సన్నగిల్లి యొకటొకటిగఁ గొండయెక్కఁ జొచ్చెను. దూరమున నప్పుడప్పుడు రాయలయశ్వశాలనుండి యొకటి రెండు సకిలింతలు వినఁబడెను. నాగమనాయకుని భవనోద్యానమునఁ బరిమళములపహరించిన యొకటి రెండు మలయమారుతతరంగములు విశ్వనాథుని యొడలు పులకరింపఁ జేసెను.

ఆపరిమళ మాఘ్రాణింపఁగనే విశ్వనాథునకు మీనాంబిక యిచ్చిన విరజాజిపూలదండ జ్ఞాపకము వచ్చెను. అది యిప్పుడు పూర్తిగ వాడిపోయినది. అయినను నాతఁ డొకసారి తనమెడలోనున్న యాదండను తీసి చేత నుంచుకొని దీపము వెలుతురులో కనుఱెప్ప వేయకుండ దానివైపు చూచుచుఁ గూరుచుండెను. ఆతని కొక్కమాఱుగ నామె మొదట నాదండ యిచ్చినపు డాఘ్రాణించిన పరిమళమంతయు ననుభవించినట్లయ్యెను. ఆదండలోని ప్రతిపుష్పమును నామెహస్తాంగుళుల స్పర్శసుఖ మనుభవించినది! ఆపిమ్మట నాతనికెదురుగ లజ్జారుణకపోలములతో నామాలిక గ్రుచ్చుచున్న యామెసుందరమూర్తి కన్పట్టెను! ఆహా! నిజముగఁ జెవ్వప్పనాయకుఁ డెంతటి భాగ్యశాలి!

' రామభద్రనాయకుఁ డామెను జెవ్వప్పనాయకుని కిచ్చి వివాహము చేయుననుటలో నేమియు సందేహము లేదు! ఆ విషయము విశ్వనాథునికిఁ దెలియును! అదియాతని హృదయమునకు మఱింత వేదన కలిగించెను. విశ్వనాథనాయకుఁడు నుదుటిపై హస్తముంచి "అయ్యో! నాకన్నులకీమె యెంద లకుఁ గనఁబడినది! ఈమెనుబూర్తిగ మఱచిపోయినచో నెంత బాగుగ నుండును!" అని యనుకొని మఱియొక విషయమును గూర్చి యోజింప మొదలుపెట్టెను! కాని మఱుసటిక్షణములో నామె యాతని కెదురుగ నిలువఁబడి చిఱునవ్వు నవ్వుచున్నట్లు కనఁబడెను! ఆతఁ డొకటి రెండు సారు లప్రయత్నముగ "మీనాంబిక, మీనాంబిక" యని యుచ్చరించెను. వర్ణములలో నామెనామధేయమునందలి యచ్చులును హల్లులును నాతనికత్యంత మధురములుగఁ గన్పట్టెను! ఆతఁడు మరల మరల "నిజముగఁ జెవ్వప్పనాయకునివంటి భాగ్యశాలి. యీ లోకమున నింకెవఁడును నుండఁబోఁడు!" అని యనుకొనెను. అనంతర మాతని కనుగొలుకులలో రెండు కన్నీటిబిందువులు మెఱసి క్రమక్రమముగఁ బెద్దవై కపోలములపై మెల్లగ దిగజారినవి!

అయినను నాతనికి వేంకటాంబ యావిషయమై యొక ఆశాజ్యోతివలెఁ గనఁబడెను! మీనాంబిక వివాహవిషయమున వేంకటాంబ కేమైన నధికార మున్నచో, మీనాంబిక యాతని దన్నమాటే! వేంకటాంబ కాతనిపై నెంత వాత్స

ల్యము! వేంకటాంబకు రామభద్రనాయకునిమనస్సు తెలియును గదా! అయినను వేంకటాంబ దన్నల్లుని గౌరవించినట్లెందు లకు గౌరవించుచున్నది? అది కేవలమును వాత్సల్యమేమో! మీనాంబికగూడ నాతనిని జూడఁగనే యానందతరంగము లలో నోలలాడుచున్నట్లుండును! నిజముగ నది వలపా! లేక ముగ్ధాసహజమగు సమాయికత్వమా? ఏది యెట్లున్నను నాగమ నాయకునికిని రామభద్రనాయకునికిని బ్రాణస్నేహమని లోకు లందఱును ననుచుందురు. నిజముగ నాగమనాయకుఁడడిగిన చో రామభద్రనాయకుఁడు కాదనుటకెన్నఁడును సాహసింపఁడు! ఇందులో సందేహమేమియు లేదు! అయినచోఁ దండ్రియే రామభద్రనాయకు నడిగించినచో నాతఁడు కళ్ళకద్దుకొని మీనాంబికను దన కిచ్చి వివాహము చేయును! ఇక జెప్పేప మాటా! మీనాంబికనిచ్చి పెండ్లి చేయుకున్నచో నాతనికిఁ కఁ బెండ్లియే కాదా!

ఇంతలో దాసి యాతనిసన్నిధి కరుదెంచి పాండ్యస్థానా పతులట! అత్యవసరముగ మీదర్శనము చేయవలెననుచు న్నారు! అనెను. విశ్వనాథనాయకుఁ డత్యాశ్చర్యపడి 'పాండ్య స్థానాపతులా! లోపలకు రమ్మనుము!' అని పలికెను. వెంటనే యది పోయి యొకవృద్ధుని లోనఁ బ్రవేశపెట్టెను. విశ్వనా థుఁడు శయ్యదిగి యాతని కెదురేగెను. ఇరువురును నేలపై బఱచిన రత్నకంబళముపైఁ గూర్చుండిరి. విశ్వనాథనాయకుఁడు

'నేను తమదర్శన మెప్పుడును జేయలేదుగాని, తమపేరు విన్నాను. పెద్దనామాత్యు లెప్పుడును దమవిషయమే చెప్పు చుందురు! ఈచిట్టికంబళముపై దమ్ముఁ గూర్చుండఁ బెట్టి నందులకు మన్నింప వేఁడుకొనుచున్నాను" అనెను. ఆవృద్ధు డాతని రెండుహస్తములును బట్టుకొని 'నాయనా! ఎంతమాట! నీవల్లనఁగూడదు!" అనియెను. ఆవృద్ధునికి డెబ్బదియేం డ్లుండ వచ్చును. సన్నగ బక్కపలుచగ నున్న యాతనిశరీరమున నొక పలుచని యంగీ వ్రేలాడుచుండెను. ఆతనిచెంపలు పెద్దవి. కన్నులుచిన్నవి. కన్నులవైపు చూచిన నాతఁడు మాటిమాటి కిని గంట నీరు పెట్టుకొనువానివలెఁ గానవచ్చెను. చామన చాయగ నున్న యాతని బాహువులకండరములు వదులు వదులుగ వ్రేళ్ళాడుచుండెను. ఆతఁడు గద్గదికతో "నాయనా! నీవు నన్నెఱుఁగవుగాని మీబాబయ్యగారు నన్ను బాగుగ నెఱుఁగుదురు. నన్నందఱును వీరరాఘవ నాయకుడందురు." అనెను. విశ్వనాథనాయకుడు "మీవిషయము పెద్దనకవీంద్రులు నాకప్పుడప్పుడు చెప్పుచునేయుందురు! మీకు నేను క్రొత్త వాడనేమోగాని మీరునాకుఁ గ్రొత్తవారు కారు!" అనెను. ఆవృద్ధుడు 'అటులనా! అయినను బెద్దవాడనుగదా! ఏదో చాదస్తము! తెలిసినసంగతులే మరల మరల నడుగుచుందును. అనియెను. క్రమముగ వారిరువురి సంభాషణమును మెల్ల' మెల్లగ సాగిపోయెను.

"మీ రింత పెద్దలుగదా! ప్రత్యేకముగ నాకోసమై పని కట్టుకొని రావలయునా? అవసరమని తెలిపినచో నేనే వచ్చి తమ దర్శనముచేయునా?

"ఇంట నెవ్వరును లేరుగద!"

"ఎవ్వరును లేరు! మీరు నిస్సంశయముగ మాట్లాడ వచ్చును. ఆదాసి యెల్లప్పుడును సింహద్వారమువద్దనే కనిపెట్టు కొని కూర్చుండును!"

"నాయనా! మధురలోఁ గొంప మునిఁగిపోయినది!"

"అదేమి యట్లనుచున్నారు!"

"రామభద్రనాయకుఁడు మీ బాబయ్యగారిమతి విఱిచి వేసినాఁడు!"

"మీమాటలు నా కర్థ మగుట లేదు!"

"పాండ్యుని కీయవలసిన రాజ్యము మీ బాబయ్యగారే యాక్రమించినారు!"

"ఎప్పుడు!"

"ఎప్పు డేమిటి! మొదటినుండియు నారాజ్య మాయన యాక్రమణలోనే యున్నది!"

"సరే! ఆపిమ్మట నేమి జరిగినది!"

"జరుగుట కేమున్నది! పాండ్యుఁడు రాయలవారితో మొఱపెట్టు కొన్నాఁడట!"

"ఎప్పుడు! నే నేమియు నెఱుఁగనే!"

'అవును! నీ కెట్లు తెలియును! వాఁడు మాఱువేషము వేసికొని కుటుంబముతోసహా విద్యానగరమునకుఁ బాఱిపోయి వచ్చినాఁడు!'

"సరే! సార్వభౌములు లే మన్నారు!"

"తత్క్షణమే పాండ్యుని రాజ్యము పాండ్యునికిచ్చి యయిదు రోజులలోఁ దమసన్నిధికి రావలయునని యాజ్ఞాపించినారు!"

"అబ్బా! అంతవఱకును వెళ్ళినదా! ఆపైన?"

"ఆపైన మీతండ్రిగారు రాయలవారి కొక లేఖవ్రాసి పంపించి పాండ్యరాజ్యము తా మనుభవించుట కంగీకరింప వలసినదనియు నట్లయినచో సామ్రాజ్యమునకు సామంతుల ముగా నుందుమనియుఁ బ్రార్థించినారఁట!"

"అయ్యో! ఇదేమి వైపరీత్యము! ఆపిమ్మట!"

ఆతరువాత నావృద్ధుఁడు కొంచెము గద్గదికతో "ఇఁక నే నేమి చెప్పఁగలను! నాయనా! నే నిఁక మధురలో నుండ లేక యచ్చటినుండి సకుటుంబముగ వచ్చివేసినాను!"

"నేను మొన్న మహామాత్యులను దర్శించినాను! వారీ విషయమేమియుఁ బ్రస్తావించలేదే!"

"గ్రంథ మింతవఱకును ముదిరినతరువాత వారెందుకుఁ బ్రస్తావింతురు? మహామాత్యులన్న నేమనుకొన్నావు!"

"అసలు మాబాబయ్యగారి పాండ్యరాజ్యము తమకుఁ యడుగుట యెందులకు వచ్చినది?"

కే నేమి చెప్పఁగలను! నాయనా? అంతయు ముదిరిన

తరువాత వారు నా కీవిషయ మెఱింగించి, తమపక్షములో నుండవలసినదని యడిగిరి. ఎంతసేపును వారు చెప్పునది యిది. తమ రీపాండ్యచోళరాజ్యములు రెండును నష్టకష్టముల కోర్చి జయించినారఁట! పాండ్యుఁ డసలీరాజ్యమునకు వారసుఁడే కాఁడట! ఒకవేళ వానికి రాజ్యమిచ్చినను నది నిలఁబెట్టుకొనుట కసమర్థుఁడఁట! వానికి మధుర యొప్పగించినచోఁ గర్ణాట సామ్రాజ్యమునకే మోసము వచ్చునఁట!"

"అవి యన్నియు మన కెందుకు? వా రెవరికి రాజ్య మిమ్మన్న వారి కిచ్చి, చేతులు కడుగుకొని కూరుచున్నచో నేబాధయు నుండదుకదా!"

"అసలు వారిపట్టుదల వేఱు! నాయనా! చిరకాలము నుండి తమ్ముఁ గనిపెట్టుకొనియున్నందుకు సార్వభౌము లీమధు రారాజ్యము తమకీయఁగూడదా? యని వారియభిప్రాయము!"

"సరే! బాగుగనే యున్నది! మఱి మీా కెట్టుల రాఁగలిగితిరి"

ఈప్రశ్నతో నావృద్ధుని కనులనుండి కన్నీరు ప్రవహింప సాగెను! ఆతఁడు మధ్యమధ్య గద్గదికచే నాగుచు నిట్లు పలికెను.

"నాయనా! ఈవార్థకములోఁగూడ నా కీపాట్లు తప్ప నవి కావు! తిన్నచోటఁ దినక, నిద్రించినచోట నిద్రింపక నా భార్యయుఁ బిల్లలును జీవచ్ఛవములవలె నిచ్చటికిఁ జేరు కొన్నాము. మార్గములో నాగాంబకుఁ బెద్దజ్వరము వచ్చినది.

ఒకప్రక్కను శత్రుభయము! ఒకప్రక్కను రోగభయము! పడరానిపాట్లన్నియుఁ బడినాము!''

"చివరి కంఠమును సురక్షితముగఁ జేసుకొన్నారుగద!"

"ఆ! ఆమీనాక్షిసుందరేశ్వరుల దయవల్లఁ జేసుకొన్నాము! ... ఇంతకును నేను చెప్పవలసినవిషయము మఱచియే పోయితిని! నీవన్న మీనాయనగారికిఁ బ్రాణమనియందురు!నాకిదియంతయుఁ జూడ నేదో ప్రళయము ముంచుకొనివచ్చుచున్నట్లున్నది? నీవు రాయలవారియెడల భయభక్తులతోనుండువాఁడవని నే నెఱుఁగుదును! నీవు పోయి మీతండ్రిగారి నీదుష్టప్రవృత్తినుండి మరలించినచో నీప్రళయము తప్పిపోవును!......లేకపోయినచో నతిత్వరితముగ నొకకమ్మయైన వ్రాసి పంపవలయును! నీవు నాకు దగ్గఱివాఁడవుగదా! యని చనవు తీసికొని యిట్లు చెప్పితిని! నీ వేమియు ననుకొనవని నాకుఁ దెలియును! నాయనా!''

ఆవృద్ధుఁడు మరలఁ గన్నుల నీరుపెట్టుకొనెను. విశ్వనాథనాయకుఁ డతనిని గుఱుతుఁబఱచి, "వెంటనే బాబయ్యగారికొక లేఖ వ్రాయుదు"నని చెప్పి యాతనిని సమాధానపఱచెను. ఆవృద్ధుఁ డంతట మెల్లగ లేచి స్వగృహమునకుఁ బోవుదుననెను. విశ్వనాథనాయకుఁడు సింహద్వారమువఱకును బోయి యాతనిని సాగనంపెను. విశ్వనాథనాయకుఁ డాతనియెదుట నావిధముగ నంతగాఁ జలింపనివానివలె మాట్లాడెనుగాని యీ

వృత్తాంతము వినఁగనే యాతనితలపై నొక పెద్దపిడుగు పడి నటు లయ్యెను! ఆతఁడు రెండుహస్తములతోఁడను శిరస్సు గట్టిగ నొక్కి పట్టుకొని మొదలు నఱికిన తరువువలె శయ్యపైఁ బడెను. ఆతని కారాత్రి యంతయు నొక్కసారియైనఁ గన్నులు మూఁతపడలేదు!

---

౧౫

శ్రీకృష్ణదేవరాయలు "పాండ్యునిరాజ్యము పాండ్యుని కిచ్చి యొక యయిదురోజులలోపుగఁ దన్ను దర్శింపవలసిన" దని యాజ్ఞ పంపించినతరువాత నాగమనాయకుఁడు రాయలతో యుద్ధము తప్పదని నిశ్చయించుకొనెను. అయినను నాతఁ డంతటితో నిరాశ చెందలేదు. రాయలసన్నిధి కొకలేఖ వ్రాసి, దానిలోఁ దాను పాండ్యరాజ్యము జయించినది మొదలది యాక్రమించుకొనువరకును జరిగిన సంఘటన లన్నియు నెఱిఁగించెను. ఆపిమ్మటఁ బాండ్యునియసామర్థ్యము, పాండ్యునికిని బాళయగాండ్రకును గలవిరోధములు మొదలగు విషయము లన్నియు వివరముగ వ్రాసెను. ఆతరువాతఁ దాను చిన్నప్పటి నుండియు రాజవంశమును సేవించిన విషయము లన్నియు నెఱిఁగించి, పాండ్యరాజ్యము తన కీయవలసినదని ప్రార్థించెను.

పాండ్యరాజ్యము తన కనుగ్రహించినచోఁ బూర్వమువలెఁ దాను సార్వభౌముల పాదసేవకుఁడుగ నుందుననికూడ వ్రాసెను. అతఁ డాలేఖ లోకజ్ఞుఁడగు నొక మిత్రుని కిచ్చి యింకను ముఖతః నెఱిఁగింపవలసిన విషయములన్నియుఁ జెప్పి రాయలసన్నిధికిఁ పంపించెను!

అయినను నాతనికి రాయలు తనప్రార్థన మంగీకరించు నను దృఢవిశ్వాసము లేకపోయెను. కావున రాయలతో యుద్ధము చేయుటకుఁ దగుప్రయత్నములన్నియు నొనరించు చుండెను. అసలు నిజముగ నాలోచించినచో నాగమనాయకు నీపాండ్యరాజ్యపంచకములోనికి దింపినవాఁడు రామభద్రనాయ కుఁడు! రామభద్రనాయకునకి, నాగమనాయకుని కొకవిష యము నచ్చఁజెప్పినచో నింక నాతఁ డావిషయము భల్లూకము వలెఁ బట్టుకొను ననుసంగతి బాగుగఁ దెలియును! అందుచే నాతఁడు ప్రతిదినమును నాగమనాయకునికిఁ బాండ్యరాజ్య మాక్రమించుకొనుటలో నధర్మ మేమియు లేదని నచ్చఁజెప్పు చుండువాఁడు! అందుచే నిప్పుడు రాయలతో యుద్ధము తప్ప దన్న విషయము స్థిరపడినతరువాత నాతఁడు నాగమనాయకు నికిఁ గేవలమును గుడిభుజముగనుండి సహాయము చేయసాగెను! మాసశివరాత్రియని వంకపెట్టి తనకుటుంబమును నాగమనాయ కుని కుటుంబమును మధురకుఁ దెప్పించుట కేర్పాటు చేసిన వాఁడుకూడ నాతఁడే! తమకును రాయలకును యుద్ధము సంభ వించినచో నారెండు కుటుంబములును విద్యానగరమున నున్నచో

నేమైన ముప్పు వాటిల్లునని యాతఁడు భయపడెను. అది యుఁగాక విశ్వనాథనాయకునిగూడఁ దమ పక్షమునఁ గలుపు కొనవచ్చునని యాతఁ డాలోచించెను! కాని విశ్వనాథనాయ కుఁడు రాలేదు! వాని పుత్రకుటుంబము లును వచ్చినవి! కాని యేమిలాభము! విశ్వనాథనాయకుని కాతఁ డొక లేఖ వ్రాసి పంపించవలయునని తలఁచెను! కాని తరువాత దానివలన నేమియు లాభము లేదనియు సంతమాత్రముచే విశ్వనాథనాయ కుని దమపక్షమునకుఁ ద్రిప్పుకొనుట కష్టమని యుఁ దలఁచి యాతఁ డా ప్రయత్న మంతటితో విరమించెను.

రామభద్రనాగమనాయకు లున్న పరిస్థితులనుబట్టి, విశ్వ నాథునివలనఁ దమ కంతగా సహాయము జరుగునని యెప్పు డును ననుకొనలేదు! కాని చెవ్వప్పనాయకుని విషయములో మాత్రము వారొక పెద్దయాశ పెట్టుకొని యుండిరి! ఆయాశ యంతయు నిప్పుడు నిరాశ యగునటులఁ గానిపించెను. నాగమ నాయకుఁడు రాయలకుఁ బ్రత్యుత్తరము వ్రాయుచుఁ బాండ్య రాజ్యము తనకిమ్మని వ్రాసినప్పటినుండియు నాతఁడు మధుర వచ్చుట మానివేసెను! నాగమనాయకుఁ డొకటిరెండుమాఱులు కబురు పంపించినపిమ్మటఁగూడ నాతఁ డొక్కసారియు ముఖము చూపింపలేదు! దీనితో నాగమనాయకునికి మిగులఁ గలవరము కలిగెను. ఆతఁ డొకనాఁడు రామభద్రనాయకుని బిలిపించి యటునిటుఁ బచారుచేయుచు మెల్లగనిట్లు ప్రశ్నిం చెను.

'ఇదియేమి! ఈచెన్నప్పనాయకుఁ డెన్ని సారులు కబురు పంపించినను మాట్లాడకుండ నున్నాఁడేమి? వీనికేమైన బెదరు పుట్టినదా?'

'ఏమో మఱి! ఇది నాకును జిత్రముగనే యున్నది! సామాన్యముగ నాతఁ డొకనిశ్చయమునకు వచ్చిన తరువాత నిఁక వెనుకంజ వేయడు!'

'నీవన్నట్లు మహాధైర్యశాలియే కావచ్చును! కాని రాయలతోఁ గలసిమనపై నేమైనఁ గుట్రలుపన్నుచున్నాఁడేమో!'

"అబ్బే! ఆతఁ డట్టిపని యెన్నడును జేయడని నా నమ్మకము!"

'అయినచో మఱి యీయాలుభావ మెందులకు?'

'ఆతనిశరీరములో నేమైన నస్వాస్థ్యముగ నున్న దేమో యని యనుమానముగ నున్నది! సోమయాజులుగారిప్పుడిచ్చ టనే యున్నారా!'

'ఏసోమయాజులుగారు?'

మనతోఁ గలిసి మీనాక్షీసుందరేశ్వరుల దర్శనమునకు వచ్చిన విశ్వేశ్వర సోమయాజులుగారు!'

'ఆఁ! ఆయన యెందుకు?'

'ఆయన నొకసారి తంజాపురము పంపించినచో మన కన్నివిషయములును దెలియును! ఆయన చిన్నప్పుడాతని కోన మాలు దిద్దించినారు! ఆయన యనిన నాతనికిఁ జాలగౌరవము! అదియుఁగాక యాయన మంచిలోకజ్ఞులు!'

'ఓహో! అటులనా? సరే! గాని యాయన మూలమున మనకు వ్యవహార మంతయు మొదటికి రాదుగదా!'

'ఏమియు భయము లేదు!'

'అట్లయినచో నిప్పుడే పంపించెదను!"

'తప్పకుండఁ బంపింపుఁడు.'

నాగమనాయకుఁ డాపిమ్మట వెంటనే విశ్వేశ్వర సోమయాజులను చెప్పనాయకునికడకుఁ బంపించెను.

---

## ౧౮

విశ్వనాథనాయకునికిఁ దనతండ్రియు, రామభద్రనాయకుఁడును గలిసి చక్రవర్తియాజ్ఞ తిరస్కరించిరని తెలిసినప్పటి నుండియు కేవలమును మతి పోయిన ట్లయ్యెను! తెల్లవాఱిన తరువాత నాతఁడు తల యెత్తి యెవ్వరిముఖమును జూడలేక పోయెను! తన్నుఁ దనతల్లితోడను, మీనాంబికా వేంకటాంబి కలతోడను గలిసి మధుర రమ్మనుటలోఁ గల యంతరార్థ మంతయు నాతని కిప్పు డొకక్షణములో బోధపడిపోయెను! ఎంత కృతఘ్నత! తమపూర్వు లెవ్వరైన నిట్టియకృత్య మాచరించినారా! ఒక్కసారిగా వంశప్రఖ్యాతి యంతయు మంటఁ గలిసిపోయిన దే! అయ్యో! తండ్రి తనకొక లేక వ్రాసి క్రొంచెము

ముందుగఁ దనతో నీవిషయము సంప్రతించియుండినచో నింతవిపత్తు రాకపోయి యుండెడిదే! ఎంతపని జరిగినది! పోనీ రాజభక్తిమాట యటుంచుదము! నిజముగ సార్వభౌమునికిఁ గ్రోధము వచ్చినచో నాతనిబలముల యెదుట నెవ్వరైన నిలువఁ గలరా! జీవితరూపకము తుదిరంగమునకు వచ్చినప్పు డీఁక నీరాజ్యకాంక్ష యెందులకు? అంతగా రాజ్యాధికారకాంక్ష యున్నచో నది సార్వభౌమునియనుగ్రహబలముపై సంపాదింపఁ గూడదా? ఒకవేళఁ దమ రవలంబించినమార్గము న్యాయ సమ్మతమైనదని విశ్వాస మున్నప్పుడు సార్వభౌముని కావిషయము బాగుగ నచ్చఁజెప్ప వచ్చునే!

విశ్వనాథనాయకునికిఁ దండ్రిమూలమునఁ దనసైన్యాధికారపదవికూడఁ బోవచ్చునేమో యను ననుమానము కలిగెను! సార్వభౌముని కనుమానము కలిగినచోఁ దనకుఁ గారాగార ప్రవేశముకూడఁ బ్రాప్తింపవచ్చును! అదృష్టరేఖ యెంతలో నెంతగా మారిపోయినది!

అయినను విశ్వనాథనాయకుఁ డేమియుఁ జలింపలేదు! తనవిద్యుక్తధర్మము లేవో తాను నిర్వహించుకొనుచుఁ బోయినయెడలఁ దా నొకరికి జడియవలసిన యవసర ముండ దని యాతని విశ్వాసము. అందుచే నాతఁడు నిర్భయముగఁ బోయి సార్వభౌముని కొలువుకూటమునఁ గూర్చుండవలయునని తలఁచెను. అంతలో వీరరాఘవనాయకుఁ డొక సేవకుని బంపించెను. విశ్వనాథనాయకుఁ డాతనిచేత నున్నకమ్మ తీసికొని

చదివెను. దానిలో వీరరాఘవనాయకుఁడు "నాయనా! ఈదిన మున సార్వభౌములు ప్రత్యేకముగ సామంతుల నందఱిని గొలువుకూటమునకు రావలసినదని యాహ్వానించినారు. వారు ప్రత్యేకము నన్ను, నిన్నుఁ గొలువుకూటమునకుఁ దోడ్కొని రమ్మని నియమించినారు. సార్వభౌములకు నీపై నిసుమంత కూడ ననుమానములేదు! నీవు నిస్సంకోచముగ మధ్యాహ్నము జరుగఁబోవు కొలువునకు రావచ్చును!" అని వ్రాసెను. విశ్వ నాథనాయకుఁడు, వీరరాఘవనాయకుఁడు తన నిరపరాధత యంతయు సార్వభౌముని కెఱింగించి యుండునని తలఁచెను. ఆసంగతి తలఁచుకొనునప్పు డాతనిముఖమునుండి యొక దీర్ఘ నిశ్వాసము బయలువెడలెను.

విశ్వనాథనాయకునికి భావి యంతయు నొక మహాంధ కారముగఁ దోఁచెను. అందును దండ్రి కేమి యాపత్తు కలుగునో యని యాతనిమనస్సు కళవళ పడసాగెను. ఈయాప త్సముద్రమునుండి యీవలఁ బడుట కాతనికి మార్గ మేమియు గోచరింపలేదు. చాలకాలమునుండియు నాతఁడు జగదంబా రాధకుఁడు. ఇప్పుడుకూడ నాతని కీయాపత్సముద్రమునుండి యీవలఁ బడుట కాజగజ్జననీభక్తితప్ప మఱి యేమార్గమును గనఁబడలేదు. ఒకసారి యాతఁడు సాంజలిబంధముగఁ దన కిష్ట దైవతమగు మధురమీనాక్షీదేవిని సంస్మరించెను. తత్క్షణమె యాతనికనుఁగొలుకులలో రెండుబాష్పలేశములు తళతళ మెఱ సెను. తరువాతనాతఁడు తనపినతల్లిగారిగృహమున కేగి, భోజ

నము చేసి వచ్చెను. భోజనము చేసె నన్నమాటయేగాని యాతఁడు పట్టుమని రెండు మెతుకులైన నోటఁబెట్టుకొనలేదు. తనభవనమునకుఁ దిరిగి వచ్చినతరువాత నాతఁడు శయ్యపై బరుండి విషణ్ణవదనముతో నేమేమో యాలోచింపఁ దొడఁగెను. ఒకసారి యాతనియగాధహృదయకుహరమునుండి "నేను నాయధికారమంతయుఁ ద్యజించి మధుర పోయి, మీనాయన గారితోఁ గలసినచో!" అను నొకప్రశ్న ముదయించెను. వెంటనే యాతఁడు శయ్యపై లేచి కూర్చుండి, "అట్లెన్నటికిని జరుగదు! జగజ్జననీ నాకీవిపత్సమయమున ధర్మమార్గము చూపి రక్షింపుము" అని యస్పష్టముగ నుచ్చరించెను. అయిదారు నిమిషములవఱకును నాతఁడాభక్తితన్మయతలో నట్లే యుండి పోయెను. ఆతన్మయతవలన నాతనిహృదయమున నానంద మిశ్రితమగు ప్రశాంతి యేర్పడెను. ఆప్రశాంతిలో నాతని కొక కునుకుపట్టెను.

విశ్వనాథనాయకుఁడు లేచి చూచుకొనుసరికిఁ గొలువు కూటమునకుఁ బోవుసమయ మాసన్న మయ్యెను. వెంటనే యాతఁడు చక్రవర్తిదర్శనమున కనుకూలమగు వేషము వైచుకొని చక్రవర్తిసభకు బయలుదేఱిపోయెను. కొలువుకూటమునకుఁ బోవుమార్గమున ననేకు లాతనికి నమస్కరించిరి. ఆతఁడు వారలలోఁ గొందఱికిఁ బ్రతినమస్కారము చేయుటయు మఱచి పోయెను!

ఆతఁడు కొలువుకూటమునకుఁ బోవునప్పటికి సభ యంతయు నీరవముగ నుండెను. విశ్వనాథనాయకుఁడు చక్రవర్తి సింహాసనమునకు భూపర్యంతమునకు వంగి నమస్కరించి తన కుచితమగు నొక యున్నతస్థానసింహాసనముపైఁ గూర్చుండెను. ఆతఁడు కూరుచున్న స్థానముకంటె నున్నతమగు నొకవిశాల పద్మరాగ వేదికపై నమర్చిన రత్నఖచిత స్వర్ణసింహాసనముపైఁ జక్రవర్తి కూర్చుండి తనప్రక్కనున్న స్వర్ణసింహాసనముపైఁ గూర్చున్న తిమ్మరుసుమంత్రితో నేమేమో సంప్రతించుచుండెను. వారి కిరుప్రక్కల నిద్ద ఱిద్దరు చామరధారిణులు మెల్ల మెల్లన వింజామరలు వీచుచుండిరి. వారికిఁ గొంచెము క్రిందుగ దక్షిణభాగమునఁ బెద్దనాదికవులు, వైణికులు, శిల్పులు, పండితులు మొదలగువారందఱును నాసీనులై యుండిరి. వామ భాగమునఁ బెద్ద పెద్దసైన్యాధిపతులును, విదేశస్థానాపతులును, రాజబంధువులును గూర్చుండియుండిరి. సార్వభౌమునిశిరస్సుపైఁ గనులు మిఱుమిట్లు గొలుపుచు వెలుఁగుచున్న శ్వేతచ్ఛత్రిముపై బద్మరాగ నిర్మితమగు సుదర్శనచక్రము మెఱయుచుండెను. రెండు మహోన్నతములగు స్తంభములవరుస లాసభామందిర మలంకరించుచుండెను. కొందరు పౌరు లా స్తంభముల మధ్యనున్న రత్నకంబళములపై నాసీనులయి మెల్లగ సంజ్ఞలు చేసికొనుచు గుసగుసలాడుచుండిరి. ఆ స్తంభములపై దశావతారచిత్రములు జీవకళ లుట్టిపడుచున్న ట్లుండెను. కుడ్యములపై నెల్లెడలను బురాణవీరుల మహాద్భుతసాహస కృత్యము

లును, శ్రీకృష్ణలీలలును గన్నులకు విందొనర్చుచుండెను. సార్వభౌముని వెనుకనున్న కుడ్యముపై నొకప్రక్క మహోన్నతముగనున్న యుగ్రనారసింహచిత్రము చూచువా రందఱికిని మిగులభయము గలిగించుచుండెను. కాని యాకుడ్యమునకు మరియొకప్రక్కను, దేవతలను జయించి, సగర్వముగ నమృతభాండము ముక్కునఁ గఱచికొనివచ్చు గరుడుని విశాలవక్షము లవలోకించువారి కాభయ మొక్కనిమిషములోఁ బటాపంచలై పోవుచుండెను! సార్వభౌమునిపార్శ్వమున నొకప్రక్క కొయ్యారముగ వాలి నిలుచున్న తాంబూలకరండవాహిని చూపఱ కొక సుందరశిల్పమువలెఁ గన్పట్టెను.

విశ్వనాథనాయకుఁడు తనరాక కొంచె మాలస్యమయినదని తెలిసికొని, లోలోపల నెంతో కించబడెను. చూచుచుండఁగఁ గొలువు కొలువంతయు నొక్కసారిగ నిశ్శబ్ద మయ్యెను. తిమ్మరుసుమంత్రి యేదో చెప్పఁబోయి లేచి నిలుచుండెను. ఆతఁడు తెల్లని యంగీధరించెను ఆతని శుభ్రశిరోజములపై రత్నములు పొదిగిన యుష్ణీషము తళతళ మెఱయుచుండెను. నేఁ డాతనిముఖమునఁ గ్రోధవహ్నిజ్వాలలు విస్ఫులింగములు వెడలఁ గ్రక్కుచుండెను. లేచి నిలచున్నపిమ్మట నొకటిరెండు నిమిషములవఱకును నాతఁడేమియు మాట్లాడలేదు. సభలో నిట్టూర్పు విడిచిన శబ్దముకూడ సుస్పష్టముగ వినవచ్చుచుండెను. తిమ్మరుసుమంత్రి మొదటఁ గొంచెము గొంతు సవరించుకొని గంభీరముగ నిట్లుపలికెను.

"శ్రీ శ్రీ శ్రీ సార్వభౌములు మహారాజులును, సామంతప్రభువులును, పౌరప్రధానులును, దమయాజ్ఞ శిరసా వహించి కొలువుకూటమునకు విచ్చేసినందుల కెంతయు నానందించుచున్నారు. తమరి నందఱిని దూరదేశములనుండి పిలిపించుట కొకమహాకారణ మున్నది! నేనెఱిఁగి యున్నంతవఱకెప్పుడును సామ్రాజ్యమున నింతటి దురన్యాయము జరిగియుండలేదు! వీరశేఖరచోళుఁడు పాండ్యప్రభువులగు శ్రీచంద్రశేఖరపాండ్యులరాజ్య మపహరించుటయు, దానిపైఁ బాండ్యప్రభువులు తమకు జరిగిన యన్యాయము సార్వభౌములకు విన్నవించుకొనుటయు నాపై శ్రీ సార్వభౌములు వీరశేఖరచోళునోడించి చంద్రశేఖరపాండ్యులరాజ్యము తిరిగి వారి కిప్పించుటకై దళవాయి కోట్యము నాగమనాయనింగారిని మధుర పంపించియుండుటయుఁ దమ రెఱింగినదే! ఇప్పుడు నాగమనాయనింగారు వీరశేఖరు నోడించి పాండ్యప్రభువులరాజ్యము పాండ్యప్రభువులకీయకుండ తామే స్వాధీనము చేసికొన్నారు. ఆపై సార్వభౌములు వారికిఁ బాండ్యప్రభువులరాజ్యము తిరిగి వారి కిచ్చివేయవలసినదని తాఖీదు పంపించినారు. వారది నిర్లక్ష్యము చేసి శ్రీసార్వభౌములతో యుద్ధముచేయుటకుఁ గాలుదువ్వుచున్నారు! ఇంతటి స్వామిద్రోహమును, దురన్యాయమును నీరాజ్యమున నెప్పుడైన జరిగినవా? తమ సామంతప్రభువుల కింతటి దురన్యాయము జరిగినప్పుడు శ్రీసార్వభౌములది యెన్నఁడును సహింపఁజాలరు."

ఈమాటలు వినుసరికి సభ్యులందఱును చిత్రప్రతిమల వలె నిశ్చేష్టులై మహామంత్రిముఖ మీక్షించుచు ముందేమి జరుగునో యని కనిపెట్టుకొనియుండిరి. చక్రవర్తి సభ్యులముఖములనైపు తదేకధ్యానముతోఁ జూచుచుండెను. అప్పటికి మూఁడుజాములుదాఁటెను. జాలకాలములనుండి సభాభవనమునఁ బ్రవేశించిన సూర్యకాంతిచేఁ గుడ్యచిత్రములసౌందర్య మినుమడించుచుండెను. తిమ్మరుసొక్కనిమిష మూఁగి, జలధరగంభీర స్వరముతో మరల నిట్లుద్ఘోషించెను.

'సార్వభౌములే కాదు! ఎవ్వరును నిట్టియధర్మకార్యము చూచి సహింపఁజాలరు! నాగమనాయనింగారు చిరకాలము శ్రీసార్వభౌముల యుప్పు తిని చివరి కంత్యకాలమున నీవిధముగ స్వామిద్రోహము చేయుట కేవలమును నత్యంత దూష్యమైన నీచకార్యము! శ్రీసార్వభౌము లిప్పుడు నాగమనాయకుని బదభ్రష్టునిచేసి, పాండ్యప్రభువులకు న్యాయముచేయించుటకై బద్ధకంకణులై యున్నారు! వారెప్పటికిని నిట్టి యకార్యము సహించి యూరకుండఁ జాలరు. తత్క్షణమే వారొక మహాసైన్యము మధురకుఁ బంపవలయునని నిశ్చయించినారు. ఈస్వామిద్రోహ మడఁచి, తిరిగి పాండ్యరాజ్యము స్థాపింపఁగల మహావీరు లెవ్వరైన నున్నచో వారు శ్రీసార్వభౌములహస్తములనుండి వీరకృపాణము స్వీకరించి యీధర్మకార్యము నిర్వహింతురుగాక!''

ఈమాటలు పలికినవిమ్మటఁ దిమ్మరుసొకచిన్న దగ్గు దగ్గి, మెల్లఁగఁదనసింహాసనమునఁ గూర్చుండెను. ఒక్కనిమిషము

వఱకును సభ్యులందఱును శిలాప్రతిమలవలె సక్లే కూరు చుండిపోయిరి. ఆవిమ్మట రెండు మూఁడు నిమిషములవఱకును నెవ్వరును నావీరకృపాణము స్వీకరించుటకు సాహసింపలేదు. ఆపిమ్మట నొకపురుషుఁడు గంభీరముగ నడుగులు వేయుచు రాయలసన్నిధికిఁ బోవసాగెను. సభ్యు లందఱును నాతని జూచి నిర్ఘాంతపోయిరి! సభలో నచ్చటచ్చటఁ గొన్ని గుస గుసలు బయలుదేఱెను. కొందఱు మెల్లమెల్లగ 'డకేవాయి విశ్వనాథనాయనింగారు!' అని తమ ప్రక్కలనున్న వారితోఁ జెప్పసాగిరి. శ్రీకృష్ణదేవరాయలు విశ్వనాథనాయకుఁడు కృపాణముఁ గైకొనుటకు వచ్చుచుండుటఁ జూచి యొకసారి మహామాత్యునిముఖ మీక్షించెను. ఆతఁ డది గ్రహించి యంగీకార సూచకముగ నొక సంజ్ఞ చేసి చిఱునవ్వు నవ్వెను. చక్రవర్తి విశ్వనాథనాయకునికి వీరకృపాణము ప్రసాదించుటకై నిలువఁ బడెను. తోడనే సభాసదు లందఱును ససంభ్రమముగ లేచి నిలువఁబడిరి! చక్రవర్తికిఁ గొంచెము సమీపముగఁ గూరుచున్న పెద్దనామాత్యుఁడు 'సెబాస్! విశ్వనాథా!' యనెను. రాయలు తనపార్శ్వమున నొకదంతపేటికలోనున్న మణిఖచితకరవాలము తీసి విశ్వనాథనాయకుని కందిచ్చెను. విశ్వనాథనాయకుఁడు సార్వభౌముని పాదసన్నిధిని వినతిపూర్వకముగ మోకరిల్లి, యా వీరకృపాణము స్వీకరించెను. తోడనే సభలోని వృద్ధపండితు లందఱును 'జయీ భవ! దిగ్విజయీ భవ!' అని యాతని నాశీర్వదించిరి. తోడనే వందిమాగధులు సార్వభౌముని బిగు

దాంకములు పఠించుచుఁ గైవారములు చేయసాగిరి. సభాభవనమునం దంతటను "జయ! కర్ణాటసార్వభౌమా! జయ! రాజకంఠీరవా!" అను నీ మొదలగు జయాజయధ్వానములు మిన్ను ముట్టెను! అంతటితో నానాఁటికొలువు ముగిసెను.

---

## ౧౪

రాయలు దక్షిణమునకు విశ్వనాథుని బంపించుచున్న విషయము మధురాతంజాపురములలోఁ గార్చిచ్చువలె వ్యాపించెను. చెవ్వప్పనాయకుఁడు తాను తంజాపురపరిపాలనము మొదలుపెట్టినప్పటినుండియు లోలోపల నేదో పన్నిశయను ముంచుకొని వచ్చుచున్నదని గ్రహించెను. మొదట నాతనికి నాగమనాయకుఁడు రాయలతో విరోధించుటయనిన నిష్టములేక పోయెను. అట్లు విరోధము పెట్టుకొనినచో నావిరోధరఘుంఝూమారుతములో నాగమనాయకుని పాండ్యరాజ్యముతోఁ బాటు తనరాజ్యముకూడ నెగిరిపోవునని యాతనిభయము! మొదట నాతఁ డీవిషయము రామభద్రనాయకునితోఁ జెప్పి చూచెను. కాని యతఁ డాతనిమాట లోకపసిబాలకునిమాటవలెఁ జూచి వినియు విననట్లూరకుండెను. ఆపై నాతనికిఁ బ్రాణము విసిగినది! ఒకప్పు డాతఁడు రాయలతో రహస్యముగ రాయబార

ములు నడుపవలయుననికూడఁ దలచెను. కాని దానివలన ఫలితము వెంటనే నాగమరామభద్రనాయకులతోడి కలహము! అట్లు కలహించినచో నిఁక మీనాంబిక యాతనికి దక్కుదనుట దూఁశియే! ఇట్టిపరిస్థితులలో మీనాంబికను దనకిచ్చి వివాహము చేయవలెనని పట్టుపట్టుచున్న మేనమామతో విరోధము పెట్టుకొనుట కేవల మవివేకమని యాతఁడు గ్రహించెను. కాని యీయుద్ధానంతర మే మగునో యెవరు చెప్పఁగలరు? జయాపజయములు దైవాధీనములుగదా! యుద్ధములో జయించినచో మీనాంబిక నవలీలగ వివాహమాడవచ్చును. ఒకవేళ జయింపనిచో? భావి యేమగును? చెవ్వప్పనాయకుఁడా భావిసంగతి యాలోచింప లేకపోయెను! అసలు చెవ్వప్పనాయకుఁడు భావివిషయమునఁ గలలు గనుచుఁ గూరుచుండు వ్యక్తికాఁడు!

అందును నీమధ్య వేంకటాంబా మీనాంబికలు మధురవచ్చినప్పటినుండియు నాతని కీవిషయములగు చింత లధికమయ్యెను. ఆతనికి మీనాంబికను దలఁచుకొన్నప్పు డెల్ల నెదురుగ విశ్వనాథునియాకృతి ప్రత్యక్ష మగుచుండెడిది. ఆ సమయమున నాతనికి విశ్వనాథనాయకుఁడు మీనాంబికను దనకు దక్కనీయఁ డేమోయను భయముకలుగు చుండెడిది. అప్పు డాతఁడు "నేను మీనాంబికను వివాహమాడుట కాతఁ డెట్లడ్డు రాఁగలఁడో చూచెదనుగాక!" అని దృఢనిశ్చయముతో ననుకొనుచుండువాఁడు! ఆపిమ్మట నాతనికి విశ్వనాథ

నాయకుఁ డొకమహాసైన్యముతో నాగమనాయకుని పైకి దండెత్తివచ్చుచున్నాఁ డనువార్త తెలిసెను. అప్పటినుండియు నాతఁడు తనరాజనీతి చాతుర్య ముపయోగించి యెట్లయిన మీనాంబికను వివాహ మాడవలయునని నిశ్చయించెను. దాని కొఱకు కాతఁ డొక చక్కనియుపాయ మాలోచించెను!

ఇప్పుడు పదివేలసైన్య మాతనికి లోఁబడి యున్నది. ఇంతేకాదు! సంపూర్ణముగ సీతంజాపురరాజ్యముగూడ నాతనికి స్వాధీన మైనది! ఇప్పుడు నాగమనాయకుఁడు తనసహాయ్యము లేనిదే విజయనగరసైన్యము నెదుర్కొనఁ జాలఁడు! నాగమనాయకుఁడును, రామభద్రనాయకుఁడును ప్రాణస్నేహితులు గదా! వారొకరొకరమాట కెప్పుడును నడ్డులు చెప్పరు. అసలు రామభద్రనాయకుఁ డెట్లును మీనాంబికను తనకే యిచ్చి పెండ్లిచేయవలెనని నిశ్చయించెనుగదా! మేనత్త మేనమామల కిపుడుకిని నిదియొక కలహకారణముగఁగూడఁ బరిణమించినది! అందుచే నేమాత్ర మితరులనుండి యొత్తిడి కలిగినను రామభద్రనాయకుఁడు మీనాంబికను తన కిచ్చి వివాహము చేసితీరును! కావునఁ జెవ్వప్పనాయకుఁ డీవిషయ మెటులైన నాగమనాయకునిచే రామభద్రనాయకునికిఁ జెప్పింప వలెనని తలఁచెను. అట్లు చెప్పించినచో నీజ్యేష్ఠమాసములోనే మీనాంబికను వివాహమాడవచ్చునని యతని యూహ!

అసలాతఁడు స్వయముగ రామభద్రనాగమనాయకులతో నెవరితోనైనఁ గొంచె మీవిషయము ప్రస్తావింపఁ

జేసినచోఁ దప్పకుండ నాతనికోరిక యీడేఱియుండెడిదే! కానియాతఁ డట్లు చేయలేక పోయెను. సహజముగ నాతనిది చాల లౌక్య ప్రకృతి! ప్రతిచిన్నవిషయమునకును జదరంగపుయెత్తులు వేయు చుండుట యాతని కుగ్గుపాలతోఁగూడ నలవాటైనది! అదియుఁ గాక నాతనికి నాగమనాయకునితో నంతగ దగ్గఱ పరిచ యము లేదు. ఇఁకఁ జిన్నప్పటినుండియుఁ దన్నుఁ బెంచి పెద్ద చేసి విద్యాబుద్ధులు గఱపించిన మేనమామతో నీవిషయము ప్రస్తావించుట కాతనికిఁ జాలబిడియము వేసినది! ఆపై నట్లు చెప్పుట యనిన నాతనికిఁ బ్రాణములు పోయిన ట్లుండును! తా నీవిషయ మేమియు నెఱుఁగన ట్లుండవలయును! వారం తట వారు వచ్చి తనకు వివాహము చేసెదమని పట్టు పట్టవల యును! లౌక్యమనఁగా నది!

అందుచే నాగమరామభద్రనాయకు లెన్ని కబురులు పంపించినను నాతఁ డేమియు నెఱుఁగనట్లు మాట్లాడ కూర కుండెను. తుద కాతఁ డనుకొన్నట్లే జరిగెను. నాగమనాయకుఁ డాతనివిషయ మరయుటకై విశ్వేశ్వరసోమయాజిని బంపించి నాఁడు! విశ్వేశ్వరసోమయాజిని జూడగనే యాతని హృదయ ముప్పొంగిగ నుప్పొంగినది! విశ్వేశ్వరసోమయాజి యాతని చిన్న నాఁటిగురువు! అందుచేఁ దన సహజమగు వ్యంగ్యమర్యాద విడువకుండ నాతనికి సుస్పష్టముగఁ దనమనోగత మెఱింగించి నాఁడు! విశ్వేశ్వరసోమయాజి చాల మితభాషి; మిక్కిలి లోక జ్ఞుఁడు! అందువలన నతిసూన్నితముగఁ జెన్నప్పనాయకుని హృద

యాభిమత మెఱిఁగి, మరలఁ దిరిగివచ్చి చెవ్వప్పనాయకుని యభిప్రాయము నాగమనాయకుని కెఱిఁగించెను. నాగమనాయకునికి దీనితోఁ జెవ్వప్పనాయకుఁ డేసమయమున నేమిచేయునో యను భయము గలిగెను. కావునఁ జెవ్వప్పకోరిక నెఱవేర్చి యాతనిని దమకు మఱింత సన్నిహితునిగ నొనర్చుకొనినచో మంచిదని నిశ్చయించెను. అట్లు చేయకపోయినచో నెప్పుడో యొకప్పు డాతఁడు శత్రుకోటిలోఁ జేరునేమో యెవరు చెప్పఁ గలరు? అంచుచేఁ ద్వరితముగ రామభద్రనాయకుని బిలిపించి విశ్వేశ్వరసోమయాజి రాయబారపువృత్తాంత మంతయు నెఱిఁగించెను. ఆతఁడిది విని మిగుల నాశ్చర్యపడి మెల్లగ నిట్లనెను.

"దాని కేమి! అట్లే వివాహము చేయవచ్చును! నేను మొదటినుండియు మీనాంబిక నాతనికిచ్చి వివాహముచేయ వలయుననియే నిశ్చయించితిని! అస లీచైత్రవైశాఖములలో నీవివాహము చేయవలయునని యనుకొంటిని. ఇంతలో నీయల్లకల్లోలము వచ్చినది! నా కీతఁ డింత తొందరగ వివాహము చేయవలసినదని యడుగుట యెందులకో తెలియకున్నది!"

"ఈవిషయమున నీభార్య కేమైన నన్యథా యభిప్రాయ మున్నదా?"

"అన్యథా యభిప్రాయమున కేమున్నది! విశ్వనాథుని కిచ్చిన బాగుండునని యామె యనుచుండెడిది! అంతే!"

విశ్వనాథనాయకునిపే రెత్తుసరికి నాగమనాయకుఁడు తోఁక త్రొక్కిన త్రాఁచువలెఁ గస్సుమని లేచి 'ఆఁ! ఇదాఁ?

నా కిప్పుడు తెలిసినది! చెవ్వప్పనాయకుఁ డిట్లనుగుట యుచితమే! నందో రాజా భవిష్యతి! ముం దేమి జరుగునో యెవరు చెప్పగలరు! విజయనగరమున సైన్యములు బయలుదేఱుచున్న వఁట! కావున మన మతిశీఘ్రముగ వివాహ మొనర్చుటయే యుత్తమము! మీనాక్షీసుందరేశ్వరుల సన్నిధిని శుభకార్య మేర్పాటు చేయింపవచ్చును! అతిత్వరితముగ శుభముహూర్త మేర్పాటు చేయింపుము! 'శుభస్య శీఘ్రమ్!' అనెను.

"అట్లే చేయింపవచ్చును! ఇప్పు డంత తొందర యేమి వచ్చినది!"

నాగమనాయకుఁడు తల యడ్డముగఁ ద్రిప్పి "అట్లుకాదు! నే నెందులకుఁ జెప్పుచున్నానో కొంచెమాలోచింపుము!" అనియెను. రామభద్రనాయకుఁ డామాటల కేమియుఁ బ్రత్యుత్తరము చెప్పక కొంచెమునే పావిషయ మాలోచించి, మెల్ల మెల్లగ స్వభవనమునకుఁ దరలిపోయెను.

---

## ౧౮

మథుర వచ్చినప్పటినుండియు మీనాంబికావేంకటాంబ లిరువురికిని నొక యరణ్యమునఁ బ్రవేశించి నట్లయినది. అంతయు గ్రొత్తదేశము; క్రొత్తభాష. ఆంధ్రదేశమునుండి వచ్చిన

యే కొంతమంది బంధుమిత్రులనోతప్ప మిగిలినవారి నెవరిని వా రెఱుఁగరు. మొదట వేంకటాంబకు భర్తృసందర్శనమువలనఁ గొంత మనశ్శాంతి యేర్పడినది. మాసశివరాత్రివ్రత మొక మహోత్సవమువలె గడచిపోయినది. ఆతరువాత నామె భర్త తోఁ గలిసి విద్యానగరము పోవచ్చునని యువ్విళ్ళూఱినది! కాని రామభద్రనాయకుఁ డెన్నిరోజులు గడచినను నావిష యమే తలపెట్టలేదు! మీనాంబిక విద్యానగరమునుండి మధుర వచ్చినప్పటినుండియుఁ గ్రొత్తగా మఱియొకచేనిలో నాటిన వరిమొక్కవలె వాడిపోసాగెను. క్రమక్రమముగ మీనాంబిక హృదయమున విశ్వనాథునిపై ననురాగరస ముప్పొంగసాగినది. మధుర వచ్చినప్పటినుండియు నాతఁడు కన్నుల కగపడకుండు టచే నామెకు మఱింత మతిపోయినట్లయినది! ఆపై నీనూత్న దేశమున నామెతో సంభాషించు చెలికత్తెలే లేకపోయిరి. సామాన్యముగ నామె సౌధోపరిభాగమునఁ గూరుచుండి, యీ నూత్ననగరమున నటునిటుఁ బోవు జనసమూహములను జూచుచుఁ గూరుచుండెడిది. ఆసమయమున నకారణముగ నామె కనులనుండి కన్నీటికాలువలు ప్రవహించుచుండెడివి! ఆమె యెవరైనఁ జూచెదరేమో యను భయముచే దటాలున నాకన్నీటికాలువలు తుడుచుకొనుచుండెడిది!

రామభద్రనాయకుఁడు మొదటఁ గొన్నాళ్ళవఱకును వేంకటాంబకు మధురారాజ్యవిషయము లేవియుఁ దెలియనీయ లేదు! కాని తుద కాతఁ డీవిషయము లన్నియు నామెతోఁ

జెప్పుటయే యుచితమని తలఁచెను. ఆతరువాతఁ గొంచెము కొంచెముగ నాతఁ డావిషయము లన్నియు నామె కెఱిఁగించెను. ఆమె యీవిషయము లన్నియు విన్నతరువాతఁ జాల భయపడెను. ఆమె మనస్సున విద్యానగరప్రయాణవిషయమున నుద్భవించిన యుబలాట మంతయు నొక్కసారిగ మంటఁ గలిసిపోయినది! ఆపైన శ్రీకృష్ణదేవరాయలకును, నాగమనాయకునికిని యుద్ధము జరుగఁబోవుచున్నదనియు సంమును విశ్వనాథనాయకుఁడు తమపై దండెత్తి వచ్చుచున్నాఁడనియు, విన్నతరువాత నామె మఱింత యాందోళన పడఁజొచ్చెను. తన్ని చెవులఁ బడిన యీవృత్తాంతము లన్నియు గ్రమక్రమముగ మీనాంబికకుఁగూడ దెలిసినవి. దానితో మీనాంబికకుఁ దలపై నొకపెద్దపిడుగు పడినట్లయ్యెను. కొన్నాళ్ళనుండి యామెసరిగ నన్నముఁ దినుటయే మానివేసెను.

అందును నీమధ్య మీనాంబికకు మఱియొక యాఘాతము కలిగెను. ఇప్పు డామెతలిదండ్రు లిరువురును బూర్వము వలె మాట్లాడుకొనుచుండుట లేదు! అందును వేంకటాంబ యెప్పుడును రుసరుసలే! మీనాంబికకు హఠాత్తుగ వచ్చిన యీకలహమునకుఁ గారణమేమో తెలియ లేదు!

రామభద్రనాయకుఁడు మంచిగడసరి! ఇతరుల మనసులు నొప్పించకుండఁ దనకార్యములు సాధించుకొనుటలో నాతని కున్నంతనేర్పు మఱియెవ్వరికిని నుండదని చెప్పవచ్చును! ఎట్టివారినైన నాతఁ డొక్కనిమిషములో నోఁబరచుకొనఁ

గలఁడు! కాని వేంకటాంబవిషయమునమాత్ర మాతనిగడుసుఁ దన మెందులకును బనికిరాకుండఁ బోయినది! సామాన్యముగ నామెకును నాతనికిని నభిప్రాయభేదము కలుగుచుండుట నిత్యమును నొకయలవాటైపోయినది! అయినను నతఁడు తన చాకచక్య ముపయోగించి యది చిలికి చిలికి గాలివాన కాకుండఁ జూచుకొనుచుండువాడు! ఒకప్పు డది యాతనిచేయి దాఁటిపోయి యొక మహాప్రళయమువలెఁ దయా రగుచుండెడిది! దానివలన నాతని కామెతో నేవిషయమునయినఁ బ్రిస్తావించుట యనిన భయముగ నుండెడిది! తనవాక్చాతుర్యమువలన నెంతటివారినైన లోఁబరచుకొనఁగల వ్యక్తి యామెతో మాట్లాడుట యనిన జంకుచుండెడివాఁడు!

ఈమధ్య రామభద్రనాయకుఁ డొకవేళపట్టున భోజనము చేయుట మానివేసెను! అందును నీనాఁ డతడు లోపల నడుగుపెట్టునసరి కర్ధరాత్రి కావచ్చినది! భార్య నిద్రకన్నులతో లేచి వడ్డింప, నాతఁడు మెల్లగ భోజనము చేయుచుండెను. వారిరువురి సంభాషణమును మొదట నేదో లోకాభిరామాయణముపైఁ బ్రారంభమయి క్రిమముగ మీనాంబిక వివాహప్రస్తావనలోనికి దిగినది. రామభద్రనాయకునికి మీనాంబిక వివాహము విషయమై నాగమనాయకుఁడు చెప్పిన దానిలోఁ జాల యథార్థమున్నటులు పొడకట్టెను. అంతేకాదు. ఈపరిస్థితులలో మీనాంబికకు వివాహము చేయుట యెంతో మంచిదని కూడ ననిపించెను. అతఁ డెట్లయిన మీనాంబికను జెవఁప్పు

నాయకుని కిచ్చి వివాహముచేయుటకే నిశ్చయించుకొన్నాఁడు గదా! ఈవివాహము చేసినచో నాగమనాయకునిఁగూడ సంతోషపెట్టినట్లగును! సరే! వివాహ మయినతరువాతఁ జెవ్వప్ప నాయకునితో సంబంధము మఱింత గట్టిపడును! ఈవిధముగ నీవివాహమువలనఁ దమముగ్వురికిని నత్యంతదృఢ మగు సన్నిహితసంబంధ మేర్పడిపోవును! తాము ముగ్వురును నేకాభిప్రాయమున నొక్కత్రాటిమీఁద నడచినచో రాయలు మాత్ర మేమి చేయఁగలఁడు! అతఁ డెప్పటికైన జయాశ విడిచిపెట్టి సంధి చేసికొని తీరవలసినదే! అందుచే మీనాంబికావివాహ మిప్పుడవశ్యకర్తవ్యమని యాతఁడు నిశ్చయించుకొనెను! అసత్తర్జనభర్జనలన్నియు నాతనిమనస్సున నింతకుపూర్వమే జరిగిపోయినవి! ఇప్పుడు భార్య యీప్రస్తావ మెత్తినది గావున నామెతో నీవిషయము చెప్పి సత్వరముగ శుభముహూర్త నిర్ణయము చేయించవలెనని యాతనియూహ! ఇంతవరకును వచ్చిన తరువాత నిది దాఁచియుంచు టనవసరము! కావున నాతఁ డామె కతిసంగ్రహముగ మీనాంబికా వివాహవిషయ మెఱిఁగించెను.

ఆమె మొట్టమొదట నీమాటలు నమ్మలేక పోయెను! ఆతరువాతఁ గొంతసేపటివఱకును నిర్ఘాంతపోయి యట్లే నిలువబడి లోలోపలనుండి పొంగివచ్చుచున్న యావేశ మణఁచుకొని "బాగుగనే యున్నది! అమ్మాయి పెళ్ళి కిప్పుడింత తొందర యేమివచ్చినది! నెమ్మదిమీఁదఁ జేయవచ్చును లెండు!" అనెను.

"అది కాదు! మన కన్నియుఁ గలిసి వచ్చినప్పుడు చేసి నదోఁ దప్పేమున్నది? చెవ్వప్ప మహానుండ లేశ్వరుఁడైనాఁడు! మనమెంత వెదకినను మీనాంబిక కంతకంటె మంచిసంబంధము తేలేము! మనకుఁ గావలసిన వారందఱును జాలవఱ కిక్కడనే యున్నారుకదా! ఆపైన మీనాక్షీసుందరేశ్వరులదివ్యసన్నిధిలో వివాహము! ఇంతకంటెఁ గావలసిన దే మున్నది?"

"అన్నియును బాగుగనే యున్నవి! కాని యీమహా ప్రళయ మేదో గడచిపోయినప్పుడుగదా! మనము తల తడవి చూచుకొనుట! ఇది యేదో గడచిపోనిండు! తరువాతఁ జూచు కొనవచ్చును!"

"దీనిలో మహాప్రళయ మేమున్నది? మేము ముగ్గుర మును నొక్కమాటపై నడచినచో రాయలుమాత్రి మేమి చేయఁగలఁడు! చెవ్వప్ప కెట్లును మీనాంబిక నిచ్చి వివాహము చేయఁదలఁచుకొన్నాముగదా? నాగమనాయకులుగూడ నిప్పుడే వివాహము చేయుమనుచున్నారు! చెవ్వప్పకుగూఁడ నిదే యభి ప్రాయమైనట్లు తెలియవచ్చినది! అదియుఁగాక నీవివాహము వలన మనకును, మనకును నున్నసంబంధము మరింత దృఢపడి, బలపడును! ఇంతకును రాయలపై న్యములు మధుర చేరుటకింకను గొంతకాలము పట్టునుగదా! మన మంతగా భయపడవలసిన యవసర మే మున్నది?"

"ఏమో! మీ రేమన్నను సరే! కాని పిల్లకింత కంగారుగా వివాహము చేయుట యనిన నా కేదో భయముగా నున్నది!"

వేంకటాంబకుఁ జెవ్వప్పనాయకునికిఁ బిల్ల నిచ్చుట యిష్టములేదు! కాని యేమిలాభము! ఇప్పుడు విశ్వనాథనాయకుని పేరెత్తినచో రామభద్రనాయకుఁడు మండిపడునని యామెకు భయము! ఈ చెవ్వప్ప కిచ్చి వివాహము చేయుటవలన, గూఁతురు సుఖపడదనికూడ నామెకుఁ దెలియును! అందుచేత నేమి చేయుటకును బాలుబోక, ప్రస్తుత మీవివాహ మాపుటకై యీవిధముగ మాట్లాడినది! రామభద్రనాయకునికిఁ దనకును, భార్యకును మధ్య నొక కలహఝంఝామారుతము వీచునేమోయను భయము కలిగెను! కావున నాతఁడు లోలోపలి నుండి, పొంగి పొరలి వచ్చుచున్న క్రోధ మంతయు బలవంతముగ నడఁచిపెట్టి ప్రశాంతస్వరమున నిట్లనియెను.

"ఏమియు భయము లేదు! అనవసరముగఁ గంగారుపడి మనస్సు పాడుచేసికొనకుము."

వేంకటాంబ కింక నీవివాహ మాపుట కుపాయమేమియుఁ దోఁచలేదు. కావున నామె "ఏమయినను సరే! నాకీ పరదేశములోఁ బిల్లకు వివాహము చేయుట యిష్టము లేదు!" అనియెను. రామభద్రనాయకునికి దీనితో నొడలు మండినది! అతఁడు మనస్సులో, మనవా రందఱును నిచ్చటనే యున్నప్పుడిది పరదేశ మెట్లయినది! అనుకొనెను. కాని పైకిమాత్ర

మొకింత తీవ్రస్వరముతో “నీకేమైన మతి పోవుచున్నదా?” అనెను.

“ఆఁ! మీరు చేయుపనులకు మతి పోక యేమగును? ఏమైననుసరే! మీనాంబిక కిప్పుడు వివాహము చేయుట నా కిష్టము లేదు?!”

రామభద్రనాయకుఁడు కోపోద్వేగ మడఁచుకొన లేకపోయెను. ఆతఁడు భోజనముచేయుట యాపి “ఇందు నీ యిష్టానిష్టములతో బని యేమి యున్నది! అంతయు నింతకుఁ బూర్వమే యేర్పాటైపోయినది. రేపు దశమీ గురువారమే శుభముహూర్తము! ఆనాఁడు వివాహము జరిగితీరును!” అనియెను. దానిపై వేంకటాంబ కుముకుఁబోతుదన మెక్కువయ్యెను. ఆమె బుడిబుడి దీర్ఘములతో నేడ్చుచు “అట్లయినచో నేనును నాపిల్లయును గట్టి కట్టుకొని యొక్కసారిగ వైగైలో నుఱికెదము!” అనియెను. రామభద్రనాయకుఁ డామాటలపైఁ వినుచుఁ దినుచున్న యన్న మిటు నటుఁ జిమ్మివైచి “అదికూడ నెందులకు? నీవుపోయి వైగైలోఁ బడి చావుము! దానితో శని యంతయు నొక్కమాఱుగ విఱుగడ యైపోవును!” అని యఱచుచుఁ దొందరగఁ జేతులు కడుగుకొని మేడపైకి వెడలి పోయెను. త్రోవలో భోజనశాలగుమ్మముదగ్గఱ నాతనికి వెక్కి వెక్కి యేడ్చుచు నిలువఁబడిన మీనాంబిక కనఁబడెను. అక్కడ నిలువఁబడి యాతఁ డామెపై నొక్కక్షణము చూచెను!

అంతే! వేంకటాంబకూడ భోజనశాలలోఁ గూలఁబడి కొంత సేపటివఱకును నేడ్చి, తుద కచ్చటనే నిద్రించినది!

---

## ౧౯

విశ్వనాథనాయకుఁడు శరవేగముతో మధురాతంజాపురములపైకి దండెత్తివచ్చెను. ఆతనిసైన్యప్రవాహము చూచినవారెవరును, నీసైన్య మింత యుండునని యంచనా వేయలేక పోయిరి. కొంద ఱది పూర్వము నాగమనాయకుఁడు మధురపైకిఁ దీసికొనివచ్చిన సైన్యముకంటె మిగులఁ బెద్దదనిరి. మఱికొంద ఱది యిరువదివేలకంటె నెక్కువ యుండదని వాదించిరి. ఏది యెట్లున్నను మధురపౌరులు మరల నేదో మహాప్రళయము మూఁడ నున్నదని భయపడిరి. క్రమముగ విశ్వనాథునిసైన్య మొకమహాప్రళయమువలె వచ్చి మధురాపురసమీపమున విడిసెను.

నాగమనాయకుఁడు కొంతకాలమునకుఁ బూర్వమే రాయలతో యుద్ధము తప్పదని నిశ్చయించుకొనెను. కావునఁ దన యావచ్ఛక్తియు వినియోగించి, మధురాతంజాపురముల రక్షణకుఁ దగిన కట్టుదిట్టములన్నియుఁ గావించుచునేయుండెను. మొదట నాతఁడు తనకుమారునిగూడఁ దనతోఁ గలుపుకొన

వలయునని నిశ్చయించెను. కాని విశ్వనాథనాయకుఁడు, రామ
భద్రనాయకుని కుటుంబముతోడను, దనభార్యతోడను గలిసి
మధుర రాకపోవుటచే నిఁక నాప్రయత్నము సాగదని నిరు
త్సాహపడి యూరకుండెను. తరువాత నాఁతడు ప్రత్యేకముగ
విశ్వనాథుని కొక లేఖ వ్రాసి పంపించవలయునని యనుకొనెను.
కాని రామభద్రనాయకుఁడు దానివలన నేమియుఁ బ్రయోజన
ముండదనియు, విశ్వనాథుని రాజభక్తి యకుంఠితమనియుఁ
జెప్పి యాతని నాప్రయత్నమునుండి విరమింపఁజేసెను. నాగమ
నాయకునికిఁగూడ విశ్వనాథుని హృదయము కరతలామలకమే!
అదియుఁగాక, సార్వభౌముఁడు విశ్వనాథుని జిన్నతనము
నుండియుఁ దనకుమారునివలె లాలించి, సామ్రాజ్య దండ
నాయకులలో నొక ప్రధానదండనాయకునిగ నొనరించినాఁడు.
రామభద్రనాయకుఁడు చెప్పినటు లట్టివాఁడు తమపక్షమునకుఁ
దిరుగుట మిగులఁ గష్టమే! అందుచేత వా రిరువురును విశ్వ
నాథుని విషయమున నేమియుఁ జేయకుండ మాట్లాడ కూరక
కుండుటయే మంచిదని యూహించిరి.

కాని, నాగమనాయకుఁడుగాని, రామభద్రనాయకుఁడు
గాని విశ్వనాథనాయకుఁడు తమపై దండెత్తి వచ్చునన్న విషయ
మూహించలేకపోయిరి. అసలు తమశత్రుత్వమువలన విశ్వ
నాథునియధికారమున కేమైన భంగము కలిగినఁ గలుగవచ్చు
నని యనుకొనిరి. రాయలు విశ్వనాథుని విడిచి మఱి యేదండ
నాయకునైనఁ దమపైకిఁ బంపునని నిశ్చయించిరి. రామభద్ర

నాయకుఁడు విశ్వనాథుఁడు వచ్చుచుండుట విని యిది తప్పక మహామంత్రి యెత్తిన యొక బ్రహ్మాండమగు నెత్తై యుండు నని యనుమానపడెను. దీనివలన రాయలపక్షమున కఖండమగు నైతికబలము గలిగినది! లోకదృష్టిలోఁ దా మందఱును స్వామిద్రోహులను నవప్రథ యేర్పడినది! రాయలును! మహామంత్రియు నెంత యుక్తిపరులు! మొదట నాగమనాయకుఁడీ వార్త విన్నప్పు డొక శిలాస్తంభమువలె నట్లే నిలఁబడిపోయెను. కాని, తరువాతఁ దనయావచ్ఛక్తియు వినియోగించి రాయలసైన్య మోడించి, మహామంత్రికిఁ దగినప్రాయశ్చిత్తము చేయవలెనని నిశ్చయించెను.

అయినను నాగమనాయకునికి విశ్వనాథనాయకుని దన వైపు త్రిప్పుకొనవచ్చు నన్నవిషయమున నింకను నాశ నశించి పోలేదు. కావున నాతఁడు విశ్వేశ్వరసోమయాజి నొకసారి విశ్వనాథనాయకునికడకుఁ బంపించెను. విశ్వేశ్వరసోమయాజి నాగమనాయకునికిఁ జిరపరిచితుఁడు. అస లాతఁడు దక్షిణయాత్రలకై బయలుదేఱుచుండ నాగమనాయకుఁ డాతని దనతోఁ దీసికొనిపోయెను. నాగమనాయకునితోఁ గలిసి ప్రయాణముఁ జేసినచో సుఖముగ మధుర చేరవచ్చునను నభిప్రాయముతో నాతఁ డందుల కంగీకరించెను. కాని యిప్పు డాతనికీ యుద్ధవ్యవహారములలోఁ గలుగఁ జేసికొనవలసి వచ్చెను. మొదట నాతఁ డిందుల కంగీకరింపలేదుగాని, నాగమనాయకుని బలవంతమువలన "సరే" యని యంగీకరించెను.

నాగమనాయకుని రాయబారమునకుఁ బూర్వమే విద్యానగరసైన్యములు యుద్ధ మారంభించెను. అయినను నాగమనాయకుఁడు నిరాశఁజెందక విశ్వేశ్వరసోమయాజిని దన రాయబారము కుమారుని కందఁ జేయవలసినదని ప్రార్థించెను!

అప్పుడే జాముప్రొద్దెక్కినది. ఆషాఢమాసపు టెండ శరీరము చిటచిట లాడించుచుండెను! నాగమనాయకుఁడు తన ప్రాసాదోపరిభాగమునుండి దూరయుద్ధరంగమున జరుగు విషయము లన్నియు గమనించుచుఁ బ్రతిక్షణమును విశ్వేశ్వరసోమయాజిరాకకై యెదురు చూచుచుండెను. యుద్ధ మింకను బ్రారంభదశలోనే యున్నది. అప్పు డప్పుడు చెవులు గింగురు మనునట్లు భయంకరములగు శతఘ్నినినాదములు వినిపించుచుండెను. రామభద్రనాయకుఁడును, జెవ్వప్పనాయకుఁడును సేనానాయకులై సైన్యములు నడపించుచుండిరి. నాగమనాయకుఁడు తదేకధ్యానముతో నాశతఘ్నిధ్వనులు వచ్చుచున్న వైపునకుఁ జూచుచుండెను.

ఇంతలో విశ్వేశ్వరసోమయాజి వెనుకప్రక్కనుండి లోనఁ బ్రవేశించెను. బ్రహ్మతేజ మొలుకుచున్న యాతని ముఖము గ్రీష్మతాపముచే వడఁ గొట్టినట్లుండెను. నాగమనాయకుఁ డాతనిని జూడగనే సవినయముగ వంగి నమస్కరించి తనప్రక్క నున్న సింహాసనముపైఁ గూర్చుండఁ జేసెను. విశ్వేశ్వరసోమయాజిముఖము చూడగనే నాగమనాయకుఁడు నిరుత్సాహపడెను. విశ్వేశ్వరసోమయాజి చేతిబ్రొటనవ్రేలితో

నుదుటిపై జారు స్వేదబిందువులు తుడుచుకొనుచు "ఏమున్నది! అంతయు ననుకొన్నట్లేయైనది!" అనెను.

"ఆతఁ డంగీకరించ లేదా?"

"లేదు! ముందు మీరు పాండ్యునిరాజ్యము పాండ్యుని కిచ్చుపర్యంతమును మరియేవిషయమును బ్రస్తావించుటకుఁగూడ వలను పడ దన్నాఁడు!"

"ఇఁక యుద్ధము తప్పదన్న మాట!"

"ఆహా! నిస్సంశయముగ!"

అయిదారు నిమిషములవఱకును నాగమనాయకుఁ డేమియు మాట లాడలేకపోయెను. చిన్నప్పటినుండియుఁ బెంచి పెద్దవానిని జేసి ప్రాణప్రదముగఁ జూచుకొనుచున్న కుమారుఁడే యాతని కిప్పుడొక ప్రబలశత్రు వైనాఁడు! ఆతఁ డట్లూరకుండి తీవ్రవేదనాసూచకములగు కనులతో విశ్వేశ్వరసోమయాజివైపు చూచి యిట్లనెను.

"సుపుత్రుఁడు కలుగవలెనని శ్రీవిశ్వనాథుని కనేక కానుకలు సమర్పించితిని! కాళహస్తీశ్వరుని కొక సుందర గోపురము నిర్మించితిని. ఇన్ని చేసినను నాకీవిధముగఁ బితృవిరోధియగు పుత్రుఁడు కలుగుటకుఁ గారణ మేమి?"

అది విని విశ్వేశ్వరసోమయాజి నాగమనాయకుని పాదమస్తకమును బరీక్షించి తీవ్రస్వరమున నిట్లు సమాధానము చెప్పెను.

"మీ రిచ్చు కానుకలును, నిర్మించు గోపురములును పరమేశ్వరుని దృష్టిలోఁ గేవలమును దృణముకంటెఁగూడ నల్ప మూల్యములని తెలిసికొనుఁడు! మీరు సుపుత్రునికొఱకు దేవాదిదేవుని బ్రార్థించితి మన్నారు! పరమేశ్వరునికి మీ మీఁద సంపూర్ణముగ ననుగ్రహము గలిగినది! సందేహము లేదు! ఆతఁడు మన మడిగిన వరములతోఁబాటు మన మను కొనని సుఖముకూడఁ బ్రసాదించుచుండును! అది మన యజ్ఞానదృష్టిలో దుఃఖమువలెఁ గనఁబడుచుండును. అంతే! అంతమాత్రముచే దైవమును నిందించుట కేవలమును బామ రత్వము! నేనెప్పుడును మీ రిట్లు మాట్లాడుదురని యనుకొన లేదు!...

సరే! దాని కేమి యటుండనిండు! మీ రందఱును నాకు బంధుతుల్యులగుటచే నీబంధువిరోధము మాన్పవల యునని యీరాయబారమును కంగీకరించితిని. ఇంతకును దైవ సంకల్ప ప్రకారము నడచునుగాని మనుష్యయత్నములో నే మున్నది! ఇంతమాత్రముచే నిరుత్సాహపడి సార్వభౌమునితో విరోధము తెచ్చిపెట్టుకొనకుఁడు! ఇంకను వ్యవహారముపూర్తిగ మించిపోలేదు. మఱి నా కిక్కడఁ గాలక్షేపము చేయుటకు వీలులేదు! నేనీ వేళ మధ్యాహ్నమే రామేశ్వరయాత్రకుఁబోవు చున్నాను. మఱి నాకు సెలవు దయచేయుఁడు!"

అని చెప్పి, యాబ్రాహ్మణుఁడు చటాలున లేచెను. నాగమనాయకుఁ డాతనిని ద్వారమువఱకును సాగనంపి వెను

కను మరలెను! ఆతఁడా బ్రాహ్మణున కేమేమియో సమాధా నము చెప్పవలయు ననుకొనెనుగాని చివరి కేమియుఁ జెప్పలేక పోయెను. "సోమయాజి యెంత తీవ్రముగ మాటలాడినాఁడు! కేవలమును దృణముకంటెఁగూడ నధమాధములు!" అని పలికిన యాత్రనిముఖ మింకను నాతనియెదుట మాట్లాడుచున్నట్లే యుండెను! నాగమనాయకుఁ డొకసారి కనులు మూసికొని యొక పెద్దనిట్టూర్పు విడిచిపెట్టెను. మఱుక్షణములో మేడ మెట్లు దిగి తొందర తొందరగఁ గ్రిందికి వెడలిపోయెను.



## ౨౦

రాయలసైన్యమునకును, నాగమనాయకునిసైన్యమునకును ఘోరయుద్ధము జరుగుచుండెను. అప్పుడే యుద్ధముప్రారంభమై యిరువదిరోజు లయినది. నాగమనాయకుని పక్షమునఁ జెవ్వప్పతప్ప మిగిలినవా రిరువురును మిగుల నాఱితేరినవారు. నాగమనాయకుఁడు స్వయముగ సేనాధిపత్యము వహించి బలములు నడుపుచుండెను. రాయలసైన్యము లపారములు; నాగమనాయకునిసైన్యములు పరిమితములు. రాయలబలము లెంత కాలమైనను బోరఁగలవు! నాగమనాయకుని కంతటి యంగ

బలముగాని, యర్థబలముగాని, లేదు. అయినను యుద్ధగతి చూచినవా రందఱును నాగమనాయకునికే జయము గలుగునని నమ్ముచుండిరి. ఇదియంతయుఁ జూచి విశ్వనాథుఁడు మొదటఁ గొంచె మధైర్యపడెను. కాని తనసైన్యము లన్నింటిని బ్రోత్సాహపఱచి యుద్ధములోనికుఱికెను. సేనల కన్నింటికిని "నాగమనాయకుని సజీవముగ బంధించినవారికిఁబది వేల సువర్ణసుదర్శనములు బహుమతి యీయఁబడునని" చాటించెను. ఈసంగతి తెలిసి నాగమనాయకుఁడు మరింత మండిపడి ప్రాణములఁగూడ లక్ష్యపెట్టకుండ బోరాడసాగెను. నాగమనాయకుఁ డొక యేనుఁగుపై నెక్కి యంబారీ నిండ సువర్ణసుదర్శనములు పోసికొని యవసరమైనచోటులనెల్ల నాణెములు సైనికులకు దోసిళ్ళకొలదిగ బహూకరించుచు 'హరహరా! మహాదేవా!' యని యఱచుచు సైన్యములను బ్రోత్సహించుచుండెను.

క్రమముగ సాయంకాలము కావచ్చుచుండెను. నాగమనాయకుఁడు తనపార్శ్వముల నున్నసైనికులను బ్రోత్సహించుచు వెనుకముందులు చూడకుండ శత్రుసైన్యములోనికిం జొరఁబాఱెను. ఇది చూచి విశ్వనాథునిపక్షమువా రందఱును నాతనిని బట్టవలయు నను మహోత్సాహముతో సముద్రతరంగములవలె వచ్చిపడసాగిరి. ఈసమయమున విశ్వనాథుని సైనికులలో నొకఁడు నాగమనాయకుని యేనుఁగును గుఱిచూచి తుపాకి కాల్చెను. అది సరిగఁ బోయి యాయేనుఁగు చెంప

కుఁదగిలెను. దానితో నదికంగాయపడి యదేపనిగ ముందు నకుఁ బరువెత్తసాగెను. అందువలన నాగమనాయకుఁ డొక్కఁ డును శత్రుసైన్యమధ్యమునఁ బోరాడవలసివచ్చెను. ఆతనిని గాపాడుటకై మధురసైనికు లతిత్వరితముగ వెనుకనుండి వచ్చు చుండిరి. నాగమనాయకుని మావటివాఁ డెంత ప్రయత్నించినను నాయేనుఁగు మఱిదానిని బడలేదు. ఈసమయమున మఱి యొకఁడు నాగమనాయకుని మావటివానిని నేలఁ గూల్చెను. నాగమనాయకుఁ డిఁక చేయునది లేక నేలపై కుఱికి ప్రాణము లకు తెగించి పోరాడసాగెను. వృద్ధుఁడైనను నాతనియెదుట నిలచి యెవరును బోరాడ లేకుండిరి. అయినను నాతనిశరీరమున కప్పుడప్పుడు చిన్నచిన్న గాయములు తగులుచునే యుండెను.

ఈవిధముగఁ గొంతసేపు పోరాడునరికి నాగమనాయ కుఁడు బాగుగ నలసిపోయెను. అయినను వెనుకనుండి తనబల ములు వచ్చి తన్ను రక్షించునను నాశమాత్రమాతనికిఁ బోలేదు. కొంచెము కనుచీకఁటి పడెను. ఇంతలో బలమైనయొకకృపాణా ఘాత మాతని వీపునకుఁ దగిలెను. నాగమనాయకుఁడు తటా లున వెనుకకుఁ దిరిగి చూచెను! ఆతఁడు తనసేనలోనివాఁడే. చాలకాలమునుండి యాతఁ డాతని జూచుచునే యుండెను. పది పదునేనుగురు సైనికులుతనసేననుండి తన్నుఁ గలిసికొన్నా రనియు, వీరిసహాయముతో మరల తనసైన్యములను గలిసికొన వచ్చుననియు నమ్కొనుచున్నయాతని కీకృపాణాఘాతముతోఁ

దలపై బిడుగు పడినట్లయ్యెను. ఆనిమిషమున్నులో "నాసేన లోనివాఁ డెవఁడైనఁ బదివేల సువర్ణములకాశించి స్వామి ద్రోహము చేసినాఁడా!" యనుభావముదయించినది. ఆపిమ్మట నాతఁడు "నాపాపమునకుఁ దగిన ప్రాయశ్చిత్తము జరిగినది!" అని యనుకొనెను.

అంతే! ఆపై నాతని కింక శరీరముపై స్మృతి తప్పి పోయెను. మధ్యమధ్య స్మృతి వచ్చినపుడు భయంకరములగు గజఘీంకారములును, గాయపడిన సైనికులరోదనధ్వనులును వినవచ్చుచుండెను. ఆతనిదృష్టి కంతయు నేదో పొగఁ గ్రమ్మి నట్లయిపోయెను. కొంతసేపటికాతనికిఁ జాలదాహము వేసినది. ఎవరో యొక చిన్న స్వర్ణపాత్రతో నాతనికి మంచితీర్థమందిచ్చి నారు. ఆపాత్రఁ దీసికొనఁబోవుసరి కాతనికి వీపుపైఁ గత్తివేసి నట్లుకళుక్కు మన్నది. ఆతఁ డెట్లెట్లో దాహము తీసికొని నలువైపులను బరికించెను. అది యొక రాజభవనము! చుట్టును బరిచారకు లతిజాగరూకతతోఁ దన్నుఁ గాపాడుచున్నారు. తనకు వీపుపై నొక బలమైన గాయము తగిలినది. ఆచుట్టు నున్న పరికరములు చూచునరి కది యంతయు నాతని కొక స్వప్నమువలెఁ గానిపించెను. అతఁ డొక యరగడియసేపటి వఱకు నట్లే యాపరిసరవస్తువులను బరిశీలించెను. అది తన భవనము కాదు. ఇందేమియు సందేహములేదు. అయిన నిది యెవరిభవనము? తా నిచ్చటికిఁ వచ్చుటకుఁ గారణ మేమి

తన సైన్య మంగము నేమైనది? రామభద్ర చెవ్వప్పనాయకు లేమైనారు?

అతఁ డింక నాగలేక ప్రక్కనున్న పరిచారకుని దగ్గరగ రమ్మని సంజ్ఞచేసి, నూతిలోనుండి పైకి వచ్చుచున్నటులున్న క్షీణస్వరముతో 'ఇది యెవరి భవనము!' అని ప్రశ్నించెను. అంత నాపరిచారకుఁ డతివినయముగ నమస్కరించి 'దళవాయి శ్రీ విశ్వనాథనాయనింగారి భవనము!' అని ప్రత్యుత్తర మిచ్చెను.

"ఎవరిది? విశ్వనాథనాయకునింగారిదా?"

"అవును! మహాప్రభూ!"

"నేను యుద్ధములోఁ బట్టువడి పోయితినా?"

"చిత్తము మహాప్రభూ!"

ఆపిమ్మట నాతఁ డింక మాటలాడలేకపోయెను! చివరికిఁ గనులు తెఱచియుంచుటకుఁగూడ నాతనికి శక్తి లేనట్లు కనఁబడెను. మెల్లగ నాతనికన్నులు మూఁతపడెను. ఆమూఁతపడిన కనుఁగొలుకులనుండి యయిదాఱుకన్నీటి బిందువు లవిరళధారగా నేల రాలెను.

శ్రీ పే... ...వాలయమ్మ
తెలప్రో... (కృష్ణాజిల్లా.)

## ౨౧

నాగమనాయకుఁడు దొరకిపోఁగనే పాండ్యసైన్యమునఁ బెద్ద యల్లకల్లోలము బయలుదేరెను. అంతవఱకును నతిధైర్యముగ సైన్యములు నడపుచున్న రామభద్రచెవ్వప్పనాయకులకుఁగూడ నింకఁ గాలుసేతు లాడలేదు క్రమముగాఁ బాండ్య సైన్యముల నన్నిఁటని గ్రోడీకరించి నడపించుట మిగులఁ గష్టమైపోయెను. ఆపిమ్మట నానాఁటికి యుద్ధము ముగిసెను. మఱునాఁ డీక విశ్వనాథనాయకునికి యుద్ధము చేయవలసిన యవసరమే కనఁబడలేదు. యుద్ధరంగమున నాతని కెవరును గనఁబడలేదు. ఆతఁడు నిరాఘాటముగఁ బోయి మధురకోటలోఁ బ్రవేశించి మధురరాజ్యము స్వాధీనము చేసికొనెను. మొదట నాతనికిఁ దండ్రి పట్టువడినందులకును, సులభముగఁ గోట స్వాధీనమయినందులకును జాల సంతోషము కలిగినది.

కాని యాపిమ్మటఁ దెలిసినవార్తలవలన నాతని సంతోషమంతయు నొక్కసారిగ సన్నగిలి పోయినది. మొట్టమొదట నాతనికి యుద్ధములోఁ బాండ్యునికి బలమైన గాయములు తగిలెనని తెలిసెను. ఆపిమ్మట రామభద్ర చెవ్వప్పనాయకు లిరువురును హతశేషులగు సైనికులను దీసికొని తంజాపురము పాఱిపోయిరని తెలిసినది. ఈయుద్ధము సమాప్త మైపోయినదని యనుకొనునంతలో మరల నిది యొకటి.

పాండ్యునివార్త తెలియగనే వెంటనే యాతఁడు పాండ్యుని భవనమున కేగి, యాతనిని దర్శించెను. ఆతఁడొక హంస

తూలికాతల్పముపై వెల్లకిలఁ బరుండి యుండెను. పరిచారకు లొక రిద్దఱు నిశ్శబ్దముగ నడచుచు నాతనికిఁ బరిచర్య లొనరించుచుండిరి. పాండ్యునిముఖము బాగుగ శుష్కించిపోయెను. శయ్యాకంటుకొనిపోయిన యాతనిశరీరమునుండి దుర్బలాతిదుర్బలములగు నుచ్ఛ్వాసనిశ్వాసములు బయలు వెడలుచుండెను. విశ్వనాథనాయకుఁ డాతనిశయ్యాదగ్గఱ కేగి యొకటి రెండు నిమిషములవఱకును నాతనిముఖము పరీక్షించెను. ఇంతలో రాజవైద్యుఁడు లోపలికి వచ్చి సవినయముగ నాతనికి నమస్కరించెను. విశ్వనాథనాయకుఁడును నాతఁడును మెల్లగ నింకొక గదిలోనికిఁ బోయిరి. విశ్వనాథనాయకుఁడు మెల్లగ నిట్లు ప్రశ్నించెను.

"ఎట్లున్నది?"

"ఇప్పటికిఁ గొంచె మాశ కనఁబడుచున్నది ప్రభూ!"

"ప్రాణాపాయము లేదుగద!"

"ఇంకను నంతధైర్యముగఁ జెప్పుటకు వీలు లేదు"

"ప్రస్తుత మెట్లున్నది?"

"అదే! ప్రస్తుతస్థితినిబట్టియే కొంచె మాశ కలుగుచున్నది"

"సరే! అచ్చటి మాబాబయ్యగారి కెట్లులున్నది?"

"వారి కేమి? వారి కింక భయము లేదు ప్రభూ!"

"నీరస మెట్లున్నది?"

"నీరసముగూడ బాగుగఁ దగ్గిపోయినది. కఱ్ఱ పట్టుకొని కొంచె మటు నిటుఁ దిరుగఁ గలుగుచున్నారు."

"నేను వారిదర్శనము చేయవచ్చు నన్నమాట!"

"ఆ! నిరభ్యంతరముగ! ఈవేళ భోజన మయిన తరువాతఁ గొంచెము చల్లబాటువేళ వెళ్ళి దర్శనము చేయుఁడు."

"సరే!"

విశ్వనాథుఁ డచ్చటనుండి స్వభవనమునకు వెడలిపోయెను. భోజనానంతరము తాంబూలము వేసికొని, యాతఁ డొకహంసతూలికాతల్పముపై విశ్రమించెను. ఆతఁ డనుకొనిన దానికంటెఁ జాల తేలికగనే మధుర జయించినాఁడు. కాని యేమిలాభము? పాపము! పాండ్యుఁడు ప్రాణాపాయస్థితిలో నున్నాఁడు. తండ్రితో విరోధము. రామభద్రచెవ్వప్పనాయకులు తంజాపురపుఁ గోటలోనికిఁ బోయి తల దాఁచుకొనిరి. మీనాంబిక యేమైనది? బహుశః ఆమెకూడఁ దంజాపురముననే యుండియుండును. ఆతఁడు తండ్రిపట్టుపడఁగనే రామభద్ర చెవ్వప్పనాయకులుగూడ లొంగిపోవుదురనియుఁ దా నెటులైన నొకసారి మీనాంబికను దర్శించు భాగ్యము గలుగుననియు, నువ్విళ్ళూరుచుండెను. కాని యనుకొన్నదంతయుఁ దలక్రిందులై పోయినది.

రామభద్రచెవ్వప్పనాయకు లిట్లు పాఱిపోవుటలోఁ గారణ మేమి? ఇంకను ద న్నెదిరింపఁగల మనియేనా వారి యాశ! ఎంత గుండెనిబ్బరము! ఇన్నాళ్ళనుండి ముగ్గురును గలిసి మధురలో నింతింత ప్రయత్నములు చేసి తన్ను జయింపలేనప్పు డింక వీ రిద్దఱును దంజాపురమునుండి యుద్ధము చేయఁ

గలరా? అంతకంటె పెత్తిపని మఱియేమైనఁ గలదా? బహుశః వారు తన్నాదరించవలయునని పాఱిపోయియుండరు. నీటిలో మునుఁగువాఁడు గడ్డిపఱక ప్రేలికిఁదగిలినచోఁ దటాలున దానిని బట్టుకొనును! వారు తంజాపురము పాఱిపోవుటకూడ నట్టిదే! వా రట్లు పాఱిపోకుండ మధురలో లొంగిపోయిన నెంత బాగుండెడిది! సార్వభౌమునితో విన్నవించి వారి నెట్లయిన రక్షించుటకు వీలుకలిగియుండునే! ఇప్పు డాయవకాశ మేమియుఁ గన్పింపదు!

ఇంతలో ద్వారపాలకుఁడు లోని కరుదెంచి "రాజవైద్యునికడనుండి వచ్చిన వార్తాహరుఁ డొకఁడు సత్వరముగఁ దమదర్శన మపేక్షించుచున్నాఁ" డని చెప్పెను. విశ్వనాథనాయకుఁ డామాట విని పైనుత్తరీయమైన వేసికొనకుండ వచ్చి చావడిలో నిలుచుండెను. ఆతని జూడఁగనే యావార్తాహరుఁడు సవినయముగ నమస్కరించి "మహాప్రభూ! శ్రీచంద్రశేఖరపాండ్యులకు మరల వ్యాధి తిరుగఁ బెట్టినదఁట! వారు జీవించు నాశ యేమియు లేదఁట! తమరిని సత్వరముగ దయచేయుమని ప్రార్థించుచున్నారు" అని చెప్పెను. విశ్వనాథనాయకుఁ డొక యుత్తరీయము పైన వేసికొని సత్వరముగఁ బాండ్యునిదగ్గఱ కేగెను. పాండ్యుఁ డాతనిఁ జూచి, యెట్లెట్లో కష్టపడి రెండుహస్తములు నెత్తి నమస్కారముచేసెను. విశ్వనాథుఁడు "వలదు! వలదు! మీరాయాసపడకుఁడు!" అని యనుచు నాతనిసరసను గూర్చుండెను. చంద్రశేఖరపాండ్యుఁ డతికష్ట

ముపై నాతనివై పొకసారి తేఱి పాఱఁజూచి చేతులతో సంజ్ఞ చేయుచు నత్యంతహీనస్వరముతో "నేను వెడలిపోవుచున్నాను మీఋణము తీర్చుకొనఁజాలను! ... ... ... నా రాజ్యము! మీది. మీరే దీనిని బరిపాలింపవలయును." అని చెప్పి కనులు మూసెను. మరల నొకనిమిష మున్నతరువాత కొంచెము కనులు తెఱచి యేదో మాట్లాడఁబోయెను. కాని వెంటనే యాతనికి మరల స్పృహ తప్పిపోయెను. ఒకటి రెండు నిమిషముల తరువాత నాతని ముఖమునుండి పెద్దనిట్టూర్పు వచ్చెను. దానితో నాతనిప్రాణములు పోయెను. విశ్వనాథనాయకుని కాతనిమృత్యువు చూచుసరికిఁ గనుదోయినుండి సంతతధారగా బాష్పబిందువులు ప్రవహించెను! ఆతనిముఖమునుండి "పాప మీరాజ్యమున కెంత పరితపించినాఁడు! చివరికి వచ్చుసరికి దైవ మీతని ననుభవించనీయకుండఁ జేసినాఁడు! నుదుటివ్రాఁత యెవ్వరు తప్పింపఁ గలరు!" అనుమాటలు వెలువడెను.

విశ్వనాథనాయకుఁ డాతని యుత్తరక్రియ లన్నిటికిని దగిన యేర్పాటులు చేయించి, తాను స్వయముగ దగ్గఱనుండి యాతని కౌర్ధ్వదైహికక్రియలు జరిపించెను. ఆతరువాత వెంటనే సార్వభౌమునికి జరిగిన సంగతులన్నియు నివేదించుచు నొక కమ్మ వ్రాసి యది సార్వభౌముల కతిత్వరితముగ నందునేర్పాటుఁ గావించెను. అనాఁడిఁక నాతఁడు తండ్రిని జూచుటకుఁ బోలేక పోయెను. పాండ్యునిమృతివలన నాతనిమనస్సంతయు వికలమై

పోయెను. మానవజీవితపు క్షణభంగురత్వ మొక్కసారిగ నాతని కనులకు మిఱుమిట్లు గొల్పెను! ఎంతలోఁ బాండ్యుని కెంత విపత్తు సంభవించినది!

మఱునాఁ డాతఁడు పెందలకడ లేచి తండ్రిని జూచుటకుఁ బోయెను. అతఁడు తండ్రి నివసించుటకు రాజభవనములలో నొక పెద్దభవనము ప్రత్యేకించెను. గతదివసమున జనకుని జూడలేకపోయినందుల కాతఁడు చాలఁ గిచకిచ పడెను. విశ్వనాథనాయకుఁడు లోపలికి బోవుటకు ముందుగ గవాక్షముల గుండఁ దండ్రి నొకసారి పరీక్షించెను.

నాగమనాయకునిముఖమునఁ గత్తివాటు వేసినను నెత్తురు లే నట్లుండెను. రోగగ్రస్తుఁ డగుటవలన నీమధ్య నాతని కొక చిన్నగడ్డము పెరిగెను. ఆతఁడు చేతికట్టసహాయము లేకుండగనే మెల్లమెల్లగ నటునిటుఁ బచారు చేయుచుండెను. ఆతని గది ద్వారమున కిరువైపులను నిరువురు సైనికులు నిలుచుండి, యతి జాగరూకతతో, విచ్చుకత్తులతోఁ గాపలా కాయుచుండిరి. నాగమనాయకుఁ డుత్తరదక్షిణ దిశలవైపు తిరుగుచు మెల్ల మెల్లగఁ బచారుచేయుచుండెను. విశ్వనాథనాయకుఁడు పశ్చిమ ముఖముగ లోనఁ బ్రవేశించెను. ఆతఁడు లోనఁ బ్రవేశించు నప్పటికి, నాగమనాయకుఁ డేదో తీవ్రముగ నాలోచించు చుండెను. విశ్వనాథుని పదధ్వని వినుసరి కాతఁడులికిపడి 'ఎవరు వారు?' అని ప్రశ్నించెను.

'నేను విశ్వనాథనాయకుఁడను!'

ఆమాట విని నాగమనాయకుఁడు తటాలున నిలువఁబడిపోయెను! ఆతనిహృదయరక్త మంతయు నొకసారిగఁ గనుబొమలవఱకును బొంగెను! ఆతఁడు విశ్వనాథునిపై శోకక్షణకాలము తీవ్రముగఁ జూచి 'ఛీ! నీవుపితృద్రోహివి! నీతో నాకేమియుఁ బనిలేదు! నాయెదుటనుండి లేచిపో!' అని గర్జించెను. విశ్వనాథుఁడు క్రొంచెమించుమించుగ నిట్లే జరుగునని యూహించెను. కావున నిర్భయముగ నిలువఁబడి యిట్లు పలికెను.

'నేను పితృద్రోహిని గాను!'

'మఱి యీవిరోధ మంతయు నెవరితో?'

'మీయధర్మముతో.'

'నాదా? అధర్మము?'

'ఆ! నిస్సంశయముగ!'

ఆమాటతో నాగమనాయకునిశరీర మంతయుఁ గ్రోధముతో గజగజ వణఁకిపోయెను. ఆక్రోధబలమువలన నాతనిశరీరమున కపరిమితమగు బలము వచ్చెను. వెంటనే యాతఁడు బెబ్బులివలె లంఘించి, యొక ద్వారపాలకునిచేతిలోని విచ్చుకత్తి లాగికొని విశ్వనాథనాయకునిమీఁది కుఱుకఁబోయెను. అంతలో నారెండవ ద్వారపాలకుఁడు వెనుకనుండి వచ్చి తటాలున నాతని దక్షిణహస్తము గట్టిగఁ బట్టుకొనెను. నాగమనాయకుఁ డాతని నొక్కొక్కయూపుతో నిటునటు గుంజివేయుచుండెను. విశ్వనాథనాయకుఁడు దీని కేమియుఁ జలింపలేదు! ఒకక్షణ మాతఁడు నాగమనాయకుని యౌద్ధత్యము చూచి

యాతనితోఁ బెనఁగుచున్న భటునితో "ఆఖడ్గము వదలివే యుము!' అని పలికెను. వెంటనే వాఁ డాఖడ్గము నాగమనా యకునిచేతిలో వదలివేసి, దూరముగఁ బోయి నిలుచుండెను! విశ్వనాథుఁడు వెంటనే తనయంగీ విప్పి, నాగమనాయకుని కెదురుగఁ దనవక్షస్థల ముంచి 'అంతగ నాయాసపడుట యెందు లకు? ఇదుగో! పొడువుఁడు' అని నిశ్చలముగ నిలువఁబడెను! దానితో నాగమనాయకుఁడు నిలువున నీరైపోయెను. ఆతని చేతిలోనిఖడ్గ మప్రయత్నముగ నేలఁ బడిపోయెను. దుర్బలుఁ డగు నాగమనాయకుని కీప్రబలభావసంఘాతము వలనఁ దాత్కాలికముగ మూర్ఛ వచ్చెను. ఆయుత్తరక్షణమున నాతఁడు తటాలున నేలపైఁ బడిపోయెను! విశ్వనాథనాయకుఁ డాతనికిఁ సత్వరముగ శీతలోపచారములు చేయించెను. ఆ పిమ్మట నాగమనాయకునికి మరలఁ దెలివివచ్చు సూచనలు కనఁబడెను. రాజవైద్యుఁడు విశ్వనాథనాయకుఁ డప్పు డచ్చట నుండుట మంచిదికాదని చెప్పుటవలన వెంటనే యాతఁ డచ్చో టునుండి వెడలిపోయెను.



## ౨౨

ఆపిమ్మట నయిదాఱురోజులు గడచిపోయెను. తండ్రి కింకను బాగుగ స్వాస్థ్యము కలుగకపోవుటవలన విశ్వనాథ నాయకుని కేపని చేయుటకును వీలు కలుగలేదు! ఆతఁ డింకను

రామభద్రచెవ్వప్పనాయకులపైకిఁ బోవలసియే యున్నది! ఒక ప్రక్క మీనాంబికావియోగ మాతనిని మెల్ల మెల్లగ దహించి వేయుచున్న ట్లుండెను! నాగమనాయకుని కిఁక భయము లేదని తెలిసిన వెంటనే విశ్వనాథుఁడు పదివేల సైన్య ముతోఁ దంజాపురముపైకిఁ బోయెను. ఒకటి రెండు రోజులు యుద్ధము జరుగగనే కోటలోనుండి యొకరాయబారి వచ్చి విశ్వనాథుని కుచితములగు కానుక లర్పించి సవినయముగ నమస్కరించెను. విశ్వనాథుఁడు వానిని రాయబారము విన్న వింపుమని యాజ్ఞాపించెను. అంత నా రాయబారి వారి రాయ బారము చెప్పి, "ప్రభూ! తమరు వారికిఁ బ్రాణభయ ముండ దని యభయ మిచ్చినచో నీక్షణమున వారీరాజ్యమంతయు స్వాధీనము చేయుటకు సిద్ధముగ నున్నారు!" అని చెప్పెను.

"రామభద్ర చెవ్వప్పనాయకులకుఁ బ్రాణదానము చేయుటకు నా కధికారము లేదు. నేను కేవలమును బ్రభువు వారి దళవాయినే! వారు ప్రస్తుతము మాకు లొంగిపోయినచో వారివిషయమునఁ దయఁదలఁచవలసినదని శ్రీసార్వభౌములకు నివేదించుటకు నా కేయభ్యంతరమును లేదు! ఆపైని వారి యదృష్టము!"

"ప్రభూ! తమరుగూడఁ బ్రాణముల కపకారము జరు గదని హామీ యిప్పించవలసినదని వారిప్రార్థన!"

"నామాటపై వారికి నమ్మిక మేనా!"

"ఎంతమాట సెలవిచ్చితిరి! ప్రభూ!"

"అయినచో నట్లే హామీ యిచ్చెదను. నావలన వారి ప్రాణముల కేమియు భయ ముండదు!

"చిత్తము! దేవరవారు దయాసముద్రులు! సెలవు!"

ఆతరువాత ననుకొన్న షరతుప్రకారము రామభద్ర చెవ్వప్పనాయకులును వారిక్రిందియధికారులును నాయుధములు విడిచి విశ్వనాథనాయకునికి లొంగిపోయిరి. విశ్వనాథ నాయకుఁడు వారల నందఱిని ఖైదు చేయించి తంజాపురపుఁ గోటయు రాజ్యమును సంపూర్ణముగ స్వాధీనము చేసికొనెను. ఆతనికిఁ దంజాపురము వచ్చినప్పటినుఁడియు వేంకటాంబా మీనాంబికల నెట్లయిన నొకసారి దర్శింపవలయునని కోరిక గలిగెను! కాని వా రెక్కడ నున్నారో గూడఁ దెలియదు! కోటయంతయు వెదకించెనుగాని యాతని కెచ్చటను వారిజాడ గనఁబడ లేదు! ఆతఁడు మొట్టమొదట రామభద్రనాయకుని వలనఁగాని, చెవ్వప్పనాయకునివలనగాని యీవిషయము తెలిసికొనవలయునని యనుకొనెను. ఆపిమ్మట నెందుచేతనోగాని యాతనికి వారిని జూచుటకుఁగూడ ససహ్యము వేసెను! అంతే! ఆతఁ డిఁక నావిషయము తలపెట్టలేదు! కాని వేంకటాంబామీనాంబికలవిషయమై యనుక్షణమును మథనపడుచు నేయుండెను!

ఆవిధముగ నొకటి రెండు రోజులు గడిచిపోయెను. ఆ తరువాతరోజుసాయంకాలమున నాతఁడు సౌధముపై జల్లగాలి సేవించుచుండ నొకయంతఃపురదాసి వచ్చి యాతనికి వంగి నమస్కరించెను.

"ఎవరు నీవు!"

"ప్రభూ! నేను వేంకటాంబగారిదాసిని."

"వేంకటాంబగారిదాసివా! వారిప్పు డెచ్చటనున్నారు!"

"ప్రభూ! శ్రీరామభద్రనాయనింగారి యుద్ధమునకు భయపడి వారి నీపురమునకు సమీపమునున్న యొకయుద్యానవనమందలి భవనమున నుండ నేర్పాటు చేయించినారు. అమ్మగారు తమరాక విని నన్నిచ్చటికిఁ బంపించినారు."

"నీవు వా రున్న భవన మెఱుఁగుదువా!"

"అయ్యో! యెఱుగ కేమి ప్రభూ!"

"అయినచో నన్ను వారిదగ్గఱకుఁ దీసికొని పొమ్ము!"

ఆపమ్మట విశ్వనాథనాయకుఁ డొక పల్యంకిక నెక్కి-యాదాసి త్రోవ చూపించుచుండఁ గొంచెము బాగుగఁ గను చీఁకటిపడుసరి కాభవనము సమీపించెను. ఆభవనముచుట్టును నొకసుందరోద్యానవనము గలదు! విశ్వనాథనాయకుఁ డాయుద్యానవనము దాఁటి యొకవిశాలమగు చావడిలోఁ బ్రవేశించెను. వెంటనే యచ్చటనున్న యొకదాసి లోపలకుఁ బరువెత్తెను. విశ్వనాథుఁడు దడదడఁ గొట్టుకొనుచున్న హృదయముతో వేంకటాంబామీనాంబికలరాకకై యెదురుచూచుచుఁ గూరుచుండెను. మొట్టమొదట వేంకటాంబ లోనఁ బ్రవేశించెను. ఆమె లోనికి వచ్చి కేవలము నొక నిర్జీవప్రతిమవలె నిలువఁబడెను. ఆమెవెనుక మీనాంబిక లోనఁ బ్రవేశించెను. వేంకటాంబ లోనఁ బ్రవేశింపఁగనే కన్నుల నీరు పెట్టుకొనెను.

మీనాంబిక యాతనిని జూచి వంచిన తల పైకెత్తలేక పోయెను. విశ్వనాథుఁడు వేంకటాంబను జూచి 'అందఱికిని క్షేమమేనా?' అని ప్రశ్నించెను.

"ఆఁ! నీకుఁ దెలియని దేమున్నది నాయనా! ఈగడియ వఱకీవిధముగ నున్నాము. వారికువురును నావిధముగ నయిరా! మే మీవిధముగ నున్నాము!"

"మన మేమి చేయఁగలము! రాజధర్మ మట్టిది!"

"బాగుగనే యున్నది! రాజధర్మము నీవు చెప్పి యెవ రైన కన్నకుమార్తె కుత్తుకఁ గోయుదురా!"

ఆమె యామాట యనునది కాతనికి మీనాంబిక వేష ములో నేదో ప్రత్యేకత గోచరించెను. ఆమెపాదములపై చెరిగిన పారాణిరేఖలు కానిపించుచుండెను. అతనిమనస్సులో నొక్క సారిగ ననేకభావతరంగము లువ్వెత్తుగఁ బైకిఁ బొంగెను!

"అదేమి! అట్లనుచున్నారు!"

"నాయ మీనాంబికను జెవ్వవ్ప కిచ్చి వివాహము చేసి నారు నాయనా!"

విశ్వనాథునికనులలో నొక్కసారిగఁ జిమ్మ్రమను చీఁక ట్లావరించెను! అతఁడు నిర్ఘాంతపోయి "ఎవ్వడు!" అని ప్రశ్నించెను.

"మొన్ననే! అంతయుఁ బదిపదునేనురోజు లయినది!"

"దీనికంతకును గారకు లెవరు?"

"ఎవరని చెప్పను నాయనా! నమకుటిబ్రాఁత!"

"ఎంతటి రాక్షసత్వము!"

ఈవిధముగ నీ రిపువును మాట్లాడుచుండ మీనాంబిక తటాలున నొక స్తంభమునకుఁ జేరఁబడి మొగముపై గుడ్డఁ గప్పుకొని వెక్కి వెక్కి యేడువసాగెను! వెంటనే వేంకటాంబ యామెను దనహృదయమున కదుముకొని మెల్లమెల్లగ నోదార్పసాగెను. విశ్వనాథనాయకుని కీదృశ్యమంతయుఁ జూడగనే మనస్సు నీరయిపోయెను! అయినను నాతఁడు ధైర్యము చిక్కఁబట్టి వారిద్దఱిని శాంతపఱచెను. ఆతరువాత నాతఁడు రామభద్రచెవ్వప్పనాయకుల విషయమునఁ దనకధికారము లేదనియు అయినను సార్వభౌములు తనమాట త్రోసి వేయరనియు, ఇంకను వారివిషయమునఁ గొంచె మాశ కలదనియుఁ జెప్పెను. దానితో వారిరువురికిని బ్రాణములు కొంతవఱకుఁ గుదుటఁ బడినట్లయ్యెను! ఆపిమ్మట విశ్వనాథ నాయకుఁడు తంజాపురమున నొకదళవాయిని బ్రతినిధిగా నేర్పరిచి వేంకటాంబా మీనాంబిక లిరువురును సురక్షితముగ మధురచేరుకొనునట్లేర్పాటుఁ గావించి సత్వరముగ మధురకుఁ బయలుదేఱి పోయెను. మీనాంబికా పరిణయవార్త విన్నప్పటినుండియు నాతఁడు కేవలమును నొక పిచ్చివాఁడుగ మాఱిపోయెను.

---

## ౨౩

మధుర వచ్చినతరువాత విశ్వనాథునిమానస మొక ప్రబలయుద్ధక్షేత్రముగ మాఱిపోయెను. మొదట నాతఁడు వేంకటాంబామీనాంబికల దురవస్థఁజూచి జాలిపడి రామభద్ర చెవ్వప్పనాయకులప్రాణములు రక్షించుటకుఁ దగినసాయము చేసెదనన్నాఁడు. కాని వా రిరువురును మీనాంబికకును దనకును జేసిన దురన్యాయము తలఁచుకొన్నప్పు డెల్ల నాతని మనస్సు క్రోధజ్వాలలతో భగ్గున మండిపోవుచుండెను. మొదట వారికిఁ గొంచెము మాట యిచ్చుటఁబట్టిగాని లేకపోయినచో వా రిరువురిప్రాణములును నాతనిక్రోధాగ్ని కాహుతి కావలసినవే! వారిని రక్షించుట కింతకంటెఁగూడఁ బ్రబలకారణ మింకొకటియున్నది! విశ్వనాథనాయకుఁడు రామభద్రచెవ్వప్పనాయకులను నేలఁబెట్టి రాచివేయవలెనని యనుకొన్నప్పుడెల్ల నాతని యెదురుగఁ జాలిగా నేడ్చుచుఁ దమ్ము రక్షింపుమని ప్రార్థించుచున్న వేంకటాంబామీనాంబిక లిరువురును గనిపించుచుండెడువారు! దానితో నాతనిక్రోధము చాలవఱకుఁ జల్లాఱిపోవుచుండెడిది! అదియుఁగాక వారి నేమిచేయుటకును నధికారము లేకపోవుటఁగూడ నొకకారణమే! అందువలన విశ్వనాథనాయకుఁడు లోలోపల "నే నన్నమాటప్రకారము సార్వభౌమునికి వా రిరువురిని రక్షింపవలసినదని యొక కమ్మవ్రాసి పంపించెదను! ఆపైన వారేమి చేయవలయుననుకొన్న నట్లు చేసికొందురు! నాకేమి!" అని యనుకొనుచుండువాఁడు.

ఈసుధ్యఁ జరిగిన యాఘాతమువలన నాతఁడు చిక్కి శల్యమైపోయెను! ఆతనిమానసమున కెక్కడను విశ్రాంతి లేదు! భావియంతయుఁ గేవల మంధకారపూరితముగ నున్నది! తండ్రి కింకను దనపై బరిపూర్ణప్రసన్నత్వము కలుగలేదు! వేంకటాంబామీనాంబిక లావిధముగ నున్నారు! రామభద్ర చెవ్వప్పనాయకులమాట యేమగునో తెలియదు! చూచు చుండగ నాల్గేండ్లు లంచఁజీకినదా నొక పరమశత్రు నైపోయి నాఁడు. ఏమి చూచినను భ్రమయమే! ఏమి యీదురదృష్ట పరిణామము!

అప్పటి కప్పుడే తొలకరి కొంచెము కొంచెముగ నారంభించి, క్రమక్రమముగ గ్రీష్మమంతయు వర్షాకాలము వలె మాఱిపోవుచుండెను. అయినను గ్రీష్మతాప మింకను శమింపలేదు! సాయంకాలము కావచ్చినను నింకను నెక్కువగా నుక్కపెట్టుచునే యుండెను. విశ్వనాథనాయకుఁడు రాజసౌధము పైయంతస్తుపై బచారుఁ జేయుచుండెను. ఆతనిపార్శ్వమున వీరరాఘవనాయకుఁ డొక సుఖాసనముపైఁ గూర్చుండి, మెల్లమెల్లగ సంభాషించుచుండెను. వీరరాఘవనాయకుఁడు విద్యానగరమునుండి మధుర వచ్చి రెండు మూఁడురోజు లయినది. వచ్చినప్పటినుండియు నాతఁడు విశ్వనాథునిరాకకై కని పెట్టుకొనియుండెను! విశ్వనాథుని జూడఁగనే యావృద్ధుఁడు గాఢాలింగన మొనరించి, యాతనివిజయమున కభినందించుచుఁ గన్నులనీరు పెట్టుకొనసాగెను. విశ్వనాథనాయకుఁ డాతనిని

శాంతిపఱచి, తనప్రక్కనున్న యొకసుఖాసనముపైఁ గూర్చుండఁబెట్టెను. వృద్ధుఁడు వచ్చి నాలుగైదు నిమిషములకన్న నెక్కువ కాలేసు. ఆపిమ్మట మరల వారిరువురికిని దిరిగి సంభాషణము ప్రారంభ మయ్యెను.

చూచుచుండగ నాకాశమునఁ నల్లనిమేఘములు లాక్రమించి, యొక పెద్దవర్షము కురియసాగెను. విశ్వనాథుని కావర్షమువలన నొకింత శాంతి కలిగినట్లయ్యెను. చూరులనుండి జారు వర్షధారలు నిరంతరముగ భూమిపైఁ బడుచుండెను. మానవలోకధ్వని ప్రపంచమంతయు నావర్షమంద్రధ్వనిలో విలీన మయిపోవుచుండెను. ఆవృద్ధుఁ డావర్షమువలనఁ బ్రారంభించిన సంభాషణ మొకింతసే పాపి, మరల నవ్వుచు నిట్లనెను.

"నాయనా! నేను నీ కొక శుభవార్త చెప్పెదను! నా కే మిచ్చెదవు!"

విశ్వనాథుఁ డాతనియనూహ్యకత్వము చూచి లోలో నెంతయు నాశ్చర్యపడి 'నేను మీ కేమి యీయఁగలను!' అనియెను.

'నీ వీయఁ గలిగినదే!'

"మీశుభవార్త చెప్పినచోఁ దరువాతఁ జెప్పెదను!"

"నే నట్లు చెప్పను! నీజన్మములో నీ కిట్టి శుభపరంపర గలుగదు!"

విశ్వనాథుఁ డామాటపై నొక నిట్టూర్పు విడిచి "నా జన్మమున కింక శుభ మన్నది లేదు!" అనియెను.

"అట్లు కాదు! నీ వట్లనుటకు వీలు లేదు!"

"సరే! నే నీయఁగలిగిన దైనచో నట్లే యిచ్చెదను చెప్పుఁడు!"

"సరే! మాట తిరిగిపోఁగూడదుసుమా! శ్రీకృష్ణదేవ రాయలవారు మీనాయనగారిని క్షమించి బంధవిముక్తుల నొన రించినారు. ఆపిమ్మట నీరాజభక్తికి మెచ్చి నిన్ను మధుర కధి పతిగా నొనరించినారు. తంజాపురరాజ్యమునకు వేఱొక ప్రతి నిధిని నియమించువఱకును నీవే యారాజ్యమును పరిపాలింపవలె నని వారియభిమతము. ఇఁక మిగిలిన రాజద్రోహుల నంద ఱిని యోగ్యతాయోగ్యతలనుబట్టి నీవే నీయిష్టము వచ్చినట్లు శిక్షింపవచ్చును! ఈ శ్రావణ శుద్ధదశమినాఁడు నీపట్టాభిషేకము నకు శుభముహూర్త మేర్పాటు చేయించినారు! ఆనాఁడు వారును మహామంత్రులును స్వయముగ నిచ్చటికి విచ్చేసి నిన్నాశీర్వదింతుమని సెల విచ్చినారు! ఇన్ని శుభపరంపర లొక్కసారిగ నెవరికి వచ్చును! నాయనా!"

వృద్ధుని బుగ్గలపై నానందబాష్పములు కాలువలు గట్టెను. విశ్వనాథునికిఁ జాలవఱకును భారము తగ్గిన ట్లయ్యెను!

కాని యూతనిహృదయవిహంగ మొక్కసారిగ మహోన్నతా కాశములోని కెగుర లేకపోయెను! ఒక ఱెక్క విరిగి పోయిన పక్షి యాకాశమున కెగ్గురఁ గలదు! విశ్వనాథనాయకుఁ డంతయు విని యొకనిట్టూర్పు విడిచి "అంతయు బాగుగనే యున్నది. కాని నాకీమధురరాజ్య మక్కఱలేదు! సార్వభౌముల దగ్గఱ దళవాయిగా నుండుట యింతకంటె సుఖము!" అనియెను.

ఆపైన వృద్ధుఁడు "నీ వట్లనఁగూడదు! సార్వభౌము లాజ్ఞాపించుటచేకే గాని వారియాజ్ఞ యయినతరువాతఁ గాదను టకు మన మెవ్వరము! సరే! దాని కేమిగాని, మఱి నామాట యేమి చెప్పెదవు?" అనియడిగెను.

'సరే! అది యేదో చెప్పుఁడు!'

"తప్పకుండ నిచ్చెదవా!"

'ఆ! ఈయఁగలిగిన దయినచో నిచ్చెదను!'

"నాయనా! చిన్నప్పటినుండియు మా నాగాంబికను నీ కిచ్చి వివాహము చేయవలెనని యువ్విళ్లూరుచున్నాను. ఒకటి రెండుసారు లీవిషయము పెద్దనామాత్యులకుఁ గూడ విన్నవించి తిని. వారు సరే! దానికేమి! యట్లే యీయవచ్చునని చెప్పి యూరకుండువారు. మీ నాయనగారితో నన్నప్పుడు వారు 'మావాని కింకను బెండ్లివయసు లేదు!' అని యనుచుండు వారు! నాకు తథ్యముగ మాట్లాడుట తెలియదు నాయనా!

మాపిల్లకుండ సంగీతసాహిత్యములలో నారితేరినది! ఇది నీవు చేయఁగలిగిన విషయము! మఱి యాడినమాట తప్పఁగూడదు" అనియెను.

విశ్వనాథనాయకు డతఁ డీవిషయమడుగునని యను కొనలేదు! ఏమయినను మాట తిరుగుట కిష్టములేక "దీనిలో నాయిష్ట మేమున్నది! మా బాబయ్యగారి నడుగుఁడు!" అనెను.

"వా రంగీకరించిన దో నీ వంగీకరింతువా?"

"ఆ ! అంగీకరింతును!"

"అయినచో సరే!"

"మీారే వారి కీశుభపరంపరలన్నియు నెఱిఁగించి, కారాగారమునుండి విడిపింపవలయును."

"ఇంతకంటె నాకుఁ గావలసిన దేమున్నది!"

అని చెప్పి, యాతఁ డానందముతో నుప్పొంగుచు నచ్చటినుండి వెడలిపోయెను.

---

## ౨౪

విశ్వనాథునిజీవితమున నీమధ్య నానందముతో నుత్సాంగవలసిన సంఘటన లెన్నైన వచ్చినవి! ఒకప్రక్క వివాహప్రస్తావమువలన నాగమనాయకుఁ డాతని మొదలఁ బ్రసన్నుఁడయినాఁడు. నాగాంబికావిశ్వనాథుల వివాహముకూడ నాతఁడే స్థిరపఱచినాఁడు. రెండు మూఁడుదినములలో సార్వభౌములును మహామంత్రియు స్వయముగ నిచ్చటికి వచ్చి యాతని నాశీర్వదింప నున్నారు. కాని యాతనిహృదయశల్యముల నేదియో దహించుచు మెల్లమెల్లగ నుసి చేయుచున్నట్లుండెను. ఆతనికీరాజ్యము, ఈవివాహము మొదలగునవి యేమియు సుఖపెట్టలేకపోయెను. ఒక్కొక్కప్పు డాతఁడు రామభద్రచెవ్వప్ప నాయకు శిరస్సును నాయానందలతికను మొదలంటఁ బెగనఱికినాఁడు! వీనిని విడుచుట యేమి రాజనీతి! ఈయిరువురినిగూడ నొక్క యేనుఁగుపాదముక్రిందఁ బడవైచి మట్టించి వైచెదను. దానితో నాహృదయమునకు శాంతి గలుగును! అని యనుకొనుచుండువాఁడు! వెంటనే యాతనికనుల కెదురుగుండ నా యేనుఁగుపాదము మీనాంబికనుగూడఁ ద్రొక్కివేయుచున్నట్లగపడెడిది. ఆదృశ్యము చూచినసరి యాతనికనులనుండి కన్నీరు జొటజొటఁ గారుచుండెడిది. అంతే! సంపూర్ణముగ నాత్మశాంతి యెప్పుడును నాతనికి లభింపలేదు.

హృదయము దుఃఖభారముతోఁ గ్రుంగిపోవునప్పు డాతఁడు సుందరేశ్వరుని యాలయమున కేగి మీనాక్షీదేవిని దర్శించి యాదేవికి ఫలపుష్పాదు లర్పించుచుండును. నేఁడుకూడ నాతఁ డట్లే యాదేవాలయమున కేగి సభక్తికముగఁ బ్రణమిల్లి వివిధములగు స్తోత్రములతో స్తుతించెను. భక్తు లొనరించు ఘంటికానినాదములతో నాతనిమనస్సు బాహ్యస్మృతి మఱచిపోయెను. భక్తిపారవశ్యమున నాతని నేత్రములనుండి కన్నీరు కాల్వలై ప్రవహింపఁ జొచ్చెను. ఆవిధముగ నెంత కాలము గడచెనో యాతనికే తెలియలేదు.

ఆపిమ్మట నాతఁడు ప్రశాంతహృదయముతోఁ దనభవనమునకు మరలిపోయెను. మధురమీనాక్షీదేవిని మనసారఁ బ్రార్థించినప్పటినుండియు నాతని కేదో దివ్యప్రశాంతిచేకూరి నట్లయ్యెను. మధ్యాహ్నభోజనానంతర మాతఁ డొకపసిపాపనివలె సుఖముగ నిద్రపోయెను. ఆతఁడు లేచుసరికి మూఁడు జాములు తిరిగిపోయెను. అప్పు డప్పుడే బ్రహ్మాండమగు నొక కుంభవృష్టి కురిసినది. ఆకసము మెల్లమెల్లగ మేఘనిర్ముక్తమగుచుండెను. దిగ్భాగములలో నచ్చటచ్చట శ్వేతబలాకామాలికలు తళతళ మెఱయుచుఁ గన్నులపండువు సేయుచుండెను. వీథులలోఁ బ్రవహించు పిల్లకాలువలలోఁ జిన్నచిన్న కాగితఁపుఁబడవలు తేలిపోవుచుండెను. శ్రావణమాసపుఁ బేరంటాండ్రు చిత్రవిచిత్రములగు చీరలు ధరించి, వీథులలోఁ బిలుపులకై వెడలుచుండిరి. అప్పు డప్పుడు తడిసిన చెట్లనుండి

పక్షులు ఱెక్కలు విదిలించి మరల నాకాశమున కెగిరిపోవు చుండెను. ఆసమయమునఁ బత్రములనుండి రాలు జలబిందువులు సాంధ్యకాంతులతోఁ గలిసి బంగారుముత్యములవలె నేల రాలు చుండెను.

విశ్వనాథుఁడు సౌధముపై నిలుచుండి నగరసౌందర్య మీక్షించుచుండెను. ఆతనికి సంధ్యాతపములోఁ దళతళ మెఱయుచున్న మీనాక్షీసుందరేశ్వరుల యాలయ త్రిశూలమ్ము మిగుల సొగసుగఁ జూపట్టెను. ఇంతలో నొక యంతఃపుర పరిచారిక యాతని కొకకమ్మ చేతి కిచ్చెను. ఆతఁ డది యిట్లు చదువుకొనెను.

స్వస్తి "మహారాజశ్రీ మన్మహామేరుసమానధీరులగు శ్రీ శ్రీ విశ్వనాథనాయనింగారికి: మీ సోదరి మీనాంబిక యనేకప్రణామసహస్రము లర్పించి చేయు విజ్ఞప్తి; ఉభయ కుశలోపరి.

అన్నా! నేనును మాయమ్మగారును మి మ్మొకసారి దర్శించి పోవలెనని యనుకొన్నాము. ఇక్కడ మాకు మీరు తప్ప మఱియెవ్వరును లేరుగదా! మీరు దర్శన మిచ్చినచో నొకవిషయము మనవి చేసికొని వెడలిపోదుము. ఇప్పుడు దర్శన మిచ్చుటకు వీలులేకపోయిన మరియెప్పుడు రమ్మన్న నప్పుడు వచ్చెదము. అనుగ్రహించి మాసాహసము మన్నింపుఁడు.

మీ చిన్నచెల్లెలు,

మీనాంబిక.

లేఖ పఠించునప్పుడు "అన్నా!" యనునది చదువు పట్టున నాతని కోడలు జల్లుమని కనుల నీరు గ్రమ్మెను. వెంటనే యాతఁడు పరిచారికను జూచి "శత్రుఘ్న నామె వారిని సగౌరవముగ లోనఁ బ్రవేశపెట్టుము! అమూల్యములగు చీనిచీనాంబరములను నాణెపుముత్తెములహారములును సిద్ధము చేయుము!' అని యాజ్ఞాపించెను. వారు లోనికి వచ్చువఱకును మీనాంబికచే స్వహస్తముగ లిఖింపఁబడిన మూయక్షరముల సౌందర్యము చూచుచు నానందించుచుండెను. ఇంతలో నొక పరిచారిక వారిరువురిని లోనికిఁ గొనివచ్చెను. ఆమె వారి కుచితాసనము లమర్చెనుగాని వారిరువురును నట్లే నిలువబడియుండిరి. విశ్వనాథనాయకుఁ డత్యాదరముగ లేచి నిలుచుండి "కూర్చుండుడు! మీకు నే నేమైనఁ గ్రొత్తవాఁడనా? మీరు మథుర వచ్చినప్పటినుండియుఁ బ్రతిదినమును మీక్షేమసమాచారములు తెలిసికొనుచునే యున్నాను! ఇంకను రాజ్యవ్యవహారములు కుదుటఁబడకుండుటచే మి మ్మనుకూలమునను జూడవలయునని యనుకొనుచున్నను నది వీలులేకుండఁ బోయినది! ఇప్పుడే యొకసారి మీ యున్నభవనమునకు బయలుదేరి రావలయునని యనుకొన్నాను. ఇంతలోనే దాసి మీకమ్మ తెచ్చి యిచ్చినది! మీ రావిధముగ లేఖ వ్రాయుట యేమియు బాగుగ లేదు. ఇంతలోనే నేను బరాయివాఁడ నయిపోయితినా! ఎంతమాట! కాకిచేఁ గబు రంపినచో ఱెక్కలు కట్టుకొని మీయెదుట

హా రెలనా? దీనికొఱకై ప్రత్యేకముగఁ బనిగట్టుకొని యిక్కడకు రావలయునా!" అనెను.

వేంకటాంబ—నాయనా! మధుర వచ్చినప్పటినుండియు మే మన్నివిధములను సుఖముగనే యున్నాము, కాని వారిరువురును నావిధముగఁ గారాగారములోఁ గ్రుమ్ముచున్నప్పుడు మా కన్నమెట్లు రుచించును నాయనా! ఇచ్చటికి వచ్చినప్పటి నుండియు మీనాంబిక యీవిషయమున నిన్నొకసారి చూచి వత్తమని యనుచున్నది. ఆపిమ్మట నీవు మధురాధిపతి వగుటను వినికూడఁ దెలిసినది! నరేకదా! యని నిన్నొక్కసారి చూచుటకై బయలుదేరి వచ్చితిమి. పరమేశ్వరుఁడు సన్మార్గుల నెప్పుడును బాధ చేయఁడు! నాయనా!

విశ్వ—(నిట్టూర్చి) ఆఁ! నాయదృష్టము మీరే పొగడ వలయును!

వేంకటాంబ— మన మేమి చేయఁగలము నాయనా! ఇంతకును విధివిధాన మట్లున్నది! లేకపోయినచో మా కీయవస్థ యేమి చెప్పుము! నాయనా! వారిరువురును నావిధముగఁ గారాగారములోఁ గ్రుమ్ముచు నుండవలసినదేనా? మా కీ విషయమున నేమియు నాశాలేశము లేదా?

విశ్వ—ప్రస్తుతము వారివిషయమున నేమి చేయుటకును నా కధికారము లేదు!

వేంక—మఱి నీ కెప్పు డధికారము గల్గును?

విశ్వ—దేవు పట్టాభిషేకము జరుగగనే నాకు పైదీ లందఱిమీఁదను సర్వాధికారము లభించును. అయినను సార్వ భౌముల కీవిషయము నివేదింపవలసియే యుండు ననుగొనియె దను. కాని యధికార మంతయు నాస్వహస్తగత మయినది గాన సార్వభౌములు నావిన్నపము త్రోసిపేయరని తలంచెదను. అందుచే నంతవఱకును వారి కీకారాగారని వాసము తప్పదు!

వేంక—నాయనా! అసలు ప్రాణములు దక్కినచోఁ గారాగారవిముక్త యెప్పుడు కలిగినను భయము లేదు!

విశ్వ—ఆవిషయమున మీ రేమియు భయపడ నక్కఱలేదు! వీలైనచో సార్వభౌములకుఁ బ్రత్యేకముగ నివేదించి పట్టాభిషేకమునకు ముందుగనే వారిరువురిని విడిపించుటకుఁ బ్రయత్నించెదను.

ఆమాటలు వినునరికి వేంకటాంబా మీనాంబికల ముఖ ములు రెండును నొక్కసారిగ వికసించెను. ఆవిస్మయంగ గొంత సేపటివఱకును వారిలో వారి కనేకవిషయములను గూర్చి సల్లా పములు జరిగెను. అతరువాత సూర్యాస్తమయము కాఁగానే వేంకటాంబా మీనాంబిక లిరువురును దమభవనమునకుఁ బోవ నుంకించిరి. విశ్వనాథుఁడు వారిరువురిని మఱికొంచెము సేపాఁపి చీనిచీనాంబరములును, విలువగల యాభరణములహారములును దెప్పించి వారిని బహూకరించెను. మీనాంబిక వచ్చినప్పటి నుండియు నేదో యాలోచించుచు సంకోచకసైపుమునకుఁ జూచుచు నిలుచుండెను. విశ్వనాథనాయకుఁడు తండ్రికిని భర్తకును బ్రాణ

దానము చేయుదునని చెప్పఁగనే యామెకనులనుండి వేడివేడి బాష్పములు నేలపై రాలెను. విశ్వనాథనాయకుఁడు దాసీలచేఁ జీనిచీనాంబరములు తెప్పించినప్పు డామె స్వీకరించుట కొకింత సిగ్గుపడెను. కాని తరువాతఁ దల్లి చెప్పుటవలన నవి స్వీకరించెను. ఆపిమ్మట వేంకటాంబ యామెతో "అన్నయ్య కొకసారి నమస్కరింపుము! తల్లీ!" యనెను. మీనాంబిక కన్నీటితో నాతనిపాదములు తడుపుచు సవినయముగ నమస్కరించెను. విశ్వనాథునికంఠమున గద్గదిక వొడమెను. అతఁడు సత్వరముగఁ దనపాదములు వెనుకకు లాగికొనుచు నామెతో "అమ్మా! వలదు! నిజముగ నేనే నీ పాదములకు నమస్కరింప వలయును!" అనెను. ఆపిమ్మట వేంకటాంబ సగద్గదముగ నాతనియొద్ద సెలవుఁ గైకొని మీనాంబికను వెంటఁబెట్టుకొని స్వభవనమునకుఁ దరలిపోయెను.

విశ్వనాథుఁడు బాష్పస్విన్ననయనములతో లాక్షాచిహ్నాంకితములగు నామీనాంబికాపాదమందారములు చూచుచునట్టులే నిలువఁబడిపోయెను. ఆపాదమందారము లాతని హృదయమున రెండగ్నిజ్వాలలవలె మండెను! వేదనాంకుచితములగు నయనములతో నాతఁ డొక్కసారిగ మనసార నామధురమీనాక్షీ దేవిని సంస్మరించెను. ఆసంస్మరణములో నెంత కాలము గడచినదో యాతనికే తెలియలేదు! ఇప్పు డాతని మనస్సులో నేదియో దివ్యపరిశాంతి యావిర్భవించినట్లు పొడకట్టెను! ఇప్పు డాతనికి మీనాంబిక తన్ననుగ్రహించి వెడలి

పోవుచున్న సాక్షాన్మధుర మీనాక్షీదేవివలెఁ గన్పట్టెను. భక్తిపారవశ్యమున మధుర మీనాక్షీదేవి పాదపద్మములకు నమస్కరించి తనజనకుఁడు సంపాదించిన యమూల్యధనరాసు లన్నియు మీనాక్షీసుందరేశ్వరుల యాలయములకై వ్యయ పఱుప వలెనని నిశ్చయించెను. వెంటనే యాతని హృదయ నేత్రముల కెదురుగ నత్యద్భుత శిల్పసౌందర్య శ్రీవిరాజితము లగు నాభావి దేవాలయాకృతులు ప్రత్యక్షమయ్యెను.

దూరమునుండి గట్లొరసి పాఱుచున్న వైగైనదీతరంగ ఘోష వినవచ్చుచుండెను. వాన బాగుగ వెలియుటచేఁ బక్షుల కలకలారావములతోఁ గలిసిన బాలురక్రీడా కోలాహలములా ఘోషశ్రుతిపై నృత్యము చేయుచుండెను. చివరి కన్నిధ్వను లును మహోన్నతమగు నా యనంతాకాశమున విలీన మయి పోవుచున్నట్లు భాసించుచుండెను.





Printed by Royal Printing Works Tanuku, For Rowthu Book Depot. Rajahmundry. Date 18-3-48



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA115B149 |
| పుస్తకం పేరు | మీనాంబిక |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 211 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Kasimbi |
| పేజీలు విడదీసినది | Kasimbi |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |